# వి ష య సూ చి క

# భాగవతకథ

## రాసేశ్వరుని రాసేచ్ఛ

శ్లో॥ భగవానపితా రాత్రీః
శరదోత్ఫుల్ల మల్లికా
వీక్ష్య రంతుం మనశ్చక్రే
యోగమాయా ముపాశ్రితః॥

భా॥ ౧౦ స్కం. ౨౯ అ. ౧ శ్లో

వ. ఆశరద్రాత్రిని భగవానుడు యోగమాయ నాశ్రయించి రమింపఁదలఁచెను. (౯౨౯)

ప్రేమపథము చాల సరళమార్గము. ప్రేమ మనస్సున కనుకూలమగు మార్గము. ప్రేమను గోరని వాఁడును, ప్రేమాభిలాష మనస్సులో లేనివాఁడును నీ ప్రపంచమం దెవఁడును నుండఁబోఁడు. ఎవరికైనను ప్రేమ అపరిచిత వస్తువు కాదు. ప్రేమ నందఱు నెఱుఁగుదురు. పశు, పక్షి, కీట పతంగాదులును ప్రేమించుట యెఱుఁగును. భేదమేమనఁగా నొకటి నిత్య ప్రేమ, మఱియొకటి అనిత్యమునందు ప్రేమ,

ఒకటి బింబము నందు ప్రేమ, మఱియొకటి ప్రతిబింబము నందు ప్రేమ, ఒకటి సత్యమునందు ప్రేమ, మఱియొకటి అసత్యమువందు ప్రేమ. సత్యమునందు కలిగిన ప్రేమ సత్యముగానుండును. అసత్యమునందు కలిగిన ప్రేమ అసత్యముగానుండును. దానినే మోహమనియు నందురు. సత్య ప్రేమ ముక్తికిఁ గారణమగును. అసత్య ప్రేమ వలనఁగలిగిన మోహము బంధనమునకుఁ గారణమగును. ప్రేమ సాధన వలన గలుగదు. అది దైవేచ్ఛ చేతను, పూర్వజన్మ సంస్కారము చేతను గలుగును. లోకమందును నందఱియెడలఁ బ్రేమ కలుగదు. ఎవరితో మనస్సు కలియునో వారియెడలఁ బ్రేమ కలుగును. మనస్సు కలియక దగ్గఱనున్నను బ్రేమ కలుగదు. ప్రపంచమందు ప్రేమకే ప్రక్రియ యుండునో, పరమార్థమందును నుండును. ఈ రెంటికిని భేద మేమనఁగా సాంసారిక ప్రేమాస్పదము నశ్వరమగును ననిత్యముగను నుండును. పరమార్థ పథముననున్న ప్రేమాస్పదుఁడు నిత్యుఁడు, శాశ్వతుఁడు. భగవంతునియొక్క భిన్న భిన్న కార్యములకొఱకు భిన్న భిన్నములగు నవతారములు కలుగును. కొన్ని అవతారములు జ్ఞానప్రసారముకొఱకు జ్ఞాన మహత్వము కొఱకు జరుగును. హంసకపిలాది అవతారము లట్టివే. యుగావతారముల వలెఁ గొన్ని యవతారములు ధర్మస్థాపనము కొఱకు వచ్చుచుండును.

రామాద్యవతారములవలెఁ గొన్ని యవతారములు మర్యా దను స్థాపనార్థమై వచ్చుచుండును. కాని కృష్ణావతారమునకే యైక ప్రయోజనము ప్రేమ ప్రచార మొనర్చుటకే, ఆ కృష్ణావతారమందు గనఁబడు శ్రీకృష్ణుని ప్రేమలీలలును, ఆ యవతారమునఁ బ్రవహింపఁజేయబడిన సుఖదాయిని యగు ప్రేమ సరిత్తు మఱి యే యవతారమునను గనఁ బడదు. అందువలన నీ యవతారము పరిపూర్ణతమముగ నెన్నఁబడినది. రాసలీల ప్రేమయొక్క పరాకాష్ఠ, సాధారణ ముగఁ బ్రేమకు మూఁడవస్థలు కలవు. పూర్వానురాగ మంకురము కలయిక చిగిర్చి పుష్పించిన పూర్ణ వృక్షము. వియోగము మధురాతి మధురమగు దాని పక్వఫలము. పూర్వానురాగముయొక్క పరాకాష్ఠ దర్శనసుఖము కలియిక యొక్క పరాకాష్ఠ రాసవిలాసము. విరహము యొక్క పరా కాష్ఠ దశమదశయగు మృత్యువు. ఇది సాధారణరీతి ననుస రించి పై పై భేదము జెప్పఁబడినది. వాస్తవమునఁ బ్రేమ యందెన్నడును వియోగమనునది లేదు. నిత్య సంయోగ మునకే ప్రేమయని పేరు కలదు. విరహము కలియికయొక్క ఒకానొక యవస్థా విశేష మే.

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఇప్పుడు నేను శ్రీకృష్ణచంద్రునియొక్క పరమ దివ్యాతిదివ్య రాసలీలా వర్ణనమును జేయఁదలఁచుచున్నాను. మీరు నాకనుమతి

నాసంగినచో వర్ణించెదను. ఈ విషయమును వదలిన బాగుండునని నాకు మనస్సునకు వచ్చుచున్నది. దీనిని వర్ణించుటలో నాకు భయము వేయుచున్నది.''

శౌనకుఁడిట్లడిగెను :- ''సూతా! భగవచ్చరిత్రలను వర్ణించుటలో భయమెందులకు? భగవంతుని చరిత్రలను నిర్భయులై వర్ణింపవలయును. భగవచ్చరిత్రలు భయమును నాశమొనర్చును. నీవు పరమ మధురాతి మధురమగు రాస లీలా వర్ణన మొనర్చుటలో భయపడు టెందులకు?''

అంత సూతుఁడవసరమునకు మించిన గంభీరుఁ డయ్యెను. అతఁడు కొంచెము సేపటి వఱకు మాటాడఁజాలక కొంచెము సంబాళించుకొని యిట్లనెను:- ''స్వామీ! భగవ చ్చరిత్ర వర్ణనమునకు భయ మవసరములేదు, కాని యీ రాసలీలా ప్రసంగమతి గూఢాతి గూఢమైనది. దీనివర్ణనము వైఖరీ వాక్కుతో వర్ణించుట మిక్కిలి కష్టము. ఈ వర్ణన ములోఁ ప్రాకృతి బుద్ధియుండిన శ్రోతలును, వక్తయును బతనమై తీరెదరు. సింహముపాలు స్వర్ణపాత్రలోనే నిలువఁ గలవు. కాని అన్యపాత్రలలో నిలువఁజాలవు. ఇతర పాత్రల లోఁబడఁగానే ఆ పాత్రలు పగిలిపోవును. అట్లే నిర్మలమగు మనస్సులలోనే యీ లీలలు నిలుచును. ఇది సాధారణ స్త్రీ పురుష కామ క్రీడలని భావించినచో నట్టి వానికిఁ బత

నము తప్పదు. అందువలన నేను దీనిని యథార్థముగా వర్ణనము చేయఁగలుగుదునో లేదో యని భయపడు చున్నాను. మీ విషయములలో నాకేమియును భయము లేదు, మీరు కామక్రోధాది రహితులగు బాల బ్రహ్మచారులు నందనందనుని కృపాపాత్రులు - నాకు నా విషయమున నేయే పెడమార్గమును బట్టుదునో యని భయము కలదు."

అంత నవ్వుచు శౌనకుఁడిట్లనెను :- "సూతా! నీవు చింతింపవలసిన పనిలేదు. మంగళ మయుఁడగు భగవానుఁ డంతయును మంగళ మయముగ నొనర్చును. ఎవని హృదయములోఁగూర్చుండి భగవంతుఁడు తన భువన పావనమును మంగళమయమునగు కథా స్రోతను బ్రవహింపఁజేయు చున్నాఁడో అట్టివాని మనస్సులో కామక్రోధాది వికారము లెట్లు రాఁగలవు. ఏ కారణము చేతనైన వచ్చినచో నవి వెంటనే నశించిపోవును. నీవు చింతింపవలదు ముందుగా నీవు మాకు పూర్ణానురాగ స్వరూపమును జెప్పి తరువాత రాస లీలనుగూర్చి చెప్పుము."

సూతుఁడిట్లనెను :- "మునులారా! ఈ విషయ మతి గహనమైనది. విశాలమైనది దీనిని యథారీతిగ వర్ణించుట చాల కష్టమేకాదు, అసంభవము ఇది అనుభవ విషయము. వైఖరీ వాక్కుతో దీనిని వర్ణించినచో దీని స్వారస్యమే

నశించిపోవును. దేవవాణిలోఁగల పూర్ణ స్వారస్యము ప్రాకృత వాక్కులో నెట్లు రాఁజాలదో, అట్లే ప్రభు ప్రేమ వర్ణనము నీ లౌకిక భాషలోఁ దెలుప వీలులేదు. అట్లు తెలుపఁ బూనినచో దానిలోనికి లౌకికత వచ్చి తీరును. వర్ణన చేయఁ బడునది ప్రేమ కానేకాదు. వ్రేలితోఁ జంద్రునిఁజూపించుచు 'అదిగో, చూడుఁడా చెట్టుమీఁద నా వ్రేలిముందు చంద్రుని' అని పలికినచో నా చెట్టుమీఁదను నిజమునకుఁ జంద్రుఁడును లేఁడు, వ్రేలుముందును లేఁడు, కేవల మీ రెండు సంకేతముల వలన దృష్టినిఁ జంద్రుని వైపునకు మరల్చుటయే. అట్లే ప్రాకృత భాషలో నేను ప్రేమ సంబంధమునఁ జేయు వర్ణనము, కేవలము ప్రేమయొక్క ఛాయామాత్రమే. దీని ద్వారా యీ యద్భుత రసము నూహించి అనుభవము చేయవలెను.

ప్రేమ యెవని హృదయములో నుదయించునో, యెప్పుడుదయించునో, యే కారణమున నుదయించునో, యెచ్చట నుదయించునో, యీ విషయముల కే నియమమును లేదు. ఎవని విషయముననైనను వినుటచేతను, చదువుట చేతను, ఇతరుల వలనఁ దెలిసికొనుట చేతను హృదయ మందావిషయమున నాకర్షణము కలుగును. ఎవనియెడల నాకర్షణము కలుగునో ఆతని నామము ప్రియముగ నుండును. ఆతని గుఱించి యెవని నోటనైనను వినినను, నేదైన ప్రసంగ

వశమున నాతని నామము వెలువడినను వినఁగానే అనురాగి యులికిపడును. కర్ణములా చర్చను వినఁ గుతూహలపడును. ప్రేమ స్వరూప మొక్క స్థితిలో సంతుష్టినిఁ జెందకుండుటే ప్రేమ నిత్య నవీనత్వమును గాంక్షించును. ప్రేమ ప్రతి క్షణమును వృద్ధిపొందును. ప్రేమకును, మోహమునకును నిదియే గుర్తు. ఎవని మీఁదనైన మోహము కలిగెనా, అది కొలఁది దినములలోఁ దగ్గిపోవును, వికలమగును, మోహ క్షయమే మోక్షము. జ్ఞానము కలుగఁగానే మోహమంత యును నాశమగును, కాని ప్రేమ వృద్ధిపొందుచునేయుండును. దానిలో హ్రాసమనునది యుండదు. ఎంతవఱకు పెరుగునో దాని కేదైనను హద్దు దానికంతు కలదాయనిన దానికి హద్దు, అంతు లేదు. అది పెరుగుచునే యుండును. పెరుగుటయే దాని స్వభావము; దాని ధర్మము, దాని ప్రకృతి లోభివాని కడ నెంతటి ధనమున్నను వానికి తృప్తి కలుగదు. నిత్యమును దాని నధికముగఁ బొందుట కభిలషించుచుండును. ప్రేమ హృదయమందుత్పన్నము కాఁగానే ఒక్కసారి ఆతనిఁ గాంచినఁ జాలును; ఇంకేమియు నక్కఱ లేదనిపించును. ఆతనిఁ జూడఁగానే మనస్సుపోవును. నేత్రములుత్పన్నములగును. ఆతని నొక్కసారి కన్నులారఁ జూతమని చిత్తము కాంక్షించు చుండును; కాని ప్రేమాస్పదునిఁ జూచుటచే నెన్నడును గన్నులు తృప్తినిఁ జెందవు. పైఁగా నింక నధికముగ వికలము

లగును. సదా సర్వదా ఆతనినే చూడవలయుననియు, నొక్క క్షణమైనను దనకు దూరము కాఁగూడదనియు, నెల్లప్పుడును దన కన్నులయెదుట నిలిచియుండవలయు ననియుఁ గోరుకొనుచుండును. కాని మన కెవ్వనియందు ప్రేమ కలదో ఆతఁడు మన మాటను కాదనఁడనుట కధికార మేమున్నది. ఆతఁడు స్వతంత్రుఁడు. ఆతఁడు మన లను గాంక్షించుచున్నాఁడో లేదో అందును సందేహము కలదు. ఆతఁడు కాంక్షింపనిండు, కాంక్షింపక పోనిండు ప్రేమ సదా ఏకాంగియనియు, నంధమైనదనియుఁ జెప్పఁ బడినది. ప్రేమ యే విధమగు గుణములను గాంక్షింపదు. గుణములను గోరి ప్రేమించుటకు శ్రద్ధయని పేరు. ఎవరికడ నైనఁ బ్రభావముండిన ననఁగా నాతఁడు గొప్ప త్యాగి, తపస్వి, సుందరుఁడు, విద్వాంసుఁడు నైనచో నాతని యెడల శ్రద్ధ కలుగును. ఆతనిలో నా గుణములు లేకున్నఁ ననగాఁ ద్యాగి రాగి యైనను, సురూపుఁడు కురూపియైనను, తపస్వి భోగియైనను, లేక చెడ్డకార్యములచేఁ బ్రభావము తగ్గిన మన శ్రద్ధయును దగ్గిపోవును. కాని ప్రేమయందిట్టిది లేదు. ఆతఁడు సుందరుఁడు కానిండు, కురూపి కానిండు, గుణి కానిండు, నిర్గుణుఁడు కానిండు, ఆతఁ డావలకుఁ ద్రోసినన్ను, తన్ను స్వీకరించినను, సేవగించినను నా సర్వస్వ మతఁడే నను. ఇట్లుండినను నాతఁడు తటస్థుఁడుగ నుండు ననఁజాలము.

గొప్ప గొప్ప విరాగులును, మహాత్ములును ప్రేమాకర్షణ సమ్ముఖమున నతమస్తకులగుచుందురు. అట్టి యెడ రసిక శేఖరుఁడగు నందనందనుని విషయమునఁ జెప్పనేల? ఆతఁడు ప్రేమ కేకైక స్వరూపుఁడు. ప్రేమయే ఆతని కాహారము ఆతని చేష్టలన్నియును దన్నుఁ బ్రేమించు వారికొఱకే. ప్రీతి రీతి నెఱిఁగిన వాఁడతఁడే.

హృదయమం దెవని యెడలఁ బ్రేమయుత్పన్నమైనదో, ఆతనిఁ గాంచుటకుఁ గన్ను లువ్విళ్లూరుచుండును. ఆతఁడే మార్గమునఁబోయినాఁడో అచ్చట జాముల కొలఁది నిలుచుండి ఆతనినిఁ బ్రతీక్షించుచుండును. ఆతఁడా దిక్కుగా నిత్యమును పోఁడనియు, నెప్పుడెప్పుడో వెడలుచుండుననియు, నిప్పుడే వచ్చునని నమ్మకము లేదని తెలిసినను, కొంచెముగ నాకుల చప్పుడయ్యెనా చిత్తము స్పందించును, నేత్రములాం దిక్కునకే చూచుచుండును. ఈ ప్రతీక్షలో నెంతటి సుఖము కలదో యెన్నడైనఁ బ్రతీక్ష చేసినవానికే తెలియఁగలదు.

వ్రజమందలి గోపాంగనలందఱకును శ్యామసుందరుని యెడల సహజానురాగము కలదు. వాత్సల్యభావము కలవారు బాలకునిగ భావించి ప్రేమించెదరు. మధురభావము కలవారు శ్రీకృష్ణునిఁ బ్రేష్ఠునిఁగ భావించి ప్రేమించెదరు. ఈ వ్రజాంగనలలోఁ జాలమంది కౌమారావస్థలో నుండిరి. వారు

శ్రీకృష్ణునిఁ బతిగా భావించుచుండిరి. ఇందులోఁ గొందఱకు లౌకిక పతులును గలరు. ఒక పతిని వీడి వేఱొక పతితో సంబంధము కలవారిని వ్యభిచార దుష్టలందురు, ఉపపతిని జారుఁడందురు. అందువలన నీ సంబంధమును జార సంబంధ మందురు. కాని యిది సాధారణ జనుల విషయము. సర్వాంత ర్యామియగు ప్రభునియందు గల పతి సంబంధము వాస్తవిక సంబంధమే లౌకిక దృష్టితో దీనిని జారసంబంధమందురు. భాష లౌకిక విషయములనే చెప్పఁగలదు. ప్రేమ మర్మ మును వ్యక్తపఱచుటకు దానికి సమీపమగు శబ్దకోశమే లేదు.

గోపికలందనేక రకముల గోపికలు కలరు. కొందఱు నిత్య పరికరులు. వీరు శ్రీకృష్ణుని యథార్థమగు స్వరూపము నెఱుఁగుదురు. వారు శ్రీకృష్ణుఁడు గోపీనందనుఁడే కాదనియు, నఖిల ప్రాణుల కంతరాత్మయనియు నెఱుఁగుదురు. కొందఱి కాతని యథార్థస్వరూపము బాగుగాఁ దెలియదు కాని ఆతనిపై నాసక్తి కలదు. ఆతని రూప మాధురికిని, వేణు మాధురికిని, లీలా మాధురికి నాకర్షులైరి. వారు శ్రీకృష్ణ దర్శనము కొఱకు అహర్నిశలు వ్యాకులతను జెందియుందురు. లోక దృష్టిలో శ్రీకృష్ణుని వయస్సు తొమ్మిది, పది సంవత్సరము లుండును, కాని మధురభావోపాసకుల కాతఁడు నిత్య కిశో

రుఁడే. ఈ రహస్యమును వాత్సల్య భావోపాసకులగు గోపిక లెఱుఁగఁజాలరు.

కోరికయున్నను నింటిలోపలనుండు గోపికలు నిరంతరము శ్రీకృష్ణునిఁ గలిసికొనఁజాలరు. శ్రీకృష్ణుఁడా స్వచ్ఛంద విహారి. వా రంతఃపుర మందుందురు. శ్రీకృష్ణుని దర్శించుటకు మూఁడే సమయములు కలవు. వారు కడవలను బట్టుకొని యమునలో నీరు తేఁబోయినపుడును, గోశాలలో గోమయమును దీయునపుడును, పాలు పితుకఁబోయినపుడును, మూఁడవది పాలు, పెరుగుల నమ్మఁబోయినపుడును, ఈ మూఁడు సమయములంతెగాక యితర సమయములలో బయలుదేరినచో నత్తలును నాడు బిడ్డలును ననేకవిధముల సందేహించెదరు. ఒకటికి పది మాటలను గల్పించెదరు. లోకులును నానావిధములుగ ననుకొనుచుందురు. ఇంటిలో వివిధ కల్లోలములు కలుగును. ప్రేమ యీ బంధనములను లక్ష్యపెట్టకుండినను, ఇవన్నియును ప్రేమ పోషకములే. ప్రేమ విషయములన్నియును రహస్యమయములుగనే యుండును. వాని వర్ణనము రహస్యముగనే యుండును. పత్ని పతికి దన సర్వస్వమును సమర్పించును. ఈ విషయ మందఱకును దెలిసినదే, అయినను నందఱయెదుట పత్ని పతినిఁజూడదు. ఒక వేళఁజూచినచోఁ గొంగుచాటు చేసికొని చూచును.

ఆ కొంగుచాటుగాఁ జూచుటలోను నొక యపూర్వమగు సౌందర్యము కలదు.

దర్శనము కాగానే స్పర్శేచ్ఛ జనించును. లాభమున లోభము పెరుగును. ఏకోవిధముగ శ్యామసుందరుని శ్రీ యంగమును స్పర్శింపవలయునని కోరిక కలుగును. ఆతని మధురమగు ప్రియ వాక్కులను వినఁ గోరిక కల్గును. ఆతని కిది తెలియును. శ్యాముఁ డొక్కొక్కసారి యమునాతీరము నకుఁబోవును. వ్రజమందు వ్రజవాసినులగు స్త్రీలే నీరు తేఁ బోయెదరు. యమున సమీపమున నుండుటచే యమునా జలమును దెచ్చుకొందురు. దూరమగుచోఁ గూప జలము లను దెచ్చుకొందురు. వ్రజమందు పనఘట్టమందుగల దృశ్య మింకే దేశమందును నుండదు. వ్రజమందలి మృత్తిక అతి నునుపు, జిగురు, అచ్చట గులక ఉండదు. అచ్చట మట్టి తోడనే యిండ్లు కట్టఁబడును, కఱ్ఱలను పాతి, పెండెకట్టుకట్టి దానికి మట్టిని మెత్తెదరు. పైన కప్పుకూడ మట్టితోనే వేసి కొందురు. ఆ మిద్దెటిండ్లే వందలకొలఁది సంవత్సరములు గడుచును. నీరు తెచ్చుకొనుటకును నీరుతోడుటకును మట్టి పాత్రలనే వినియోగించుకొందురు. ఇప్పుడు లోహపాత్రలు, డబ్బాలు వాడుకలోనికి వచ్చినవి. పూర్వము మట్టి కడవల తోడనే నీరు తోడుకొనెడువారు. మట్టి తొట్లలోనే నీటిని నిలువఁ జేసికొనుచుందురు. స్త్రీలు పిండిని విసురుకొని, చల్ల

జేసికొని నీటినిం దేంబోయెడువారు. పొయ్యిపనియు, వంట పనియు నింటిలోనే జరుగును. గావున మాసిన గుడ్డల తోడనే అవి జరిగిపోవును. నీరు తెచ్చుటకు బయటకుం బోవలయును. కావున నవీన వస్త్రములను ధరించుకొని పోయెడువారు. పెద్దవారును, ముసలివారిపని కోడండ్రమీంద నాజ్ఞలను గురిపించుటయే వారి పనులలో దోషములను గాంచుటయును. వారు పై పై పనులను గూడ చేయు చుందురు. కోడండ్రు వంటచేసిన, నత్తలు వడ్డించుచుందురు. అత్త యుండంగాం గోడండ్రు వడ్డింపరు, కోడండ్రు లేనపుడే ముసలివాండ్రు నీరు తేంబోపుదురు. ఇది శ్రమ కార్యము. రెండవది నీరు తెచ్చుటయు, వంటజేయుటయు యువతులగు కోడండ్రుగాని, పెద్దవారైననాడు పిల్లలుకాని చేయవలసిన పని, నీరు తేంబోయినపుడు సుందరమగు తిరుగులంగాను ధరించెదరు. తళ తళలాడు రంగుల రంగుల పైంటపావడాను గప్పుకొందురు. కొంగును గట్టిగ దోంపుకొందురు. ఒకచేత మేలి ముసుంగును బట్టుకొందురు. శిరస్సునం జుట్టను బెట్టు కొని దానిపైం బెద్దకుండ నుంచుకొందురు. దానిపై నింకొక చిన్న కుండను, మరల దానిపై నింకను జిన్నకుండను బెట్టు దురు. ఒక కలశమును జంకలోం బెట్టుకొందురు. త్రాటిని భుజముమీంద నైచుకొని, నడుము నూగిసలాడించుచు రెండు వ్రేళ్లతో మేలిముసుంగు నంచ చూచుచు వెళ్లుచుందురు.

సాధారణముగ నొకే సమయమున నందఱును గలిసి వెడలు చుందురు. రంగుల రంగుల చీరెలను ధరించి వ్రజస్త్రీలు పన ఘటమునందు స్వర్గసరోవర సమీపమున నప్సరసలు కూర్చుండినట్లుందురు. అత్తలయొక్కయు, నాడు బిడ్డల యొక్కయు నదుపులేని సమయమిదియే. నీరు తెచ్చుచున్న నపుడు వారు కడుపునిండ నోరార మాట్లాడుచుందురు. వారి వారి కష్టసుఖములను వారు పరస్పరము చెప్పుకొనుచుందురు. కావున నీ సమయము చాల సుఖదమైనది.

ఇప్పుడు వ్రజమందంతటను శ్రీకృష్ణుని సౌందర్య మాధుర్యములను గూర్చిన చర్చియే. శ్రీకృష్ణుఁ డేసమయ మునఁ బనఘటము వైపునకుఁబోవునో సరిగా నా సమయ మునందే ఆతని దర్శింపవలయునను లాలసచే వ్రజాంగవ...ను నీరుఁదేఁబోయి జాముల తరబడి ప్రతీక్షించుచుందురు. శ్యామసుందరుని దర్శన మేనాఁడైసరో ఆ దినమును సుదిన ముగ భావించి, వారు తమ జీవితములు ధన్యమైన వని తలంచె దరు. దర్శనము కాని రోజునఁ జింతాక్రాంతులై, మరు నాఁడ దేసమయము వఱకు ప్రతీక్షించుచుందురు. ఇప్పుడు దర్శనము వలననే శాంతి కలుగుట లేదు. ఒక దినమున నొకతె యిట్లనెను:- "శ్యామసుందరా! మా చేదనిటు తెమ్ము" శ్యాముఁడు మిక్కిలి ప్రేమతో చేదనందించెను.

త్రాటిని ముడిచెను. పొరపాటున నాతని చేయి గోపిక యొక్క శరీరమునకుఁ దాకెను.

ఇప్పు డందఱకును సాహసము కలిగెను. అందఱును జేద నందించుమనుచుండిరి. ఇప్పుడు శ్రీకృష్ణుఁడును చిన్న చేదను చేబూని నీరు తోడఁబోవుచుండెను, "అతఁడు యమునను వదలి చిన్న చేదతో నీటినిఁ దోడు టేమి?"

ఇప్పు డెందులకు నీటినిఁదోడుచున్నాఁడో ఆయననే యడుగవలెను. ప్రేమయందలి పనులన్నియును ప్రేమకొఱకే చేయఁబడుచుండును. వానిలో నెందులకను ప్రశ్నయే జనింపదు. అప్పుడప్పుడు శ్రీకృష్ణుఁడు చేదనందించునపుడు కలశము నొరుగునట్లొనర్చును. అప్పుడు గోపికలు తడిసి పోవుదురు. అప్పుడు వారు శ్యామునిఁ దిట్టుచుందురు. శ్యాముఁడో నవ్వుచుండును. దీనివలన వారి సాహస మినుమడించెను. ఇప్పుడు కేవలము దర్శన స్పర్శనముచే సంతోషము లేదు. ప్రేమ కలహము కూడ జరుగుచుండును. ప్రేమ వాక్యముల వలన నెన్నటికినిఁ దృప్తి జనింపదు. రాత్రింబవళ్లు మాటలాడు చుండవలయుననియే చిత్తము కాంక్షించుచుండును. ఆ మాటలకేమియును నర్థము లేదు. ఏ మాటలైనను గానిండు పనఘాటమునం దనేక విధములగు లీలలీ విధముగ జరుగుచుండును. వాని నన్నిటినిఁ జెప్పఁబూనినచో

సంవత్సరముల తరబడి యిట్లు గడిచిపోవును. అయినను నవి పూర్తికావు. కావున నీ ప్రసంగమును నేనిచ్చటనే వదలుచున్నాను.

చిత్తమందే యందమైనను నాటుకుండెనేనా చిత్తము నిరంతరము దానినే చింతించుచుండును. ఇప్పుడు గోపికలు గృహకార్యములన్నిటినిఁ జేసికొనుచున్నారు. గృహిణిమైన గృహకార్యములనుండి అవకాశమెప్పుడు - చిక్కను కాని చిత్తము సదా శ్రీకృష్ణునియందే లగ్నమైయుండును. ఏ పని మీఁదనైనను బయటకు వెడలునపుడును, పేడ చేయునపుడును, గోశాలను దుడుచునపుడును, బాలును బితుకునపుడును, నెవరింటికైననుబోయి పెరుగు, మజ్జిగను దేఁబోయినపుడును శ్యాముఁడేమైన వచ్చుచున్నాఁడేమోనని అటునిటుఁ జూచుచుండును. అట్లు వచ్చి కంటఁబడెనా నేత్రములచ్చటనే నిలిచిపోవును. 'ఏలనయ్యా! కృష్ణుఁడు చూడఁదగినవాఁడే, ఊరక ఆతనిఁ చూచుటచే నేమి లాభము? చూచిన వస్తువుకొఱకై యింతటి యధీరత యెందులకు? చూచిన నేమి లభించునట్లు?' ఇప్పుడు మీ యీ శుష్కప్రశ్నలకేమి ప్రత్యుత్తర మీయఁగలను? రెండేండ్లు, నాలుగేండ్లు వయస్సుగల చిన్న చిన్న పిల్లల బుద్ధులందు ప్రణయ సంకేతములు కలుగవు. ప్రేమయందు నిత్య నూతనత్వము కలదు. కన్నుల కాహారము ప్రియవస్తువులను చూచుటయే.

ముక్కులు పూలను దినవు. వాని సుగంధమును గ్రహించి తృప్తినిఁ జెందును. అదేవిధముగ నేత్రములకు ప్రియుని దర్శనము కలిగెనా సమస్తమును లభించినట్లే లోభివాని కెంతటి ధనము నొసంగినను దృప్తి జనింపనట్లును, అగ్ని యందెన్ని యింధనములను వేసినప్పటికిని దృప్తి జనింపనట్లును నేత్రములు ప్రియదర్శన మెంతగాఁ జేసినను దృప్తినిఁ జెందవు. ఇప్పుడేకదా వనఘూటునందు చూచినది. మరల నింటి వాఁకిటకు వచ్చినాఁడేమోయని తొంగి అటునిటుఁ జూచును. ఎచ్చటనైన మురళీధ్వని వినఁబడెనా పరుగిడి మిద్దెపైకెక్కి చూచును. అప్పుడత్త యిట్లనును:- "ఏమే! వంటను వదలి యెచ్చటికిఁబోయినావే?" ఆమె అచ్చటి నుండియే యిట్లనును - "పచ్చిపిడకలకు నిప్పంటుకోనదు. ఏమైన నెండుపిడకలున్నవేమో చూతమని మిద్దెమీఁద కెక్కితిని. చేతులతోఁ బిడకలను త్రిప్పుచుండును, కాని నేత్రములు చంచలతా పూర్వకముగ నటునిటుఁ జూచు చుండును. కృష్ణుఁడు కనఁబడెనా శ్రమ ఫలించినట్లే, కనఁ బడువఱకు చూచుచుండును. చూపునుండి దాటిపోయెనా అప్పుడు దిగివచ్చును. ఒకవేళఁ గనఁబడకపోయెనా అన్య మనస్కభావముతోవచ్చి మరల నింటిలోని పనుల నందు కొనును.

పెరుగు, పాలు విక్రయింపఁబోవునపుడును నవకాశము చిక్కుచుండును. పూర్వము రాజెవరేపని చేయుచుండిన వారివద్ద దానినే శుల్కముగఁ దీసికొనుచుండెడివాఁడు. నూనె గానుగు నాడించువాఁడుండిన వానివద్ద రాజు నూనెనే శుల్కముగ గ్రహించెడువాఁడు. కృషికుఁడైనచో వానివద్ద వానికిఁ బండిన ధాన్యములో నాఱవవంతు గైకొనెడువాఁడు. కూరలమ్ముకొనువారు పన్నుక్రింద కూరలనే యిచ్చుచుండెడు వారు. వ్రజమునకు రాజు నందుఁడు. ఇంతవఱకాతనికి పిల్లలు లేరు. అందువలన నాతని కింతవఱకు పన్నులందు దృష్టి లేదు. ఎవరైన నింటికి వచ్చి పెరుగు, పాలు, వెన్న నిచ్చినచోఁ గైకొనును; ఈయకున్నచో నడిగెడువాఁడుకాఁడు. ఇప్పుడు నందునకుఁ గుమారుఁడు కలిగినాఁడు. పిల్లవాఁడైనను తెలివి గలవాఁడు. ఎవరింట నెన్ని పిండివంటలు చేసినదియు, నెవ రేమి కూరవండుకొనినదియు నాతనికి బాగుగాఁ దెలియును. ఆతఁడు వాని నూర కేలఁబోనిచ్చును. నందనందనుఁడిట్లాజ్ఞా ప్రసారమును గావించెను:- "ఎవ్వరును బెరుగు, పాలు, వెన్నలను శుల్కముగ నీయక వీని నమ్ముకొనరాదు." ఆజ్ఞలనిచ్చి యూరకుండలేదు. గోపబాలక సేనలను దీసికొని తాను బ్రధాన మార్గమునఁగూర్చుండి, యెవ్వరైన నటు అమ్మకమునకుఁబోయిరా వారితోఁగలహము పెట్టుకొనెడు వాఁడు. గోపికలు దీనినే కోరుకొనుచుండిరి. అందువలన

వారు బుద్ధిపూర్వకముగ, సంతోషముగ శ్రీకృష్ణునకు దాన మొసంగెడు వారుకారు. శ్రీకృష్ణునకును సరసముగఁ దీసి కొనుట యిష్టములేదు. వాస్తవమున శ్రీకృష్ణునకుఁ బాలు, పెరుగు, వెన్నలమీఁద లోభములేదు. గోపికలకును నిచ్చుట కభ్యంతరములేదు. వారు తమ తను, ధన, మనములను శ్రీకృష్ణున కర్పించినపుడు దధి క్షీరములు మాత్ర మాతనివి కావా? వారు దధిక్షీరముల నొసంగుటలో నిష్టములేక కాదనుటలేదు. వీరికి శ్రీకృష్ణునితోఁ గలహ మొనర్చుటలో నానందముకలదు. ఈ విషయమును మనస్సులోఁ బెట్టుకొని, వారాతనితో ననేకవాదములు పెట్టుకొనుచుందురు. ఒకతె యిట్లనును:- "నీకు దానమునుగొనుట కధికార మేమున్నది. మీ తండ్రి కంసునకుఁ గప్పమును బ్రతియేట చెల్లించు చున్నాఁడు. వాస్తవముగ మారాజు కంసుఁడు, మే మాయ నకే పన్నును జెల్లింపవలయును. మధ్యలో నడుగుటకు నీవెవరు?" ఇంకొకతె యిట్లనును:- "నీవు మామీఁద నేమి యధికారమును జలాయించెదవు? మావద్ద దానమును దీసి కొంటివా మా దుఃఖమును గూడ దూర మొనర్పవలయును. మఱియొకతె యిట్లనును:- "నీవు దధిక్షీరములలో సగము నకుఁ బైగాఁ దీసికొనినచో నింక మేమమ్ముకొనుట కేమున్నది?" కొందఱీతని యెదుటనే దానమీయక యే పోవుచుండిరి. అప్పుడాతఁడు పరుగెత్తుకొనిపోయి వారి పైట

కొంగును బట్టుకొని యిట్లనెను:- "దానమీయకయే పోవు చుంటివా?" అప్పుడామె వసమాలితోఁ గపట రోషమును జూపించుచు నిట్లనెను:- "ఏమోయి! నీవు రాజకుమారుఁడ వైన నీయింటిలోనే యయ్యెదవు. ఇది మంచిపనికాదు. నీవేదైన మాటాడఁదలఁచినచో దూరముగనుండి మాట్లా డుము. ఇంక నెప్పుడైన నీవు నాశరీరమును దాకితివా బాగుండదు." అప్పుడాతఁడు నవ్వి, ఆమె కొంగును బట్టు కొని యిట్లనెను:- "వదినా! చెడ్డగా భావించితివా యేమి?" ఈ విధముగఁ బ్రతిదినమును నత్యంత సరస మధుమయ లీలలు జరుగుచుండెడివి. పది తిట్లు శ్రీకృష్ణుఁడు తిట్టినఁ బది తిట్లు గోపికలు తిట్టెదరు. ఈ ప్రేమతోఁగూడిన తిట్లు మధువు కంటెను మధురమైనవి. హాలవాకంటె నతికోమలములు. ఈ విధముగ మునులారా! ప్రాచీన కవులును నీ రసదాన లీలలను మిక్కిలి విస్తారముగ వర్ణించిరి. నేనీ విషయమును విస్తార మొనర్చినచో నీ దాన లీలతోడనే కథా సమాప్త మగును. కావున నీ ప్రసంగము నిచ్చటనే సమాప్త మొనర్చెదను."

గోపికలే శ్రీకృష్ణచంద్రునిఁ జూడవలయు నను కొనుటయే కాదు. శ్రీకృష్ణుఁడును వారినిఁ గలియుటకు సదా ఉవ్విళ్లూరుచుండును. కాని గోపికలకే బాధలు కలవో, శ్రీకృష్ణునకును వారినిఁ గలిసికొనుట కట్టి బాధలే కలవు.

పనఘాటునందు, గోశాలయందు, దధి దానమును గొను సమయమునఁ గలిసికొనువారితో సమావేశము జరుగును. వారితో మనస్సులోని మాటలను జెప్పుకొనును. కన్నులార వారినిఁ గాంచును, కాని గొప్పవారింటి పిల్లలతో, నిట్టిపనికి బయటకు రానివారితోఁ గలియుటెట్లు? ఎవరి యింటికైనను వెడలినచో సావడి పంచలోఁ గూర్చుండిన గోపకులే పిలిచి కూర్చుండఁబెట్టుకొందురు. ఏదో విధముగ నింటిలోనికిఁ బ్రవేశించినచో బోసినోటి ముసలక్కలు మాతిని మాటి మాటికిఁ గదిలించుచుఁ బ్రశ్నల వర్షమును గురిపించెదరు:- "అబ్బాయీ! ఎవరికొఱకు వచ్చినావయ్యా? యశోద బాగున్నదా? నీపెండ్లి యెప్పుడయ్యా?" వారితో నిట్లనెను:- నే నెవరికొఱకో వచ్చినానులే. నీపనిని నీవు చూచుకో, నీకు యశోదమీఁదఁ బ్రేమ యుండినచోఁ బోయి ఆమె కుశలమును, క్షేమమును అడిగిరా, మా పనికి ఆటంకము రానీయకు." కాని ముసలివారిని లక్ష్యపెట్టున దెవరు? ముసలి వారిముందు పడుచులు మాట్లాడలేరు. ఈ కారణములను బట్టి శ్రీకృష్ణుఁడు మాయ వేషములను వేయవలసివచ్చెను. ఏ యాటంకమును లేక అంతఃపురములోనికిఁ బోఁగల మాయవేషములను వేయుచుండెడువాఁడు. ఒక్కొక్కప్పుడు పెండ్లికూతురై కాళ్ల యందియలును గడియములును ఘల్లు ఘల్లుమన చెలికత్తెతోఁగూడ యింటిలోఁ బ్రవేశించును.

ఒక్కొక్కప్పుడు పనికత్తెవలెఁ బనిచేయుటకుఁబోవును. ఒక్కొక్కప్పుడు కమసాలికత్తెయై సొమ్ములిచ్చుటకును, క్రొత్తసొమ్ములను జేయించుటకును నిర్భయముగ నంతఃపురమునఁ బ్రవేశించును. ఒక్కొక్కప్పుడు గుడ్డలు కుట్టునదియై లంగాలు దొడుగఁబోయి, యీమిషచే వారి కరములను స్పర్శించును. ఒక్కొక్కప్పుడు దాసరిదై దువ్వెనలు, అద్దములు, సురమా మొదలగు వస్తువులను జూపించుటకు లోపలకు దీసికొనిపోవును. బేరములందును వారితో సరసములాడును. ఒక్కొక్కప్పుడు తమలపాకు కిళ్లీలను దీసికొని అమ్మఁబోవును. ఒక్కొక్కప్పుడు తమలపాకులమ్మఁబోవును. మఱొకప్పుడు పరిచారికయై తలను దువ్వును. జడలోఁబూలను దుఱుమును. కాళ్లు పిసుకును వీపు నలుచును. ఒక్కొక్కప్పుడు వైద్యురాలై నాడినిఁజూచును. మందులిచ్చును. చేతులతోఁ గంటి రెప్పలను దెఱచి వాత, పిత్త, శ్లేష్మములను బరీక్షించును. గుండెదెబ్బలపై దన చేతినిఁ బెట్టి చాల సేపటివఱకు వారినిఁ బరీక్షించుచుండును. అప్పుడప్పుడు చిలుకలను, గోరువంకలను దీసికొనిపోయి యింటింట నాడించుచుండును. ఇంకొకయెడ నటియై ఆడుచుఁ బాడుచు, వాద్యములను వాయించుచు, నాట్యమును చూపించుచుఁ దన ప్రియురాండ్రను సంతోష పెట్టుచుండును. అప్పుడప్పుడు సువాసన నూనెల నమ్ముచుండును. అపుడపుడు వీణను

వాయించుచు నింటింటఁ దిరుగుచుండును. సారాంశ మే మనఁగాఁ దన ప్రియురాండ్రను చూచుటకై యీతఁడును నానా వేషములు వైచుకొని తన నేత్రములను దృప్తి కావించు కొనును. ఈ విధముగ రెండువైపులను ననురాగము కలుగుటచే నుత్సాహ మినుమడించుచుండును.

శ్యామసుందరుని రూప మెంతటి ఆకర్షకమైనదో చెప్ప వీలులేదు. ఒక్కసారి చూచిరా మూల్యములేకయే అమ్ముడు వోయెదరు. చాలమంది మూర్ఛిల్లెదరు. ఒకతె యిట్లనెను:- "కృష్ణా! మా సఖి మూర్ఛపడినది. నీకేమైన మంత్ర తంత్రములు, దిగదుడుపులు, యంత్రములు తెలిసిన చోఁ జెప్పుము." కృష్ణుఁడిట్లనును:- "అవును నా కొక్క మంత్రము తెలియును. దానివలన నామె వెంటనే లేచును." అని యిట్లు పలికి ఆతఁ డామె సమీపమునకుఁబోయి, ఆమె చెవిలో నిట్లు చెప్పును:- "వచ్చే శరద్రుతు రాత్రులందు నీవు నాతో రాసవిలాస మొనర్చెదవా? అని యిట్లు పలుకఁ గానే ఆమెకుఁ జైతన్యము కలుగును. ఆమె మిక్కిలి యుత్సాహముతో నందమైన నాశరద్రాత్రుల కొఱకు ప్రతీక్షించును. ఇప్పుడు సర్వత్ర ఒకటేగోల. "నంద నందనున కొక మంత్రము సిద్ధిపొందినది. ఏ కారణముచే మూర్ఛ చెందినను నామె వెంటనే మూర్ఛ తేరునఁట" ఇప్పుడెవరికి వికలతా మూర్ఛకలిగినను నామె వెంటనే లేచుకొనును. ఇప్పుడెవరి

కెట్టి మూర్ఛవచ్చినను వెంటనే సఖులు శ్యామసుందరుని బిలిచికొని పోయెదరు. ఆతఁడు వారి చెవులలో నీ మంత్రమునే పఠించును. ఆమె వెంటనే తేరుకొనును.

ఒక ముసలిదానికి ఈ నందకిశోరుఁడీ పిల్లల చెవులలో నేమి మంత్రమును జెప్పుచున్నాఁడో చూతమనుకొనెను. అది మంత్రమేమిటి? మూయ వెంటనే లేచుటయా? నేనును బరీక్షింపవలయును. ఒక దినమున నామెకూడ కపటముగ మూర్ఛితయయ్యెను. ఆమె కోడలు పరుగెత్తుకొని ఘనశ్యాముని కడకుఁబోయి యిట్లనెను:- "నందకుమారా! నేడు మాయత్త మూర్ఛితయైనది. ఆమె చెవిలో మంత్రమును జెప్పుము."

శ్యామసుందరుఁడిట్లనెను :- "నా మంత్రము నెఱసిన జుట్టు వారిమీఁదఁ బారదు."

కోడలిట్లనెను: "కృష్ణా! టలాయించకుము. ఆమె సంజ్ఞాశూన్యయై పడియున్నది పద."

ఆమె బలవంతముచేయ బలానుజుఁడెటుల తప్పించుకొనఁగలఁడు? పోయి ఆమెను గాంచెను. సర్వాంతర్యామికిఁ దెలియనిదేమి యుండును. అంతయును దెలిసికొనెను. ఆతఁడిట్లనెను:- ఈమెకు దయ్యము పట్టినది. భూతమునకును నాకు మందు తెలియును. చూడుఁడీ భూత మఱచును" అని

పలికి ఆతఁడా ముసలిదాని వీపుమీఁద గట్టిగా గిచ్చెను. ముసలిది అఱచెను. కోడలిట్లనెను:- "కృష్ణా! ఇదేమి ?"

ఆతఁడు కపట గంభీరతను చూపించుచు నిట్లనెను:- "నీవు మాటలాడకుము. భూతమఱచుచున్నది. ఒక గంపను దెమ్ము. ఈమెను దానిలోఁ గూర్చుండఁబెట్టి కట్టి బావి యందు వ్రేలాడగట్టి యేఁబదియో వందయో మునుకలు వేయించిన భూతము పాఱిపోఁగలదు."

చలిరోజులు, ముసలిది భయపడెను. ఆమె అఱచుచు నిట్లనెను:- "నామీఁద భూతప్రేతము లేమియును లేవు. నేను బాఁగుగానే యున్నాను. నన్నుఁగట్టి బావిలో వ్రేలాడఁ దీయవలదు."

ఇది విన్ని ఆతఁడు నవి యిట్లనెను:- "చూచితిరా, భూతము మాట చెప్పఁగనే పాఱిపోయినది."

ఈ విధముగ వ్రజమండలమందలి యువతులందు శ్రీకృష్ణుఁడు శరద్రాత్రులందు రాసారంభ మొనర్చుననియు, నది ఆశ్వీజశుద్ధ శరత్పూర్ణిమయందు ప్రారంభమగుననియు వ్యాపించెను. శ్యామసుందర సంగమ ప్రతీక్షకొఱకు వా రొక్కొక్క ఘడియను యుగముగ గడుపుచుండిరి. వా రత్యంతోత్సాహముతో శ్రీకృష్ణసంగమ తిథికొఱకు నిరీక్షించుచు దినములను లెక్కించుకొనుచుండిరి.

సూతుఁడిట్లనెను: "మునులారా! నేను మాటి మాటికిని సావధానమొనర్చు చుందును. వారు సాధారణ వ్యక్తితోఁ గలియవలెనని యుత్కంఠితులై లేరు. ఎవనినిఁ గలిసికొనఁదలఁచిరో, యెవనితోఁ గ్రీడింప నువ్విళ్లూరు చుండిరో ఆతఁడు భగవానుఁడు సర్వాంతర్యామియగు నీశ్వరుఁడు.

గోపికలే యుత్సహించుటలేదు. భగవానుఁడును మిక్కిలి యుత్సాహముతోనుండెను, ఆతఁడును నాశర ద్రాత్రులకొఱకు ప్రతీక్షించుచు దినములను లెక్కించు చుండెను. కాత్యాయినీ వ్రతమొనర్చిన కన్యకలకును నదే తిథిని నిర్దేశించియుండెను.

దినములు లెక్కించుచుండ వర్షాకాలము గడిచెను. శరదృతువు నందాకాశము నిర్మలమయ్యెను. బురద యెండి పోయెను. వర్షముచే బురదలైన యమునాజలములలోని మట్టి దిగిపోయెను. అది నిర్మలమయ్యెను. బృందావనము నకు నలుదిశలందును తెల్ల మల్లియులయొక్కయు, పసుపు పచ్చ మల్లియలయొక్కయు సుగంధము వ్యాపించెను. ఎక్కువ వేడియును లేదు, ఎక్కువ చలియును లేదు. మిక్కిలి సుఖదమును రమణీయమునగు కాలము.

ఇది విని శౌనకుఁడిట్లనెను:- "సూతా! శరదృతువు నందు మల్లెలు పూయునా? కావ్యములో శరత్తున మల్లెలు పూచునని యెచ్చటను జెప్పఁబడలేదే. అట్టియెడ నీవు మల్లికా వర్ణన మొనర్చితివేల?"

సూతుఁడిట్లనెను:- "స్వామీ! భగవంతుఁడు లోక వేదములకుఁ బరుఁడు. శరత్తున మల్లికలు పూయకున్నను భగవత్సంకల్పముచేఁబూయును. సూర్య, చంద్ర, గ్రహ, నక్షత్ర, తారాకాదులును, జరాచర విశ్వమందలి జీవులును నాతని భయముచేఁ దిరుగుచున్నవి. ప్రకృతి అతని యిచ్ఛ లోఁదన యిచ్ఛను గలిపి నవ్వుచున్నది. ఆదినముయొక్క ప్రతీక్షలో వ్రజాంగనలందఱియొక్క మనముకురము వికసింపఁగా మల్లిక వికసింపకెట్లుండఁగలదు? అందఱ యానంద మును గాంచి అదియును నానందమునుజెంది వికసించినది. అదియును దన సుగంధముచే బృందావనమందలి రాసస్థల మంతటను సుగంధమయమొనర్చెను. భగవానుఁడేవిధమగు సంగీత, సాహిత్య, కళల కధీనుఁడై కార్యములొనర్పఁడు. అవన్నియు నాతని ననుసరించును. ఆ రాసపూర్ణిమ వచ్చు నప్పటికి, 'ఋతువుగాని ఋతువులోఁ బూయని పూలును పూచెను. బృందావన వాయుమండలమంతయును సుగంధ ముచే నిండెను.

గోపికలయొక్క మనస్సులా దినములలో నుప్పొంగ సాగెను. 'నేఁడు శ్యామసుందరుఁడు చిరకాలమునుండి యున్న మన సుఖాలాపలను నెఱవేర్పఁగలఁడు. నేఁడాతని హృదయముతో హృదయమును గలిపి సమ్మిళిత సుఖానుభవ మొనర్పఁగలము. నేఁడు మన మనోరథములన్నియును నశించి, చిరకాలమునుండి యుండిన మనకోరిక నెఱవేరఁగలదు.' అనుకొనుచుండిరి. వారొంటరిగ నాశారదీయ రాత్రులనుగాంచి ఉత్సాహమును జెందుటలేదు, భగవానుఁడును నదేవిధముగ నుత్సహించుచుండెను. ఆతని మనస్సునందును రమణులతో రమింపవలయునను నుత్కంఠేచ్ఛ జాగృతిచెందెను. శరత్పూర్ణిమను గాంచి యాప్తకాముఁడును, పరిపూర్ణ ఆత్మారాముఁడునగు భగవానుఁడును రాసశౌనర్పఁదలఁచెను."

అంత శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! తృప్తికాని విషయముననే యిచ్ఛకలుగును. మనము హల్వాను దినితిమనుకొనుఁడు. అది చాల రుచిగానున్నది. అాదువలన మరలఁ దినవలయునను గోరిక కలిగెను. ఎవరైనను హల్వాను గూర్చి చెప్పుచుండిన, మనమును దానిరసమును రుచిచూడవలయునని యుండును. కోరిక యుండుట అపూర్ణత యొక్క చిహ్నము. పరిపూర్ణుఁడును, నాప్తకాముఁడునైన వానికి కోరికయేల కలిగినది? "ఆతఁడు బాలకునివలెఁ

గ్రీడించుచున్నాఁడు. కాని బాలునకును ఖేల నేచ్ఛ కలుగును. ఆటవస్తువులను బ్రోవుచేసికొనును. అదియును నపూర్ణతయే' అని మీరందరు శ్రీకృష్ణుఁడు పరిపూర్ణుఁడు. ఆతనికి కోరిక కలిగినదనినఁ గుదురదు."

నవ్వి సూతుఁడిట్లనెను:- "ఏమి స్వామీ! పూర్ణుఁడైనచో నాతని మనస్సునందు పూర్ణతాకాంక్షకలదు. పూర్ణతతోఁడనే యాడును. ఆతని కన్యసాధన లవసరము లేదు. సాలెపురుగు తన శరీరమందలి రసముతో గూటినల్లి దానిలో విహరించి మరల దానిని లోనికిఁగొనును. కృష్ణుఁడు నిర్గుణ బ్రహ్మవలె మెదలకుండుటకు పిండిముద్దవంటివాఁడు కాఁడు. ఆతఁడు నిర్గుణుఁడయ్యును సగుణుఁడును సరసుఁడును, మధురమునై యున్నాఁడు. ఇందులో నాతని పరిపూర్ణత్వమునకును నాత్మకామత్వమునకును విఘ్నము కలుగదు."

శౌనకుఁడిట్లనెను:- "సూతా! పరిపూర్ణత్వమందు విఘ్నములు పడక పోవచ్చును, కాని యేకమును, నద్వితీయమును, నిరీహమును, నిర్వికల్పమునగు దానియందు ఖేలనముండనేయుండదు. ఏదో ఆశ్రయముండవలయును. భగవానుఁడు తన మాయ నాశ్రయించి రమణేచ్ఛను జెందెను."

ఇది విని యచ్చెరిపడి శౌనకుఁడిట్లనెను:- "సూతా! నీవేమి చెప్పుచున్నావు? మాయాతీతుఁడగు భగవానునకు మాయ యెచ్చటినుండి వచ్చినది? రండయగు నీమాయ మనలను వేధించుచున్నది. ఇది భగవంతునిగూడ వదల లేదా? యేమి?"

ఇది విని సూతుఁడు పక పక నవ్వి యిట్లనెను:- "స్వామీ! మీరు మాయకు చాల భయపడుచున్నారు. వాస్తవముగ లోకులు మాయనెంత చెడ్డదిగా భావించు చున్నారో అది అంత చెడ్డది కాదు. ఈ ఖేలనము, లీలలు, క్రీడలన్నియును మాయాశ్రయముననే సంభవములు, ఆ మాయ మూఁడురకములు. ఒకటి జగన్మోహినీమాయ, మోహితమైన జగత్తు దాని మూలముననే ఆలోచింపకయే కార్యములోఁ బ్రవేశించును. అహంకార మమకారము లే మాయచేఁ గలుగునో అది రజోగుణం, తమోగుణ ప్రధానమగు మాయ, ఇంకొకటి భక్తమోహినీ మాయ. దీనివలన మోహితులై భక్తులు భగవానునిఁ గోరుకొను చుందురు. వారు దాని కధీనులై భగవద్భక్తినిఁ జేయు చుందురు. అది శుద్ధసత్వ ప్రధానమగు మాయ. మఱి యొకటి భగవంతుని గూడఁ మోహపెట్టు మాయ దీనిలో గుణలేశము లేదు, దానిని సీతాయనుము, రాధాయనుము, శ్రీయనుము, నీయిష్టము వచ్చిన దనవచ్చును. ఈ మాయ

భగవంతునిగూడ వన వనములఁ ద్రిప్పును. దీని నాశ్రయించియే భగవంతుఁడు కొయ్యబొమ్మవలె నాడును. దీని నాశ్రయించిన లీలలున్నవి. క్రీడలున్నవి. రాస విలాసము, హాసము, పరిహాసాదులున్నవి. కథనమున్నది. శ్రవణమును గలదు. ఇది లేకున్న గోపాలుఁడు దేనికిని కొఱకాఁడు. ఆ యోగమాయ నాశ్రయించి రాసేశ్వరుఁడగు భగవానుఁడు రాస నొనర్పఁదలఁచెను. మీరు మాయ యనఁగానే ప్రపంచమును నడుపు రజోగుణ, తమోగుణ మాయ యని భావింపకుఁడు.''

శౌనకుఁడిట్లనెను:- ''సూతా! ఇప్పుడు తెలిసినది సరే, తరువాత నేమైనది. ఈ ప్రసంగము చాల సరసమైనది. సూతా! ఈ వర్ణనములోఁ దొందఱ పడకుము. మన కింకొక పని లేనే లేదుకదా! కృష్ణకథనే వినవలయును. దీనినే విని కాలక్షేప మొనర్పవలయును. కావున నీ విషయమును విస్తారముగ వర్ణింపుఁడు.''

సూతుఁడిట్లనెను:- ''స్వామీ! ఈ విషయమును విస్తార మెవఁడొనర్పఁగలఁడు. రాస ఒక్క దినములో జరిగినదై యుండిన ననుకొనవచ్చును. శ్రీకృష్ణ రాస నిత్యమైనది. అది అనాదికాలమునుండియును జరుగుచున్నది. అనంత కాలము వఱకును జరుగఁగలదు. దానిలో నిత్యనూతనత్వము

కలదు. అది వర్ణింపఁదగినవస్తువు కాదు. అనుభవ వస్తువు. అయినను గురుకృపచే నేను యథామతిగ, యథాశక్తిగ నా వాక్కును బవిత్రమొనర్చుకొనుటకు దీనిని వర్ణించెదను. మీరందఱును సమాహిత చిత్తులరై శ్రవణమొనర్పుఁడు.''

## శరచ్చంద్రుని సుషమా

(౯౭౦)

శ్లో॥ తదోడురాజః కకుభః కరైర్ముఖమ్
ప్రాచ్యా విలింపన్నరుణేన శంతమైః।
స చర్షణీనాముదగాచ్ఛుచో మృజమ్
ప్రియః ప్రియాయా ఇవ దీర్ఘదర్శనః॥

(శ్రీ)భాగ. ౧౦ స్కం. ౨౯ అ. ౨ శ్లో॥

క॥ పతి దన కరములఁ గుంకుమ
సతి మొగమున నలఁదుభంగి సముదయ వేళాం
చిత కర రాగమున నిశా
పతి రంజించెన్ నరేంద్ర ప్రాక్సతి మొగమున్॥

(శ్రీ) మదాంధ్ర భాగవతము.

సంసారమందు సుఖదుఃఖములను, అనుకూల ప్రతి కూలములను సమస్తమును సహింపవలెను. ద్వంద్వములకే సంసారమని పేరు వచ్చినది. సంసారముయొక్క స్థితికి సుఖ దుఃఖము లావశ్యకములు. దుఃఖములేకున్న సుఖానుభవ మెట్లు కలుగును? ప్రతికూలమే లేకున్న ననుకూలములో నానందమెట్లు లభించును? గ్రీష్మ, వర్ష, శిశిరాది ఋతువు లన్నియు నవసరములే, అన్నిటిలో సుఖమును గలదు, దుఃఖ మును గలదు. ఎండాకాలము లేకున్న సూర్యుఁడు తన కిరణములచే జలముల నెండించుటెట్లు? అట్లు జలముల నెండింపకున్న వర్షమెట్లు వచ్చును. శీతము లేకున్న నగ్ని ప్రదీప్తమగుటెట్లు? గ్రీష్మ మవసరమేకాని అట్టి గ్రీష్మ మందలి కష్టమెంతో కలదు. దప్పికయగును, చెమటపోయును. వీనికిఁ దట్టుకొనఁజాలము. ఇదే విధముగ జలము జీవనము, కాని వర్షించిన నెటుఁజూచినను బురద ఈదర వేయును. అగ్ని మందమగును. సదా నభమందు మేఘము లాచ్ఛాదించి యుండును; కాని వర్షములుపోయి, ఆకాశము నిర్మలము కాగానే బురద యెండిపోవును. నదీజలములు స్వచ్ఛము లగును. పృథివి పచ్చగనై సస్యశ్యామలమగును. ఆ సమ యమున దృశ్యము అనుపమానముగ నుండును. కావునఁ గావ్యములన్నిటియందును శరత్పూర్ణిమను గూర్చి ఉప మానము లీయఁబడినవి. శరదృతువునందలి చంద్రుఁడు

నిర్మలముగను, స్వచ్ఛముగను, పరమ సుఖదముగను నుండును. ఆ దినములలోఁ జంద్రుని నుండి అమృత వర్షము కురియునని చెప్పుచుందురు. ఆ దినములలోఁ జంద్రదర్శనము విశేష మాహాత్మ్యము కలది.

సూతుఁడిట్లనెను:- "మునులారా! శరత్కార్తీకము నందు ఎండ చాల తీక్ష్ణముగ నుండును. కారణమేమనఁగా నాకాశము నిర్మలమగును, ఉష్ణముండును, వర్షాకాలము నందాకాశము మేఘాచ్ఛాదితమగుటచే ఛాయయుండును. ఇప్పటికి మేఘములు వర్షించి, కొన్ని గాలికిఁ గొట్టుకొని పోయెను. ఇప్పుడు సూర్యకిరణములు సూటిగఁబడును. ఆ తీక్ష్ణతాపముచే మొక్కలు వాడిపోవును. హరిణములు నల్లబడును. స్త్రీ పురుషులకు జ్వరములు వచ్చును. గేదెలు నాలుకను జాపి ఒప్పుచుండును. పక్షులు వికలములగును. అన్నియు నా సూర్యతాపముచే సంతప్తములగును. పగలు బయలుదేరుట మిక్కిలి కష్టముగనుండును. కాని చంద్రుఁడు తనషోడశ కళాపరిపూర్ణుఁడై ప్రాచీన దిశయందుదయింపఁగనే సమస్త ప్రాణులయొక్క సంతాపము నశించును. ఇతరుల సంతాపముల నణఁచువానిని సంతపురుషుఁడందురు. ఆతఁ డెట్టి రూప, వర్ణములు కలవాఁడైనను, ఏ వర్ణములో జన్మించినను, అతిఁడిదివఱకెట్టి కార్యము లొనర్చినను

నిప్పుడు బాగుచేసుకొనినచోఁ బరోపకార వ్రతమును బూనినచో, ఆతనియొక్క వెనుకటి అవగుణములన్నియును మాసిపోయి సర్వప్రియుఁడగును. చంద్రునిఁ జూడుఁడు. ఆతఁడు సముద్రములోఁబుట్టినాఁడు. ఈతని సోదరుఁడు కాల కూట విషము ఏలననఁగా సముద్ర మంథన సమయమునఁ బ్రప్రథమమున విషమే పుట్టినది. ఈతని కమృతమును సోదరుఁడే కాని ఆతఁడీతని కంటెఁ జిన్నవాఁడు. ఈతనికి శ్వశురుని శాపమును గలదు. ఈతని శరీరమున క్షయ రోగము కలదు. ప్రతిదినమును తగ్గి పెరుగుచుండును. వియోగినుల కీతఁడు వైరి, ఈతనిఁ గాంచగనే వియోగినుల విరహ మినుమడించును. వారి కత్యధికముగఁ దమ ప్రాణ పతులు జ్ఞాపకమునకు వచ్చుచుందురు. వారేడ్చి, యీతనిఁ దిట్టుచుందురు. ఈతఁడు కళంకుఁడని కమలమీతని ముఖము నైనఁ జూడదు. ఈతఁడుదయింపఁగనే అది ముడుచు కొనును. ముడుచుకొని కన్నులు మూసికొనును. ఈతఁడు లేకున్నఁ బ్రాచీదిశ విధవవలె నగును. దాని ముఖము నల్ల బడును. పతి సమీపమున లేని స్త్రీ ముఖమెట్లు వికసించును. ముఖ మనురాగమున వికసించును. నాల్గు కన్నులైన చోటనే అనురాగ ముదయించును.

ఈ చంద్రుఁడు గోపికలకు వైరి దీనికి చాల కారణ ములు కలవు. పగలు వారు వనఘూటునందును, అప్పు

డప్పుడు గోశాలయందును, మరొకప్పుడు గోవులను దీసికొని వచ్చునపుడును, దీసికొనిపోవునపుడును, పెరుగు పాలనమ్మఁ బోవునపుడును శ్యాముని జూచుచుందురు. చీకటిపడి, నిశానాథుఁడు తన కరములను జాచినపుడు గోపికలకుఁ గారావాసమైనట్లగును. స్త్రీలు రాత్రులందు బయటకెట్లు పోఁగలరు? అంగణములోఁగూర్చుండి యేడ్చుచుండవలసినదే. పైకి ఆకాశమువైపునకుఁ జూచిరా అచ్చట నవ్వుచుఁ జంద్రుఁడు కనఁబడును. ఆతఁడు తమ్ముఁజూచియే నవ్వుచున్నాఁడని వారనుకొనుచుందురు. శ్రీకృష్ణుని సౌందర్యమునకును జంద్రుని సౌందర్యమునకును బోలిక కలదు. సమానవస్తువును చూడఁగనే తన ప్రియుని స్మృతి జాగృతినిఁ జెందును. రూప సామ్యమును గలిగియుండుటయే కాదు. నామ సామ్యమును గలదు. శ్రీకృష్ణ చంద్రుఁడు, వ్రజచంద్రుఁడు, బృందావన చంద్రుఁడు, ఈ నామము లన్నిటిలోఁ జంద్రుఁడనునది జోడింపఁబడినది. చంద్రునిఁ గాంచఁగనే శ్యామసుందరుని స్మృతి యింక నధికముగ జాగృతి చెందెను. శ్రీకృష్ణ చంద్రుని పీతాంబరము చంద్రుకిరణములవలె మెరయుచుండెను. చంద్రుఁడు తిరుగు నాకాశమున కేరంగు కలదో, ఘనశ్యాముని శ్రీయంగముయొక్క రంగు దానినిఁ బోలియున్నది. ఈ స్మృతులన్నియును వారికి రాత్రియంతయును నిద్రరానీయుటలేదు. కలంకుఁడగు నీ చంద్రుఁడా

కాశమునుండి తొలిగిపోయెనా మాకు హాయిగా నిద్రపట్టఁ గలదు. చంద్రుఁడీ తిట్లను దినుచుఁ దినుచు నింకను మలినుఁడై పోవుచున్నాఁడు. అంతమున నమావాస్యనాఁడు కనఁబడకుండ దాగుకొనుచున్నాఁడు. మరల నాకాశమున విదియ నాఁడు గోపిక లీసారి ఆదరింపఁగలరని మరలఁ బ్రకటమగు చున్నాఁడు. విదియనాఁటి చంద్రునిఁగాంచి వారు నమస్కరించెదరు. అప్పుడాతనికి సాహసము వృద్ధిపొందును. వీరికి రోషము తగ్గిపోవును. ఆతఁడు పెరుగుచునే యుండును. గోపికలు మనస్సులలోఁ గోపగించుకొనుచుందురు. పూర్ణుఁడు కాఁగానే మరల నేడ్చుచుఁ దిట్టుచుందురు. విసుగుకొందురు. అప్పుడు వాని ముఖము మరల మ్లానమైపోవును. ఉత్సాహము భంగమగును. మరలఁ గ్రమక్రమముగఁ బ్రభాహీనుఁడై - తేజోహీనుఁడై పోవును.

శరత్పూర్ణిమనాఁడు ఆతఁడు తన సాహసమునంతను వ్యక్తపఱచి, నేఁడు తాను సమస్త జీవులయొక్క సూర్య సంతాప జనిత తాపమును దూరమొనర్ప వలయునని నిశ్చయించుకొనెను. నేఁడు చరాచర విశ్వమును దన కమనీయ కిరణములద్వారా ఆహ్లాదమొనర్పఁదలంచెను. ఇట్లాలోచించుకొని ప్రథమమున నుదయింపఁగనే యాతఁడు ప్రాచీ దిశాముఖమును సిందూర వర్ణముతో రంగును వైచెను.

శౌనకుఁడిట్లనెను:- "సూతా! పాపము ప్రాచీదిశ, చంద్రుఁ డుదయింపఁగనే తన శుభ్ర కిరణములచేఁ బ్రాచీ దిశాముఖమును రక్తరంజిత మొనర్చుటకేమి పాపమును జేసినది.

ఇది విని సూతుఁడు నవ్వి యిట్లనెను:- "స్వామీ! మీరు సాధువులు, ఇట్టి సరసప్రశ్న నేలచేయుచున్నారు. లేక మీరు బుద్ధిపూర్వకముగఁ బ్రసంగమును సరస మొనర్చుటకై యిట్టి రహస్యమయమగు సూటి ప్రశ్నలను వేయుచుందురా? చివర విషయమిది. అసలు విషయమిది స్వామీ! ఒకానొకని అత్యంత ప్రియమైన పత్నియొక్క పతి పర దేశమునకుఁ బోయినాఁడనుకొనుఁడు. పోవునపుడు తాను ఫలాని దినమునకు వచ్చెదనని చెప్పిపోయినాఁడు. పాప మామె అమాయక ఆమె అన్ని గీతలు గీసికొనినది. ప్రతిదినమును లేచి ఒక్కొక్క గీతను జెరిపెడిది. ఏ దినమున నన్నియును జెరుపఁ బడినవో ఆ దినమున నామెయొక్క ఉత్సుకత అధికమయ్యెను. క్షణమున కొకసారి లోపలకుఁ బోవుచుండును, మరల బయటకు వచ్చుచుండును. పతికిని అట్టి యుత్కంఠతయే యుండెను. ఆతఁడు సమయమునకు వచ్చెను. హృదయము పొంగెను. ప్రేమ స్రోత పెల్లుబికెను. నేత్రములు వానికవియే అశ్రువులను బ్రవహింపఁ జేయుచుండెను. ఆమె పాదములమీఁదఁబడి యేడ్వ నారంభించెను. ముఖము విరహ

తాపముచే సంతప్తమగుచుండెను. గుండె కొట్టుకొన నారం భించెను. పతియొక్క సుఖద శీతల స్పర్శ ప్రాప్తింపఁగనే చిరకాలమునుండి యుండిన సంతాపము మాయమగును. పత్ని పతి పూజకొఱకు పళ్లెరమునిండఁ గుంకుమనుంచెను. కాని పతి కనఁబడఁగనే ఆమె సర్వమును మఱచిపోయెను. పతి చందన కర్పూర కేసర మిశ్రితమగు చిక్కని గంధమును దన చేతులతో నామె ముఖారవిందమున కలఁదెను. ఒకటి పతి కరములయొక్క సుఖస్పర్శ రెండవది కేసర, కర్పూర, చందనములయొక్క శీతలము సంతాపము నంతను బోఁ గొట్టెను. ఆమె ఆనందించెను. ప్రణయభరిత దృష్టులచే నామె ప్రాణనాథుని ముఖారవిందమును చూచుచు నిలు చుండెను. ఈ విధముగఁ బ్రాచీదిశయొక్క సంతాపమును హరించుటకై పూర్ణచంద్రుఁడు తన ప్రశాంత కిరణముల ద్వారా నభముయొక్క యెఱుపుచే నామె ముఖమును రంజితమొనర్చెను, సూటిగాఁ జెప్పవలయుననినఁ బూర్వ దిశయొక్క యెఱుపును జించుకొని చంద్రుఁడుదయించెనని చెప్పవలెను. అతఁడు కిల కిల నవ్వుచుండెను. సమస్తప్రాణు లకును సుఖకరముగఁ దోఁచుచుండెను. నేఁడాతఁడందఱకును బ్రియమును గూర్చుచుండెను.

శౌనకుఁడిట్లనెను:- "సూతా! చంద్రుఁడేల నవ్వు చున్నాఁడు?"

ఇది విని సూతుఁడు నవ్వి యిట్లనెను:- స్వామీ! చంద్రుఁడేల నవ్వెనో అది ఆతనికే తెలియవలెను. మే మూరక ఊహింపవలసినదే. చంద్రుఁడిట్లనుకొని యుండ వచ్చును:- "ఈ గోపికలు నన్నెప్పుడును దిట్టుచుందురు. నా యీ వెన్నెలలోఁ దమ మనోహరునిఁబొంది వీ రవశ్యము నన్నాశీర్వదింపఁగలరు." ఈ యానందమున నాతఁడు నవ్వి యుండవచ్చును. లేక నేఁడు ప్రకృతియంతయును సజీవముగ నవ వధువువలె లజ్జతోఁ దలవంచుకొనుటను గాంచి, ఆమె శోభ కాతఁడు విముగ్ధుఁడై యుండవచ్చును. లేక కుముద ములు హసించుటను గాంచి ఆతఁడు నవ్వి యుండవచ్చును. లేక నేఁడు రాసేశ్వరి పరమ రహస్యమయ లీలనుగాంచు సౌభాగ్యము తనకు లభింపఁగలదనియును, ఆ లీలకు నేను వెలుఁగును బ్రసాదించి, రసమయ మొనర్చి చూపెదననియు లోన భావించి ఆతఁడు నవ్వియుండవచ్చును. లేక శ్రీకృష్ణుని యొక్క నేఁటి అద్భుత జగన్మోహన శృంగారమును గాంచి నవ్వియుండవచ్చును. ఏదైనఁ గానిండు. ఆతని యీ హాస్యము ఆంతరికానంద ద్యోతకముగ నుండెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! శరత్పూర్ణిమ చంద్రుఁడు తన సమస్తకళలతోఁ గుముదములను వికసింపఁ జేయుచు నిశా వధూ కటమునఁ జక్కిలగింతలను గలుగఁ

జేయుచు నాతఁడు నవ్వుచుఁ దన శాంత కిరణములచే నందఱి కానందమును గలుగఁజేయుచు, శరత్కాలమున స్వచ్ఛమగు గగన మండలమున నుదయమైనపుడు శ్రీకృష్ణుఁడు గోపికలతో రమించుటకిచ్ఛచేసెను.

# ఆహ్వానము

(౯౭౧)

శ్లో॥ దృష్ట్వా కుముద్వంత మఖండ మండలమ్
రమాననాభం నవకుంకు మారుణమ్।
వనం చ తత్కోమల గోభిరంజితమ్।
జగౌ కలం వామదృశాం మనోహరమ్॥

శ్రీ భాగ ౧౦ స్కం. ౨౯ అ. 3 శ్లో.

వ. ఇట్లు వడిచి నవకుంకుమాంకిత రమాముఖ మండలంబునుంబోలె నఖండంబైన చంద్రమండలంబుఁ బొడగని పుండరీక నయనుండు యమునాతట వనంబున జగన్మోహనంబుగా నొక్క గీతంబుఁ బాడెను.

శ్రీ మదాంధ్ర భాగవతము.

తిలలయందును వఱువునను తైలమువలెను, దుగ్ధము లందు ఘృతమును, పుష్పమందు గంధమును, జెఱకునందు రసమును, ఇంధనము లందగ్నియును సర్వత్ర వ్యాపించినట్లు విశ్వ బ్రహ్మాండము నందంతటను మోహన మురళియొక్క మధుర స్వరము వ్యాపించియున్నది. పై వస్తువులన్నియును యుక్తిచేతను, శ్రమచేతను బ్రాప్తించినట్లు వనమాలియొక్క వంశీనినాదమును బ్రేమ, ఉత్కంఠ, ప్రతీక్షలద్వారా వినఁ బడును. స్వాతికార్తెలో జలమంతటను సమానముగనే వర్షించును, కాని దానివలన నధికసుఖము చాతకమునకే కలుగును. మోహనుని మురళి అబాధితరూపమున మ్రోగుచునే యుండును. కాని దానిని వినునది యువతులగుగోపికలే. ఇతరులనేక వ్యవసాయములలో నుండుటచే దానిని వినఁజాలరు, కొంచెముగ వినియు విననివారివలె నుందురు; కాని అనురాగవతులగు గోపికల నాధ్వని యున్మత్తలను గావించును. వేణువు నిత్యనిరంతరము మ్రోగుచునే యుండును. కాని ప్రతీక్షకు తరువాత-ఉత్కంఠనాసంతరము-నిశ్చయ సమయమునకు మ్రోగునదియే ఉన్మాదకారిణి యగుచున్నది. కన్నులను, జెవులను మూసికొని చాల కాలము వఱకు అనాహత ధ్వనిని విను నభ్యాస మొనర్చిన ఆ శబ్ద బ్రహ్మోపాసకులకు మధురమగు మురళీ నినాద మవశ్యము వినఁబడితీరును. స్పష్టముగ వినఁబడును. వారికి

మురళియేకాదు, రాసలోని సమస్త వాద్యములును వినఁబడు చుండును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! రాత్రులందు ప్రతీక్షలో గోపికలు వ్యగ్రులైయుండిరో, శ్రీకృష్ణుఁడును వ్యగ్రుఁడై తహ తహ లాడుచుండెనో వ్యాకులుఁడై యుండెనో, ఏ రాత్రులకొఱకు దినములను లెక్కించుకొను చుండెనో అత్యంతసుందరములగు నాశర ద్రాత్రులు వచ్చెను."

శరశ్చంద్రుని, నవకుంకుమ సదృశమగు నఖండ మండ లాకారమును జూచియును, అతని కమనీయకోమల కిరణము లచే బృందావనమందలి తరుగుల్మలతా కుంజ నికుంజములు రంజితములై యుండుటను గాంచఁగనే నందనందనుని హృద యముప్పొంగ నారంభించెను. ప్రాచీదిశయొక్క యెఱ్ఱని మేలిముసుఁగునుండి నిశాపతి తొంగిచూచుటను గాంచఁగనే శ్యామసుందరుని హృదయమునందు దన ప్రియయు సహధర్మ చారిణియునైన రమాదేవియొక్క ముఖస్మృతి జాగృతినిఁ జెందెను. ఆ స్మృతి అనంతసుఖచంద్రుల చల చిత్రములను సమ్ముఖమునఁ బ్రత్యక్షమొనర్ప వ్రజవల్లభుఁ డధీరుఁడై రాసకు తగిన వేషమును ధరించెను. పంచరంగుల లాగును దొడుగుకొని దానిమీఁదఁ బసుపుపచ్చని పట్టుధోవతిని గట్టు

కొనెను. ఒక పీతాంబరమును గంతమున వైచికొనెను. శిరస్సున నెమిలిపింఛమును ధరించి దానిమీఁద మెఱయు జరీ వస్త్రమును జుట్టెను. ఈ విధముగ బాగుగా నలంకరించుకొని, చేత మురళినిఁబట్టుకొని సంకేత స్థానమునకుఁ బోయెను. ప్రకృతిదేవి సమస్త శృంగారముల నొనర్చుకొనెను. అభిసారికవలె నామె అలంకరించుకొని ప్రియుని కొఱకు ప్రతీక్షించుచు నిలుచుండెను. బృందావన వన శ్రీయును నేఁడానందము నుప్పొంగఁ జేయుచుండెను. ఆమె యొక్క శరీరమును రోమాంచితమైయుండెను. బృందావన వృక్షసమూహములమీఁద నివసించుఁ బశు పక్ష్యాదులు నేఁడు నిద్రింపలేదు, కాని యవి కలరవమొనర్చుట నాపివైచెను. వన్య పశువులును స్తబ్ధములై తమ తమ బిలములందు మెదలక కూర్చుండియుండెను. నేఁడన్నియును శాంత చిత్తముతో నవ్వుచుండెను. భూదేవి తన విషమతను వీడెను. ఆమె సరళముగను సమముగనయ్యెను. పవనదేవుఁడు స్వయముగవచ్చి చిమ్మిపోయెను. ఒక కంకరు రాయియైనను నచ్చట మిగిలియుండలేదు. శారదీయ హిమకణములు వచ్చి అచ్చటఁ గలయంపినిఁ జల్లెను. ప్రకృతిదేవి శాద్వలము యొక్క సుందరమగు నాకుపచ్చని రత్నకంబళమును బరిచెను. ఆకాశము రాసస్థలిమీఁద నీలవర్ణపు వితానముగ నేర్పడెను. చంద్రుఁడు చేతిలో నద్దమును బెట్టుకొని నిలువఁ

బడియుండెను. పవనుఁడు వింజామరను గైకొని నిలుచుండెను. రంగస్థలముయొక్క సమస్తాలంకారములు పూర్తికాఁగానే, లీలకుఁగావలసిన సమస్త సంభారములు సమకూడఁగనే సర్వ ప్రథమముగ శ్యామసుందరుఁ డేకాకిగనే ప్రవేశించెను.

ఇంతటి విశాల రంగస్థలమున నొంటరిగ యశోదా బాలుఁడగు మదన గోపాలుఁడు శోభింపలేదు. ఒంటరిగా - కేవల మద్వైతుఁడై - అచ్చటనుండి యేమిచేయఁగలఁడు ? అప్పుడతనికి నాదబ్రహ్మ ప్రవాహినియు రసవర్షిణియునగు తన వేణువు జ్ఞాపకమునకు వచ్చెను. స్మృతి రాఁగానే ఆతఁడు దాని నాదరించెను. నాభి సమీపమున మొలలో దోపుకొన్న నా వేణువును హృదయము, కంఠము, ఓష్ఠము లకుఁ దాకించుకొని, ముద్దు పెట్టుకొని దానిని ప్రేమించెను. కరకమల శయ్యపై దానినిఁ బరుండఁబెట్టెను. అత్యంత కోమలమును మృదువును, రసయుక్తమును, నెఱ్ఱగ రంగుగ నుండు నధరోపబర్హణమున కానించి దానిని సుఖపూర్వక ముగఁ బరుండఁబెట్టి, అంతట శ్యామసుందరుఁడు తన ముఖ కమలముయొక్క దివ్య గంధయుక్తమగు నిశ్శ్వాసమును నోటితో దాని ముఖమున నూదెను. అది దానికీతఁడు ప్రణయ పాఠమును జెప్పుచున్నాడా యనునట్లుండెను. తాను స్వయముగఁ జేయవలసిన పనులను జేయుటలో నసమర్థుఁడై నపుడు ఆతఁడు మురళిద్వారా చేయించుచుండెను. ఎవరిచేత

నైన నేదైన పనినిఁ జేయింపవలసియున్నప్పుడు వారి నత్యాధికముగ నాచరించు చుండవలయును. వారి యెడల నావశ్యకతను మించిన ఆత్మీయతను చూపింపవలసియుండును. అందువలన శ్యామసుందరుఁడా శుష్క వేణువునకు నత్యాధికమగు స్వాగత సత్కారములను గావించెను.

సూతుఁడిట్లనెను:- "మునురాలా! ఇంత కామురళి యెట్టిది? విషభరిత పేటిక, ఉన్మాద ప్రవాహియగు సరిత - విశ్వమును దననైపున కాకర్షించు నవ్యర్థమగు నౌషధము. దీని ధ్వని యెవరి కర్ణములలోఁబడునో వారు సమస్తమును మఱచిపోవలసినదే. అది తన గానరూపమగు సుధా మాధుర్యమును వర్షించి, సమస్త సంతప్త హృదయములను శీతలము కావించును. దాని స్వరతరంగములు ధ్యానధారణ నిమగ్నులగు యోగుల ధ్యానమును గూడ బలాత్కారముగఁ దననైపునకు నాకర్షించును. ఒక్కఁడనేకముగనగుటకును, రాసవిలాస సుఖాస్వాదన మొనర్చు కోరికతోడను, కందర్ప దర్పమును హత మొనర్చు కోరికతోడను శ్యామసుందరుఁడు దానిని నోటితో నూదెను. ప్రియుఁడు నోటితో నూదినచో నాక యనిర్వచనీయమగు సుఖము కలుగును.

అంత శౌనకుఁడిట్లనెను:- "సూతా! భగవానుఁడు కందర్ప దర్పదళన మొనర్చు నాలోచనమేల యొనర్చెను? ఇంద్రుడు సాంవర్తక మేఘములను వర్షింపఁ జేయుట కాజ్ఞ

నొసంగి ధృష్టతను గావించినాఁడు. అందువలన దామోదరుఁ డాతని దర్పమును దూరము గావించినాఁడు. భగవానుఁ డిట్టి లీల నొనర్చుటకై మన్మథుఁడేమి ధృష్టతను గావించి నాఁడు.”

అంత సూతుఁడిట్లనెను:- “స్వామీ! ఈ మన్మథుని బ్రహ్మ సృష్టించెను. ఆతఁడు పుట్టఁగానే బ్రహ్మనుగూడ తన వశము కావించుకొనినాఁడు. ఆతఁడును నీ కామున కధీనుఁడైనాఁడు. ఈతఁడు ఋషులను, మునులను, దేవత లను, యక్ష గంధర్వులను, మనుష్యులను, పశు పక్ష్యాదు లను, గీట పతంగాదులనన్నిటినిఁ దన యధీనమునుఁగావించు కొనెను. గొప్పగొప్పవీతరాగులును, త్యాగులునుతపస్వులును నీతని బాఱినుండి తప్పించుకొనఁజాలక పోయిరి. వారు ఇతర బంధముల నన్నిటినుండి విముక్తులై యుందురు కాని యీతని కడ నందఱును నోడిపోవలసినదే. ఈతఁడు శంకరునిగూడ గొప్పగ నాటలాడించెను. బాల బ్రహ్మచారియగు నారద మహర్షినిగూడ మాయలోఁ బడవైచెను. శివుఁడీతని పుత్రుఁ డగు క్రోధుని సహాయమున నీతని భస్మము కావించెను; కాని యీతని భార్యపోయి లబలబ కొట్టుకొని యేడ్వఁగా నీతఁడు బోళాశంకరుఁడు కావున దయకు వశీభూతుఁడయ్యెను. ఆతఁ డిట్లనెను:- “నీ పతి అనంగుఁడయ్యును నందఱి హృదయమున వ్యాపింపఁగలఁడు. అందఱి మనస్సులను మథింపఁగలఁడు?

నాఁటినుండి యీతని కనంగుఁడనియును, మన్మథుఁడనియును బేర్లువచ్చెను. ఇప్పుడీతని బల మధికమయ్యెను. పూర్వము శరీరము కలవాఁడే, వచ్చుచుండినఁ గనఁబడెడువాఁడు. ఇప్పుడీతనిది సూక్ష్మశరీరము, ఎప్పుడు మనస్సులోఁ బ్రవేశించునో మనకుఁ దెలియఁబడదు. మనస్సును బోఁగొట్టుకొనినప్పుడు మనకు జాడ తెలియును, గొప్పగొప్ప యోగులనుగూడ యీతఁడు నలువైపులను జిత్తుకావించి పడవైచెను. ఈతనితో యుద్ధమొనర్చి జయించిన వాఁడింతవఱకెవఁడును లేఁడు. ఒక్క బదరీనారాయణ నివాసియగు 'నారాయణ' మునిమాత్రము జయించినాఁడు.

శ్రీకృష్ణునకు గొప్ప ప్రభావమున్నదని మన్మథుఁడు తెలిసికొనెను. నేను నా తండ్రియగు బ్రహ్మనుగూడ నా స్వాధీనము చేసికొన్నాను. అట్టి బ్రహ్మయును శ్రీకృష్ణుని సూతమాగధ వందీగణమువలె స్తుతి నొనర్చుచుండును. ఈ శ్రీకృష్ణునిగూడ జయింపవలయును.'' అని యాలోచించుకొని యాతఁడు తన యిక్షుదండమును, పుష్పబాణములను గ్రహించి. సుసజ్జితుఁడై యేకాంతమున శ్రీకృష్ణుని సమీపమునకు వచ్చెను. ఆతఁడు భగవానునకుఁ బ్రణామ నమస్కారము లొనర్చక యెదుట నిలుచుండెను.

భగవానుఁడిట్లనెను:- ''ఎవఁడవురా నీవు ?''

అనంగుఁడిట్లనెను:- ''నాపేరు కాముఁడు.''

భగవానుఁడిట్లనెను:- "ఓరీ! కాముఁడనైననేమి? ఎవరిమీఁద దండెత్తవచ్చితిరా? పో, పో, తొలఁగిపొమ్ము, నాయెదుట మొద్దువలె నిలుచుంటివేల?

మన్మథుఁ డిట్లనెను:- "స్వామీ! నేను నీతోఁ బోరుదును."

భగవానుఁడిట్లనెను:- "నీవు నీపని చూచుకొనుము. వృథాగా నాతోఁ గయ్యమును పెట్టుకొనెద వెందులకు? ఇంత ప్రపంచమున్నది. ఎవరితోనైనను యుద్ధమొనర్పుము."

ఆతఁడిట్లనెను:- "స్వామీ! నేను ప్రపంచమునంతను జయించితిని. ఇఁక మిగిలినది మీరొక్కరే."

భగవానుఁడిట్లనెను:- "సరియేకాని, నీవెట్లు పోరఁ దలఁచితివో చెప్పుము."

మన్మథుఁడిట్లనెను:- "నాకు సంకల్పమను మంత్రి యొకఁడు కలఁడు. ముందుగా నేను స్త్రీ పురుషుల మనస్సులలో వానినిఁ బ్రవేశపెట్టెదను. ఆతఁడు మనస్సులోఁ బ్రవేశింపఁగనే నేను వెంటనే పోయి స్త్రీ పురుషుల మనస్సులను మథించెదను. ఆ సమయమున నెట్టి ప్రతిజ్ఞ లొనర్చినను, నెంత యేడ్చినను నన్నియును వ్యర్థములు కాఁగలవు. ఆ సమయమునఁ బురుషుని స్త్రీయును, స్త్రీనిఁ బురుషుఁడును గలిసికొననా నేను బ్రకటమై యిద్దరినిఁ బరాజితులను

గావించెదను. ఈ విధముగనే నేనందఱను బరాజితుల నొనర్చినాను.''

శ్రీకృష్ణుఁ డిట్లనెను:- ''మంచిది, నేను నీ కయ్యము నంగీకరించుచున్నాను. ఒక్కటె కాదు, వేలకొలఁది స్త్రీలతో నేను రమించెదను. నీవు నీ సేననంతయును దీసికొని రావలయును. నేనును నా సేననంతయును దీసికొని వచ్చెదను. బహిరంగముగ విస్తృత రణక్షేత్రమున నీకును నాకును యుద్ధము జరుగఁగలదు. నీవు నన్ను జయించితివా నేను నీ కధీనుఁడ నయ్యెదను. నేను నిన్ను జయించితినా నేను నిన్ను నా కొడుకుగాఁ జేసికొని వదలెదను.

ఆతఁడిట్లనెను:- ''సరియే, శరత్పూర్ణిమనాఁడు నాకును మీకును యుద్ధము జరుగఁగలదు. నీవును నీ రమణులతో బృందావన యమునాపులినము లందుండవలయును. నేనును మలయానిల, వసంత, రతీ, సంగీతము మొదలగు వారితో సిద్ధముగ నుండెదను.'' అని చెప్పి మన్మథుఁడు వెడలి పోయెను.

నేఁడు శరత్పూర్ణిమయే, ఇద్దరును సుసజ్జితులై యుద్ధమునకై! వచ్చిరి. రంగస్థల ప్రకృతి స్వయముగ నలంకృతమైయుండెను. శ్యామసుందరుఁడు లలిత త్రిభంగ గతితోఁ గదంబముక్రింద వేణువును జేత ధరించి నిలుచుండెను.

ఆతఁడు దాని నూదెను. ఆతఁడూదుటకుఁ బ్రారంభించెను. ఆతఁడు తన త్రిభువన మోహినియగు పాటను బాడుచునే యుండెను. ఆ రవము విశ్వమోహనమై వ్రజసుందరుల మనస్సులను హరించెడు నాదమై - వ్రజమండలమున వ్యాపించెను, అది యా వ్రజగోపాంగనల కర్ణకుహరములందు వ్యాప్తించెను. మాదక వస్తువును బానముచేయు నపుడేమి యును దెలియదుకాని, పానమొనర్చిన మీదట దాని ప్రభావము కనఁబడును. అదేవిధముగ నా గోపాంగనల కా విశ్వవిమోహనకరమగు వేణువుయొక్క మధురగానము ప్రథమమున మంచి సుఖముగనే యున్నదికాని కొంతకాలమువఱకు ఆ శబ్దమును వినఁగా వినఁగా వారి కాత్మ విస్మృతి కలిగెను. వారి మనస్సులం దతీత కాలమునాఁటి అనంత స్మృతులు జాగృతము లయ్యెను. వా రా శబ్దస్రోత సమీపమునకుఁ బోవుటకు వ్యాకులమును జెందుచుండిరి.

సూతుఁడిట్లనెను:- "మునులారా! శ్యామసుందరుఁడే సంకల్పమున మురళీ నినాద మొనర్చెనో, ఎవరిని మోహింపఁ జేయుటకై ఆతఁడు మోహినీమంత్రము నూదెనో, వ్రజాంగన లందఱును నా శబ్దమును విని మోహితులైరి. మంత్రము తన ప్రభావమును తక్షణము చూపించెను."

# శ్రీకృష్ణాంతికాగమనము

(౯౬)

శ్లో॥ నిశమ్య గీతం తదనంగ వర్ధనమ్
వ్రజస్త్రియః కృష్ణ గృహీతమానసాః।
ఆజగ్ము రన్యోన్య మలక్షితోద్యమాః
సయత్ర కాంతో జవలోల కుండలాః॥

శ్రీ భాగ ౧౦ స్కం. ౨౯ అ. ౪ శ్లో.

వ. అనంగ వర్ధనమగుగీతము పాడిన విని పరాయత్త చిత్తలై తత్తలై తత్తఱంబున వ్రేత లేపనులకుం జేతులాడకయు లక్షితోద్యములై బయలు దేరిరి."

శ్రీ మదాంధ్ర భాగవతము.

ప్రేమయందడుగడుగునకును గోపనముండును. ప్రేమ గోపన మసత్యముకాదు. ప్రేమయందు భావగోపన మొక స్వాభావిక ప్రాచీన పరిపాటియైయున్నది. ఒంటెమీఁదనెక్కు మానవుఁడు మాటి మాటికి భయపడుట మంచిదికాదు. ఒంటెపై నెక్కినవాఁడే భయపడుచు, క్రిందపడును. భావ గోపనమునఁ బ్రేమయొక్క రుచి పెరుగును. మన భావము

నెవరికినిఁ దెలియనీయరాదు. ప్రేమయును, కస్తూరియును దాచిన దాగదు. అయినను నందఱును వానిని దాచుటకుఁ బ్రయత్నించెదరు. దీనివలన వాని మహత్త్వము పెరుగును గాని తరగదు. ఇతరులకుఁ దెలియకుండినఁ దెలియక పోవచ్చునుగాని ఒకే మార్గమున నడచువారు మాత్రము తెలిసికొనఁగలరు. వారికినిఁ దెలియకుండ చేయవలెను. ఈ ప్రేమ సర్పమునకువలెఁ గుటిలగతి కలది.

సూతుఁడిట్లనెను: "మునులారా! అత్యంతమధురమగు శ్రీకృష్ణుని వంశీధ్వనిని విని ఆ వ్రజగోపికలు దారముచేఁ గట్టఁబడిన పావురములవలె లాగఁబడి వారు భగవానుని సమీపమునకుఁబోయిరి. ఎందులకు పోయినారండీ? శ్రీకృష్ణుఁడు వారి సర్వస్వమును హరించినాఁడు కావునఁ బోయిరి. శ్రీకృష్ణుఁడు వనములోఁ గూర్చుండెనుగదా! అచ్చటఁ గూర్చుండియే వారి సర్వస్వము నెట్లు హరించినాఁడు? స్వామీ! రాజెప్పటికిని యుద్ధమునకుఁ బోవఁడు. పోరాడుట కాతని సైనికులే పోవుదురు. సైనికులు జయించిన దేశము రాజుదే కాఁగలదు. అది రాజు జయించిన దేశమే, ఇదే విధముగ దొంగలనాయకుఁడు తన తోడి చోరులును దొంగిలింపఁ బంపును. దోచుకొని వారు సమస్త ధనమును తమ అధినాయకునకుఁ దెచ్చియిచ్చుచుందురు. ఇదే విధముగ శ్రీకృష్ణుఁడు మహాచోర శిఖామణి. అతఁడు

చోరులలోఁ జతురుఁడగు వంశీధ్వని నా గోపీజనముల కడకుఁ బంపెను. దైవవశమున నా గోపికలయొక్క కర్ణకవాటము లా సమయమునఁ దెరువఁ బడియుండెను. వారింకను నిద్రింప లేదు. మొదలక వంశీధ్వని వారి కర్ణద్వారములద్వారా మన మందిరమునఁ బ్రవేశించినది. అచ్చట నతిరహస్యమగునొక పెట్టెలో ధృతిస్మృతి వివేకము, లోకలజ్జ, భీతి, మతి యను బహు మూల్యములగు రత్నములుంచఁబడినది. ము ను ముందుగా నాతఁడారత్నములను వారి మన మందిరముల నుండి హరించెను. హరించుకొనిపోయి వాని నన్నిటిని శ్రీకృష్ణుని సమీపమునకుఁ జేర్చెను. ఇంటిలో ధనము కలదు. స్త్రీల ఆభరణములు బహుమూల్యములైన వందుగలవు. ఆ వస్తువుల నన్నిటిని వేణునాదమేల హరింపలేదు? దొంగకు బహు మూల్యములగు వస్తువులు చిక్కినపుడు, అల్పమూల్య ములగు వస్తువుల నాతఁడు తాకనే తాకఁడు. ఆతనికి బంగారము, రత్నములు దొఱకినప్పు డాతఁడు గడ్డి గాద మును గట్టుకొని వ్యర్థముగ బరువు నేలఁబెంచుకొనును? మన మందిరములోని రత్నములే దొఱకినపుడు స్వర్ణ రజితాభరణ ములలో నేమున్నది? ఇట్లాలోచించుకొని ఆతఁడు చేయి చేసికొనలేదు.

గోపికలు నిద్రించుటలేదు. నిద్రపోనిచ్చి యెవ్వఁడును దొంగిలింపలేదు. ఈతఁడు బందిపోటుదొంగ కన్నుల యెదు

టనే సర్వస్వమును దొంగిలించి దొంగ పాఱిపోయెను. దొంగ లైనను బది యిరువది మంది లేరు. దొంగ ఒంటరిగాఁడే. వారికి సాహసము పెరిగి వారాతని వెంటఁబరువిడిరి. ఈతనిఁ బంపిన మహాచోరుఁడు యమునా తటమున నొంటరిగఁ గూర్చుండి నాఁడని వారికిఁ దెలియును. ఈ చోరుఁడు మన సర్వస్వమును హరించి ఆతనికే యొసంగును. మన మాతనిఁ బ్రార్థించినచో మన రత్నముల నాతఁడు త్రిప్పియిచ్చునేమో. ఇట్లాలోచించుకొని ఆ చోరుని పదముల ననుసరించుచు వారా వైపునకే పరువిడిరి. వెళ్లునపుడు వ్యగ్రతతో వారి కర్ణకుండలములు కదలుచుండెను. వారొకరినొకరు చెప్పు కొనఁజాలకపోయిరి. వారెచ్చట గూర్చుండిరో ఉన్నదున్నట్లు గనేలేచి పరువిడిరి. అది వ్యగ్రతాభావము కావచ్చును,

ఇదిదొంగతనము కాదు. వేణువు ప్రళయమొనర్చుటకే తలంచెనని కొందఱందురు. వంశమే వంశమునఁ బుట్టినదో ఆ వంశములు (వెదుళ్లు) పరస్పరము రాచుకొని, తన వంశ మునే గాల్చి భస్మమొనర్చెను. ఆ వంశముయొక్క గుణ ములు పరంపరాగతముగ వచ్చితీరవలయును. అందువలన శ్రీకృష్ణుని ముఖవాయువునుండి ప్రజ్వలితమై యా యగ్ని గోపికల కర్ణములద్వారా వారి హృదయములకుఁ జేరుకొనెను. అగ్ని వాయువుచేతనే యుత్పన్నమగును. ఆ యగ్ని గోపికల

హృదయమును దగ్ధమొనర్చుట కారంభించెను. వారు వ్యాకులలైరి. అగ్నిమంటలను మేఘమే శాంతింపఁజేయఁ గలదు. అందువలన శాంతికొఱకు వారు ఘనశ్యాముని సమీపమునకుఁ బరువిడిరి.

కొందఱిట్లందురు: ఈ కామదేవుఁడు మిక్కిలి క్రూరుఁడు. ఈ క్రూరత్వమునకుఁ గోపపడియే కైలాసవాసియగు కపర్ది యీతనినిఁ గాల్చివైచెను. ఆతని భార్యయొక్క ప్రయత్నముచే నీపాపి మరల జీవించెను. శివుని నీతఁడేమియును జేయఁజాలఁడు కాని జీవరూపమగు పశువులమగు మన కతఁడు పతి అనఁగాఁ బశుపతి. ఆ పశుపతి ప్రజలమగు మన యీ స్త్రీ పురుషుల హృదయములందుఁ బ్రవేశించి యీతఁడు వారినిఁ గొల్చుటకు నిశ్చయించెను. ఈ కామదేవుఁడును ననంగుఁడే, ఈ వేణుశబ్దమునకును నంగము లేదు. ఇద్దరికిని సహవాసము కుదిరినది. ఈ మన్మథుఁడు మెల్లఁగా వ్రజవనితల హృదయమునఁ బ్రవేశించెను. మాంసములోఁ బుండు దాగి నట్లింతవఱకును నీతఁడు దాగినాఁడు. తెలియక రహస్యముగ నున్న రవ్వవలె నీ యనంగుఁడు హృదయమున దాగియుండ వేణునాద రూపమగు వాయువు వచ్చి దానినిఁ బ్రదీప్తము కావించెను. గోపికల హృదయము తప్తము కానారంభించెను. స్త్రీల హృదయమునఁ గామాగ్ని ప్రజ్వలితమగుచో దానినిఁ

బురుషుఁడు మాత్రమే ప్రశాంత మొనర్పఁగలఁడు. పురుషుఁడు శ్రీకృష్ణుఁడొక్కఁడే జీవులందఱును ప్రాకృతులగుటచే స్త్రీ లింగ వాచ్యులే కావున జీవుల హృద్రోగమును శ్రీకృష్ణుఁడే శాంతింపఁజేయగలఁడు. ఆతఁడు మన్మథుని మనస్సునుగూడ మథింపఁగలఁడు. ఆతఁడు కోటి కందర్పదళన మొనర్పఁ గలఁడు. ఈ యాశతోఁ గామాగ్నిచే వ్యాకులమును జెంది గోపికలు శ్రీకృష్ణుని కడకు బరువిడిరి. వారు పరస్పరము తమ తమ మనోభిలాషను జెప్పుకొనలేదు.

వారికి పరస్పర మింతటి ప్రేమయుండఁగాఁ బరస్పరము వారి వారి మనోభిలాషల నేలఁ జెప్పుకొనలేదోయి ? ఇప్పుడు మనకీ విషయమేమి తెలియును ? వారి మనస్సులోని విషయ ములు వారికే తెలియవలెను లేదా మదనమోహనునకుఁ దెలియవలయును. మనము మన అల్పబుద్ధులతో నూహించె దము. బహుశః ఇదియే కారణము కావచ్చును. వారెవరి కైనను జెప్పుటకు మఱచునంతగా నా మోహనుని మురళీ ధ్వనిచే వారి మనస్సులలో వ్యాకులతను జెంది యుండ వచ్చును. వారందఱేవిధముగ నెట్లు కూర్చుండిరో వారా మురళీధ్వనిని విని అట్లే పరువిడిరి. ప్రేమలో నొకటికలదు. తమ ప్రియతముని కడకు తామే ముందుగాఁబోయి ఆతని ప్రేమ ప్రసాదమును దామే ముందుగాఁ బొందవలయునను నుత్కంఠతతోఁ బరువిడుచుండిరి. లేక పోవుచుండగా వారి

చిత్తము తన్మయమై, తన్మయమైనచో వాక్కు రుద్ధమగును గావున, నెవరికిని జెప్పజాలక పోయిరి. వారి పాదముల గతి యును నాగిపోయెను. ఏ ప్రయత్నమును లేకయే తమకుఁ దామే ఆవైపునకుఁ బోయిరి, వారు ప్రయత్నమొనర్చినను నటునిటుఁ దిరుగుట కంగీకరించుట లేదు. యంత్రమువలె నటు వైపునకే అవ్యాహత గతితోఁ బరువిడిరి. ఏమైనఁ గానిందు, వారందఱును నా కామోద్దీపక వేణునాదమును విని శ్రీకృష్ణుని వైపునకుఁ బోవుచుండిరి. పోవునపుడు వారి కర్ణ కుండలము లూగులాడుచుఁ గొట్టుకొనుచుండెను. "కుండలము లేలఁ గదలుచున్నవి?" వహ్వా చాల విచిత్ర ప్రశ్నొనర్చిరి. నడుచుచుండినఁ గుండలములు కదలవు. వేగముగఁ బోయిన చోఁ గర్ణకుండలములు తమకు దామే కదలును. అయితే యిట్లు చెప్పుటవలనఁ బ్రయోజనమేమి కలదు?" ప్రయో జన మేమనఁగా శ్రీకృష్ణునిఁ గలిసికొనవలయునను వ్యగ్ర తతో నా చైతన్యమయులగు గోపికలకే కాదు, కర్ణము లందుండిన జడములగు నా కుండలములకును నాతనిఁ గలిసి కొనుటకు వ్యగ్రులైయుండెను, ఉవ్విళ్లూరుచుండెను. అధీరలై యుండెను, ఉత్సాహముతోనుండెను. అవి గోపికల కర్ణము లందుఁ గదలుచు నిట్లు చెప్పుచున్నట్లుండెను:- "మీరు సుకుమారులు. మీకటి ప్రదేశములు స్థూలములు, వక్షఃస్థల మందును రెండుభారములున్నవి. ఉదరము కృశించియున్నది.

అందువలన మీరు త్వరగాఁబోవుటలో వంగిపోయెదరు. నితంబ భారముచే మీ మడమలు యమునా సైకతమున దిగఁబడును. అప్పుడు మీరు త్వరగాఁ బరువిడఁజాలరు. మీరప్పుడు రొప్పెదరు. ముఖమున స్వేద బిందువులు మెఱయును. వానినిఁ దుడుచుకొనుటలో మీకు ఆలస్య మగును. అందువలన మీరెప్పుడు చేరుదురో తెలియఁ జాలము. మమ్ములను మీ కర్ణములనుండి తీసివేయుఁడు, మేము మీకంటె ముందుగాఁబోయి శ్రీకృష్ణునిఁ జేరు కొందుము. మే మాతని చరణముల మీఁదఁ బడవలయును.” కాని గోపిక లాత్మ విస్మృతినిఁజెందిరి. వారికి ధ్యానము కుండలములమీఁద లేనే లేదు. వారు వాని మాటలను విననే వినుట లేదు. కుండలములు కోపమును జెంది మాటి మాటికిని గదలుచుఁ దవ వ్యగ్రతను బ్రకటించుచుండెను. దీనివలన జడ చేతనములన్నియును శ్రీకృష్ణునిఁ గలిసికొనుట కధీరులై యుండిరి, వ్యగ్రులైయుండిరి; కాని వారికి విశుద్ధమగు మార్గము చిక్కలేదు. వారు కంటక మార్గమునఁ బోవు చుండిరి ఆ మార్గమునఁ బోవుటచేఁ ద్వరగా ముందునకుఁ బోవఁజాలకుండిరి, శ్రీకృష్ణునిఁ జేరుకొనఁజాలకుండిరి. ముల్లు విరిగెనా దానినిఁ దీసికొనుటలో నాలస్యమగుచుండెను. ముల్లును దీయఁగానే కొంచెము సుఖము కలిగెను. ఇంతలోనే యింకొకములు విరుగుచుండెను. వారి కాలమంతయును

ముండ్లను దీసికొనుటలోనే గడచుచుండెను. ఒక ముల్లు తీయఁగానే సుఖము కలుగుననుకొనుచుండఁగా నిట్లు సుఖాశ చేఁబోవుచుండిరి కాని సుఖము లభించుటలేదు. దుఃఖ నివృత్తికై సతతము ప్రయత్నమొనర్చుచుండిరి కాని ఆత్యంతిక దుఃఖనివృత్తి కలుగుటలేదు. కుండలములవలె భావమయ యగు గోపిక చరణ చిహ్నముల ననుసరించినచో నవశ్యము శ్రీకృష్ణుని సమీపమునకుఁ జేరుకొనవచ్చును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఈ విధముగ భగ వానుని మురళీధ్వనిని విని అత్యంత వ్యగ్రతతో నింటిలోని సమస్త కార్యములను వీడి గోపికలు శరద్రాత్రి సమయమున వనమున శ్రీకృష్ణుని సమీపమునకుఁబోయిరి.

# గమనౌత్సుక్యము

(౯౬౩)

శ్లో॥ దుహన్త్యోఽభియయుః
కాశ్చిద్దోహం హిత్వా సముత్సుకాః।
పయోఽధిశ్రిత్య సంయావ
మను ద్వాస్యాపరాయయుః॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౨౯ అ. ౫ శ్లో.

వ. గోవులకుం గ్రేపుల నిడువకయు, విడిచి విడిచియు నీడకయు, నీడి యీడియు నీడినపాలు కాఁపకయు గాఁచి కాఁచియుఁ గాఁగినపాలు డింపకయు (వ్రజవనితలు బయలు దేరిరి.)

శ్రీమదాంధ్ర భాగవతము.

ఎవరైనను మనకేదైనఁ బనినిఁ జెప్పినచో నాకిప్పుడు తీరిక లేదందుము. ఎవరైన నుత్తరముల మీఁద నుత్తరములు వ్రాసినచో నప్పుడైనను మన ముత్తరము నీయము. చివరకాతఁడు వివశుఁ డానర్చినచో నేదో రెండు ముక్కలు వ్రాయుదుము. చివరకు వ్యవధి లేకపోవుటచే జవాబు నీయఁ జాలకపోయితినని వ్రాయుదుము. వ్యవధి లేకపోవుట కర్థమేమి? నీవు కాగితమును, కలమును దీసికొని వ్రాయవా? వ్రాసిన రోజంతయును వ్రాయుదువే. ఒక చిన్న ఉత్తరమును వ్రాయుటకు వ్యవధిలేదా? ఎందుల కట్లనుటనఁగా నాతనికి ప్రత్యుత్తర మొసంగుట కిష్టములేకనే, వానివలన నేదైన లభించుచో వారికన్ని పనులను వదలి ప్రత్యుత్తర మొసంగెదము. ప్రపంచమునఁ బ్రేమయే ఆవశ్యకమగు వస్తువు, మన కెవరిమీఁద నధికప్రేమయుండునో వారికొఱకు మనము సర్వమును ద్యజించెదము. కీర్తిమీఁదఁ బ్రేమకలవాఁడు కీర్తికొఱకు ప్రాణములనైనను బలియొసంగును.

వ్యాపారి వ్యాపారముకొఱకు సమస్తకార్యములను త్యజించును. తనమీఁద రాజకీయాభియోగముండినచో దాని నత్యంతావశ్యకమైన దానిగా భావించి వ్యాపారహానినైనను నంగీకరించును. ప్రాణములకంటెఁ బ్రియులగు భార్యను బిడ్డలను రోగములు సంభవించినచో నప్పుడు ధనము మీఁద మమకారముండదు. ఎందువల్ల ననఁగా వారియెడల మన కత్యంత ప్రీతికలదు. గృహిణులకు గృహకార్యము లందత్యంతానురాగముండును. కాని మిక్కిలి ప్రేమ పాత్ర యగు సఖ లభించినచో నంతయు నామెమీఁద వదలఁబడును. ప్రేమయందు నియమముండదు. సంసారికులకు సాంసారిక వస్తువులందు శ్రీకృష్ణునిమీఁదఁ బ్రేమపుట్టువఱకే యుండును. శ్రీకృష్ణుని యందల్ప ప్రేమమైనను గలిగెనా, యీ సంబంధ ములన్నియును గౌణములుగఁ దోఁచును. అప్పుడివి యన్ని యును విషమువలెను, శరీరముచుండి బయలు వెడలిన మల మూత్రములవలెను, వమనాన్నమువలెను, పుండునుండి వెలు వడిన చీమువలెను, తీసినగోళ్లు, వెంట్రుకలు, దంతముల వలెను, కంఠమునుండి వెలువడిన శ్లేష్మమువలెను, చెవి నుండి వెలువడిన గువిలివలె ఘృణాస్పదముగను, త్యాజ్యము గను గనఁబడును. ఎవరెంత బలవంత మొనర్చినను, ఎంతటి ప్రలోభనమును గావించినను వానిమీఁద నాసక్తి కలుగదు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! తమ గృహ కార్యములలో లగ్నమైయుండిన గోపికలు శరద్రాత్రి, పూర్ణిమాదినమున మురళీ మధుర ధ్వనిని వినిన వెంటనే ప్రేమ విహ్వాలలైరి. ఇన్నాళ్లనుండి యేసమయముకొఱకు ప్రతీక్షించు చుండిరో ఆ సమయము సమీపించెను. శ్రీకృష్ణుఁడు మనలను బిలుచుచున్నాఁడు. క్రీడకొఱకు ఆహ్వానించుచున్నాఁడు. ఆహా! నేఁడు చిర ప్రతీక్షానంతరము ప్రియ సంయోగము యొక్క అనుపమ సుఖము ప్రాప్తింపఁగలదు." అను నిట్టి స్మృతి రాఁగానే వారికి రోమాంచమయ్యెను. వారు సమస్తమును మఱచిరి. వారు చేయుపనుల నట్లే విడిచిరి. చాలమంది గోశాలలో గోవులను బిండ నుద్యుక్తలైరి. వారు దూడలను విడిచిరి. గోవులు చేపెను. దూడలనుగట్టి పాలు తీయునంతలో నా సమయమున మురళీధ్వని వినఁబడెను. వెంటనే దూడలను గట్టియేయకయే పాలకుండ నచ్చటనే విడిచి బయలుదేరిరి. చాలమంది కొన్నిపాలను బిదికిరి. వారు మురళీ ధ్వనిని వినఁగానే పాలకుండను, పాలను నచ్చటనే విడిచి శ్రీకృష్ణుకడకుఁ బరువిడిరి. కొందఱు పాలను బిదికిరి. వారట్లే వాని నచ్చటనే విడిచి బరువిడిరి. కొందఱు పాల నిండ్లకు దీసికొనిపోయి, దాలిలోఁ బిడకలనుజేర్చి పొయ్యి రాజేసి కాఁగఁబెట్టిరి. వాని నుట్టిపైఁబెట్టకయే వేణు గీతమును వినఁగానే పరువిడిరి. చాలమంది పాలు పొంగు

చుండ వాని నట్లే వదలిపెట్టి పరువిడిరి. కొందఱు హల్వాను దయారు చేయుచుండిరి. చక్కెరను వేడి నీటిలోఁ బోసి పాకముపట్టి, పిండిని నేతిలో వేయించుచుండిరి. సరిగా నా సమయమున వేణునాదము చెవులలోఁ బడెను. పొయ్యి మీఁద పిండి పొయ్యిమీఁదనే ఉన్నది. పాకము పాకముగనే యున్నది. వారట్లే వాని నన్నిటిని వదలి మురళీధ్వని ననుసరించిపోయిరి. కొందఱు మేలిముసుఁగులతో రొట్టెలను జేయుచు, వేడి వేడి రొట్టెలను భర్తలకును, మఱఁదులకును బళ్ళెరములలోఁ బడవేయుచుండిరి. అందఱును భోజనము చేయుచుండ నున్మాదకారిణియగు వేణునాదము వినఁబడెను. అప్పుడు కూర్చుండిన వారలను గూర్చుండినట్లే వదలి, పెనముమీఁద రొట్టెలను బెనముమీఁదనే వదలి పళ్లెముల లోని రొట్టెలను బళ్ళెరములందే వదలి అట్లే లేచి పరువిడిరి.

కొందఱు తమ పసిపిల్లలను వడిలోఁబరుండబెట్టుకొని తమ పైఁటలచాటునఁ బాలను గుడిపించుచుండిరి, కొందఱు పంచదారనువైచి కాచినపాలను దమ సోదరులకును, మేనంద్రులకును ద్రావనిచ్చుచుండిరి. వారా వంశీధ్వనిని వినఁగానే వారి నచ్చటనే వదలి శ్రీకృష్ణుని సమీపమునకు యమునాతటమునకుఁ బోయిరి. కొందఱు శయ్యాపైఁ బరుండి తమ తమ భర్తలను శ్రద్ధాభక్తులతో సేవించుచుండిరి. వారి

పాదములను వత్తుచుండిరి. తలకును. పాదములకును ఘృత తైలముల నంటుచుండిరి. వారును మంత్రముగ్ధలవలె నూనె చేతులతోడనే లేచి పరువిడిరి.

కొందఱు తమ అత్త మామలకును, బావలకును మఱదులకును, భృత్యులకును, నౌకరులకును భోజనమిడి తాము భర్తయొక్క కంచములో భోజనము చేయుచుండిరి. తినుచుండఁగనే వారి కర్ణకుహరములలో వెర్రి నెత్తించు మోహన వంశీనాదము ప్రవేశించెను. ఇంకేమున్నది. చేతి లోని ముద్ద చేతిలోనే యున్నది. నోటిలోని ముద్ద నోటిలోనే ఉన్నది. వారు దానిని మ్రింగకయే, చేయికడుగుకొనకయే ఉన్నదున్నట్లుగ లేచి పరుగిడి శ్రీకృష్ణుని సమీపమునకు వచ్చిరి.

కొందఱు నలుగును బెట్టుకొనుచుండిరి, రాత్రులందు నలుగు బెట్టుకొను టేమిటి? నలుగును బెట్టుకొనిన స్నాన మొనర్పవలయును. రాత్రులందు స్నానమొనర్చుట కష్టము.' తమ ప్రియతముని సంతోషపెట్టుట కన్నియును జేయవలసి వచ్చును. దేహము నలంకరించుకొనుట తనకొఱకుగాదు. తన ప్రియుఁడు సంతోషించుటకే ఆతఁడానందింప వలయు నను భావనయేయుండును. నలుగును బెట్టుకొని స్నానపు గదిలో స్నానమొనర్చుటచే శరదృతువున సుఖముగనే

యుందురు. వారు సాయంకాలమునను నలుగును బెట్టుకొని శృంగార మొనర్చుకొందురు. స్నానమొనర్చి తమ వక్షః స్థలమంతను, శరీరమంతటను కుంకుమపువ్వు, కస్తూరి యుక్త మగు సుగంధ చందనమును, అంగరాగమును లేపనము జేసికొందురు. లేపనముకొఱకు చందనమును దీయుచునే సగములో వదలి బయలుదేరిరి. కొందఱంగరాగమును బూసి కొనుచుండిరి. కొందఱు చందనమును, శరీరమునకు కుంకుమ పువ్వు గంధమును లేపనము చేసికొనుచుండిరి. సగము శరీర మునకుఁ బూసికొని, యింకను సగము శరీరమట్లుండఁగనే మధ్యలోనే వారు పరువిడిరి. కొందఱు శరీరమును స్వచ్ఛ మొనర్చుకొని వస్త్రములను ధరించుచుండిరి. మురళీధ్వనిని వినఁగానే వారి మనసులు చెడి, ఉన్మత్తలైరి. లంగాలను పైఁట లుగను పైటలను లంగాలుగను ధరించిరి. రవికలను గంఠము లకు దగిలించుకొనిరి. కుచ పట్టికలను గడుపునకుఁ గట్టుకొనిరి. ఈ విధముగ నస్తవ్యస్తభావముతో నున్మాదినులవలె భగ వానుని సమీపమునకుఁ బరువిడిరి. కొందఱు సొమ్ములను ధరించుచుండిరి. ఒకచోట ఆభరణమును నింకొకచోట ధరించుచుండిరి. కాలికి బెట్టుకొనువానిని చేతులకును మెడల కును, చేతులకు మెడలకును బెట్టుకొనువానిని కాళ్లకును, బాహుబందులను కాళ్లకును, కడియములను జేతులకును ధరించు కొనుచుండిరి. కాసుల పేరును నడుమునకును, వడ్డాణమును

మెడలోను ధరించిరి. ఈ విధముగ నచ్చటచ్చట నస్తవ్య స్తముగ భావావేశమున నాభూషణములను ధరించి వెఱ్ఱి వాండ్రవలె లేచి పరువెత్తిరి.

కొందఱు బొట్టును బెట్టుకొనుచుండిరి. గొందఱు కన్నులకుఁ గాటుకను బెట్టుకొనుచుండిరి. గొందరు పాపిటయందు సిందూరమును ధరించుచుండిరి. గొందఱు ముఖపత్రములను సరిచేసికొనుచుండిరి. గొందఱు కుంకుమబొట్టును బెట్టుకొనుచుండిరి. గొందఱు పోఁకలను దీసికొని తాంబూలమును నములుచుండిరి. గొందఱు దర్పణమున ముఖమును జూచుకొనుచు మొటిమలను సవరించుకొనుచుండిరి. గొందఱు గోళ్లకు రంగును వేసికొనుచుండిరి. గొందఱు కాలికి పారాణము బెట్టుకొనుచుండిరి. గొందఱు వెండ్రుకలను సరిచేసికొనుచుండిరి. గొందఱు పండ్లకప్పు వేసికొనుచుండిరి. గొందఱు పండ్లను రుద్ది రుద్ది తెల్లగ మెఱయునట్లు చేసికొనుచుండిరి. గొందఱు మాసిన గాజులను దీసి మెఱయుచుండు క్రొత్త గాజులను ధరించుచుండిరి. ఇంతకు సారాంశమేమనఁగా గృహిణులు సాధారణముగ నేపనులలో నిమగ్నులైయుందురో, శరీరము నలంకరించుకొనుటకును, బుద్ధి నొసర్చుకొనుటకును నే పనులు చేసికొందురో ఆ పనులలో వారున్నదున్నట్లుగ వదలి సగములోనే వీడి భగవానుని వేణునాదము ననుకరించిరి. అన్నిటిని వదలి యిండ్లనుండి బయలు దేరిరి.

వారు శరీరములు తెలియక, వెఱ్ఱివారివలెను, మత్తెక్కినవారివలెను, భ్రమచెందినవారివలెను మంత్రముగ్ధులవలె నేమియు నాలోచింపక వనమునకుఁ బోవుటనుగాంచి వారి పతులును, తండ్రులును, భ్రాతలును, బంధు బాంధవులును, స్వజనులును, బరివారమును జాలవిధముల నడ్డగించిరి, చాలగ బ్రతిమలాడిరి. కాని వారెవ్వరి మాటను వినిపించుకొన లేదు. అందరిమాటలను వినకయే, ప్రత్యుత్తరమీయకయే పోవుచుండిరి. వారి నెంత ప్రయత్నించియును నాపఁజాలక పోయిరి. చచ్చువారినిఁ బోవువారిని నెవరాపఁగలరు? ప్రాణమును బణముగఁబెట్టి సర్వస్వమోహత్యాగ మొనర్చువారి నెంతవఱకని బలవంతముగ బంధింపఁగలరు? ప్రాణముల నఱచేతఁ బెట్టుకొన్నవారి కెవరి భయముండఁగలదు? వారి చిత్తములను చిత్తచోరుఁడు హరించినాఁడు. అందఱను గర్షించువాఁడును, అందఱను బలాత్కారముగఁ దమ వైపునకు లాగుకొనువాఁడును, నగు శ్రీకృష్ణు డెవరిని వరింపఁదలఁచినాఁడో, ఎవరినిఁ దన వైపునకుఁ బిలువఁదలఁచి నాఁడో అట్టివారు వివశులైరి. ఎవరాతని వైపున కాకర్షింప బడరు? అందఱును వివశులై అటుపోవలయును. గోపిక లాత్మ విస్మృతినిఁ జెంది ఆతనివైపునకుఁ బరువిడుచుండిరి. వా రాగలేదు, వెనుకకు దిరుగలేదు, అలసిపోలేదు. అటులనే

పోవుచుండిరి. పోయి పోయి తమ గంతవ్యస్థానమునకుఁ జేరు కొనిరి. శ్రీకృష్ణుని శ్రీచరణములకడను జేరుకొనియుండిరి.''

సూతుఁడిట్లనెను:- ''మునులారా! వారందఱును గలిసిపోవుచుండిరి; కాని అందఱును దామొక్కరే పోవు చున్నామనుకొనుచుండిరి. తన భావము నితరు లెఱుఁగరను కొనుచుండిరి. ఒక్కసారిగాఁ గలిసిపోవుచున్నను భావగోపన ముండెను. ప్రేమలీల యెంతటి అద్భుతమైనది! చాలమంది వెడలిరి కాని కొందఱు పోఁజాలకపోయిరి, వారి స్థితి యేమైనదో ఆ వర్ణనమును నేను రాఁబోవు అధ్యాయమునఁ జేసెదను.

---

# తీవ్రతాప పరిణామము

(౯౬౪)

శ్లో॥ అంతర్గృహ గతాః కాశ్చి
ద్గోప్యోఽలబ్ధ వినిర్గమాః।
కృష్ణం తద్భావనాయుక్తా
దధ్యుర్మీలిత లోచనాః॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౨౯ అ. ౯ శ్లో.

వ. కొందఱు గోపికలంతర్గృహములోనుండి బయటకుఁబోఁ జాలకుండిరి. అందువలన వారచ్చటనే శ్రీకృష్ణ భావనా యుక్తలై నేత్రములను బంధించి ధ్యానమగ్నలై తన్మయలైరి."

శ్రీ మదాంధ్ర భాగవతము.

శరీరము పరవశమైనది. ప్రారబ్ధవశమైనది. అది అభిభావనముల కధీనమైనది. కాని మనస్సు తనదే. మన స్సెచ్చట లగ్నమైన నచ్చటనుండి దానినిఁ దప్పించుట చాల కఠినమగును. పైకొక వేషమును, మనస్సున నింకొక ధ్యాన మును గలిగియుండుట అనుచితము; కాని చేయున దేమున్నది? ఒకానొక బలవంతుఁడు బలాత్కారముగ మనస్సును హరించునపుడు అది యెవరికి వశమగును. బడితె యెవరిది బఱ్ఱె వారిది.

బృందావనమునఁ జీర ఘట్టమునందొక త్రిపుండ్ర మును రుద్రాక్షమాలను, ధరించి, 'నమః శివాయ' అని ముద్రించిన ముద్రావస్త్రమును ధరించిన నొక శైవుఁడు శ్రీ మద్భాగవతమును బాఠ మొనర్చుచుండెను. ఆ సమయ మున నొక భావుక భక్తుఁడు స్నానముకొఱకు వచ్చెను. శ్రీకృష్ణధ్యాన మగ్నుఁడగు నా శైవుడు బిగ్గఱగఁ బాఠ మొనర్చుచుండెను. శ్రీకృష్ణలీలలను జదువునపు డాతనికి

రోమాంచమగు చుండెడిది. నేత్రములనుండి అశ్రుధారలు ప్రవహించెడివి. దీనిని గాంచి ఆ భావుక వైష్ణవుఁడిట్లనెను:- "పొండయ్యా పొండు, చోరీ జరిగినది. చోరీ జరిగినది." స్నానమొనర్చు పది, పదునైదుగురు భక్తులు గుమికూడిరి. వారిట్లడిగిరి:- "నాయనా! ఏమి చోరీ జరిగినది. ఎవరు నీదే ధనమును దొంగిలించిరి?"

అప్పుడు వైష్ణవుఁడిట్లనెను:- "శ్రీమద్భాగవతం పురాణ తిలకం యద్వైష్ణవానాం ధనమ్" శ్రీమద్భాగతము వైష్ణవులకు ధనము, దాని నీ శైవుఁడు దొంగిలించినాఁడు, ఈతఁడు దీనిని మిక్కిలి ప్రేమతో రసాస్వాదన మొనర్చుచున్నాఁడు. చూచుట కీతఁడు శైవుఁడుగఁ గనఁబడుచున్నాఁడు."

ఇది విని యా శైవ భక్తుఁడు గద్గదకంఠముతో నిట్లనెను:- "సోదరా! నిజముగ నేను శైవుఁడనే. ఈ విషయమున శంకింపవలసిన పని లేదు. నేను రుద్రాక్షలను ధరించెదను. త్రిపుండ్రమును బెట్టుకొందును. నేను శివమంత్రమును గ్రహించితిని. పంచాక్షరీ మంత్రమును జపించుచుందును. ఇట్లయ్యును నొక నల్ల గొల్లవాఁడు తన సౌందర్యముచే నా చిత్తమును హరించినాఁడు. ఇచ్చట వస్త్రములు హరింపబడుచుండును, పాలు, పెరుగు, వెన్న దొంగిలింపఁ

బడుచుండును, పాపము హరింప బడుచుండును, మనస్సును హరింపఁబడుచుండును. ఒకానొక మహాచోరుఁడు నా మనస్సును హరించినపుడు నేను వైష్ణవుల ధనము నేను హరింపఁగలను. నాది శైవవేషమైనను, మనస్సుపై నాకధికారము లేదు. దానిని మదనమోహనుఁడు హరించినాఁడు.'' ఇంతకు సారాంశమేమనఁగా మనస్సెచ్చటనో లగ్నమైయుండును. తను వెచ్చటనో ఇంకొక స్థానమున బంధింపఁబడియుండును. విరహాగ్ని ప్రబలముగ నుండునప్పు డీ శరీర బంధనమును విడిపించుకొనవలసి వచ్చును. స్థూల శరీరమును వదలి సూక్ష్మ శరీరమునఁ బ్రియుని సమీపమునకు వివశులై పోవలసి వచ్చును.

సూతుఁడిట్లనెను:- ''మునులారా! గోపికలందఱును నిండ్లు వాఁకిండ్లను, సమస్త పరివారమునందు మోహామమతలను వదలి శ్రీకృష్ణుని కడకు బరువిడిరి. ఇంటిలోని వారెంతగా నడ్డగించినను నాగలేదు; కాని కొందఱింండ్లయందును నుండిరి, వారిండ్లలోపల శరీరముతో గృహకార్యములొనర్చు చుండినను మనస్సు మన మోహనుని మాధురియందు మత్తిల్లి లగ్నమైయుండెను. మనస్సుతో వారు నిరంతరము మదన మోహనునిఁ జింతించుచుండిరి. ఇంతలోనే వారి కర్ణకుహరములందు మధుర మురళీ నినాదము పడెను. వారు సమస్త కర్మములను వదలి వెడలుట కుద్యుక్తులైరి.

పుట్టినింట నుండువారిని వారి తల్లి దండ్రులును, తోఁబుట్టువులును 'నెచ్చటికిఁబోవు చున్నా'వని అడిగిరి.

అత్తవారింట నుండు వారిని నత్తయును, ఆడుబిడ్డయును, భర్తయును 'నెచ్చటికీ ప్రయాణ' మనిరి.

వారందఱకొక్కటియే ప్రత్యుత్తరము. మేమీ మురళీ ధ్వనియొక్క ఉద్గమస్థానమును వెదుకఁబోవు చున్నాము. వారి అవిభావకు లిట్లనిరి:- "మీకు మతి పోలేదు కదా! మీరు మురళీయొక్క ఉద్గమస్థానమును వెదకినను మీకేమి లభింపఁగలదు ? మృగతృష్ణనుగూర్చి తెలిసికొనుటకు జ్యేష్ఠ వైశాఖమాసములో రెండు జాముల వేళ మరుభూమి ఇసుక పట్టులలోఁ దిరుగుచుండిన, మృగతృష్ణ కనఁబడుచున్నను దానివలన లాభమేమి కలుగును ?"

ఇప్పుడు వారు దీనికేమి ప్రత్యుత్తర మొసంగఁ గలరు ? ఎవరి మనస్సెచ్చట లగ్నమైనదో వారి కచ్చటనే సమస్తమును గలదు. విషక్రిమికి విషమును దినుటలోనే సుఖము కలదు. చకోరమునకు అగ్నినిఁ దినుటయందే సుఖము కలదు. సుఖము మనస్సునకు సంబంధించిన వస్తువు. మనస్సునకేది నచ్చిన నదియే సుఖము, వారి మనస్సులు శ్యామసుందరునిలో రమించుచున్నవి. వారి నేత్రములు నిరంతరము శ్యామదర్శనముకొఱకు ఉవ్విళ్లూరు చున్నవి.

విముఖులకేమి విషయమేమి తెలియును? మే మాతని సమీపమునకుఁ బోయెదము. అవశ్యము పోయెదము. ఎవరాపినను ఆగము. "వారవిభావకుల ప్రశ్నకుఁ బ్రత్యుత్తరముగ నిట్లు దృఢముగఁ జెప్పిరి:- "ఏమైనఁగానిండు, అందఱును బోవుచున్నారు కావున మేమును బోవుచున్నాము, అవశ్యము వెళ్లఁగలము. మేముండఁజాలము."

ఎవరి మీఁదఁదమ కధికారమున్నదనుకొనుచున్నారో వారు తమకు విరుద్ధముగఁ బ్రత్యుత్తర మొసంగుటను సహింపరు. తన్నాశ్రయించినవారు తన యిష్టము ప్రకారము పోవలయుననియుఁ, దన యిష్టమునకు విరుద్ధమగు నాచరణము పనికి రాదనియుఁ, దన యాజ్ఞ నుల్లంఘింపరాదనియు వారు సదా కోరుకొనుచుందురు. నేఁడు తమ భార్యలును, బుత్రికలును నిట్లు పలుకుటనుగాంచి వారు మిక్కిలి క్రోధమును జెందిరి. వారి మనస్సులం దీర్ష్యా సంచారము కలిగెను. వారి కంటెఁ దాము పెద్దవారమనియు, సంరక్షకులమనియు భరణపోషణ మొనర్చువారమనియు, నట్టి మన యెదుట నిట్టి విరుద్ధాచరణ మొనర్చుచుఁ బైఁగా విరుద్ధముగఁ బ్రత్యుత్తర మొసంగుచున్నారని వారికిఁ గ్రోధము కలిగెను. క్రోధముతో వారిట్లనిరి:- "నీ వెట్లు పోయెదవో చూచెదనుగాక! అందఱును నిర్లజ్జతోఁ బోయినఁ బోనిమ్ము కాని నేను నిన్నుఁ బోనీయను. నిన్ను నిర్లజ్జగాఁ బోనీయను. బలాత్కారముగ

నిన్నాపెదను. నీవెట్లు పోయెదవో చూచెదనుగాక!'' అని పలికి వారు ఇంటికిఁ దాళమును బెట్టిరి. వారింటిలో బంధింపఁ బడిరి. వారి పాంచభౌతిక దేహము ఇంటి గోడలమధ్య బంధింపఁబడెను.

దీనివలన వారికి మర్మాంతిక దుఃఖము కలిగెను. నేఁడే ప్రియుతముని గలిసికొను రోజు. నేఁడే సంయోగసుఖము ననుభవింపవలసినది. నేఁడే యీ విఘ్నము. మరల నిట్లను కొనెను:- ''శరీర సంయోగము తుచ్ఛము. మన స్సంయోగ మున సుఖము కలదు. ఇంటిలోనివారు మా శరీరముల నింటి యందే బంధించిరి. మనస్సుమీఁద మన మోహనునకే అధికారము కలదు. ఏమైనఁగానిందు మానసికముగ బోయి ఆతనిఁ గలిసికొనెదము.'' అని యాలోచించి వారు తమ యుత్కృష్టభావమును భక్తభయ హారియగు నందనందన చరణారవిందములందు లగ్నమొనర్చిరి. భావనా తీవ్రతచే వారు తన్మయులైరి. వారు బాహ్యప్రపంచమును బూర్తిగా మఱచిరి. ప్రాపంచిక విషయములన వారు కన్నులను మూసి కొనిరి. ఇప్పుడు వారిముందు శ్రీకృష్ణుఁడు మాత్రమే యుండెను. వా రాతని ధ్యానమున మగ్నులైయుండిరి. వారి చిత్తము లేకాగ్రములై యుండెను. వారికి భావ సమాధి కలిగెను. ''ఏలనయ్యా? భావ సమాధి శుభాశుభ కర్మలు నాశనమైనపుడే కలుగును. శుభాశుభ కర్మల [illegible]

పోయి కొన్ని పోయున్నచో శరీరమే యుండఁగూడదు. శరీరము శుభాశుభముల యొక్క సమ్మిశ్రణ ఫలముకదా!"

హృదయమునఁ దీవ్ర విరహవేదన ఉదయించినచో సమస్త అశుభకర్మలా విరహాగ్నియందు భస్మమగును. విరహాగ్ని సమస్త మనోమలములను గాల్చివేయును. వారి మనస్సులో మన మోహనునిఁ గలిసికొనవలయునను నుత్కటమగు నభిలాష కలదు. ఆ యభిలాషకు ఆఘాతము కలుగుటచేఁ బ్రియతము నెడల దుస్సహ విరహవేదనముచే వారి మనస్సులందొక విధమగు నగ్ని ప్రజ్వలితమయ్యెను. దానిలో నాతని సమస్త సంచిత ప్రారబ్ధ అశుభకర్మలు నాశనమయ్యెను. ఇఁక మిగిలినవి శుభపుణ్యకర్మలు. అవి ధ్యానావస్థయందుఁ బ్రియతముని ప్రేమాలింగనముచే వారికి పరమానందము ప్రాప్తించెను. దానివలన సమస్త శుభకర్మలు భస్మమయ్యెను. అశుభకర్మ క్షయము దుఃఖము లనుభవించుటచేఁ గలుగును. ఎవరి కంతగా దుఃఖములు ప్రాప్తించునో వారి కంతగా నశుభకర్మలు నాశనమగును. సుఖకర్మ క్షయము సుఖోపభోగముచేఁ గలుగును. ఎవరికెంతగా సుఖములు కలుగునో, వారికంతగా శుభకర్మలు అనఁగాఁ బుణ్యకర్మలు నశించును. శ్రీకృష్ణ విరహమునకంటె గోపికల కింకొక దుఃఖము లేదు. ఆతని ప్రేమాలింగనముకంటె మించిన సుఖము లేదు. వారికి సుఖదుఃఖములు

రెండును నొక్కసారిగాఁ బ్రాప్తించెను. ఇప్పుడు వారికి బాపమును మిగులలేదు. పుణ్యమును మిగులలేదు. పాపపుణ్య భోగములు మిగిలి యున్నంతవఱకే యీ శరీరము నిలుచును. భోగములు సమాప్తికాఁగానే శరీరమును సమాప్తియగును.

ఏ గోపికలను ఇంటిలోని వారడ్డగించిరో వారికి నంద నందనునియందు భగవద్బుద్ధి లేదు, భగవద్బుద్ధి కలవారిని నిరోధించుట కెవరికిని శక్తి లేదు, వారు సాధన సిద్ధలగు గోపికలు. సాధన చేయఁగాఁ జేయఁగా వారికీ జన్మమందే శ్రీకృష్ణ దర్శన సౌభాగ్యము కలిగినది. అయినను వారి శరీరమందింకను గొంచెముగఁ బ్రాకృతాంశము కలదు. ప్రాకృత శరీరముతో శ్రీకృష్ణుఁడు లభింపఁడు. ఆతఁడు దివ్య శరీరము కలవాఁడు. సాధకుని దివ్యునిగా నొనర్చును, అప్పుడు గాని ఆతఁడు లభింపఁడు, వేలకొలఁది జన్మముల పుణ్య ప్రభావముచేతను-శుభ కర్మానుష్ఠానముచేతను-శ్రీకృష్ణుని దేవ దుర్లభ దర్శన సౌభాగ్యము ప్రాప్తించినది. కాని పుణ్యపాప ప్రభావముచే వారికి శ్రీకృష్ణుని యథార్థ స్వరూప జ్ఞానము లేదు, కలకండయను జ్ఞానము లేకున్నను దైవికముగ నది నాలుకకు దాకెనా అది తీపిగనేయుండును. ఇదేవిధముగ నీతఁడు సాక్షాత్తుగఁ బరబ్రహ్మ పరమాత్మయను జ్ఞానము వారికి లేకున్నను శ్రీకృష్ణుఁడు పరాత్పర ప్రభ వేకదా!

వారాతని సౌందర్య మాధుర్యములకు వశులైరి. వారికి లౌకిక పతులున్నను వారికి వారి శరీరములను నొప్పగించిరి. కాని మనస్సును మన మోహనునకు మూల్యము లేకయే అమ్ముకొనిరి. ఆతనినే తమకు యథార్థమగు పతిగా భావించిరి. లోకదృష్టిచే దానిని జారభావ మందురు. లోక దృష్టిచే వారికి శ్రీకృష్ణునందు జారభావమే కలదు; కాని పరమాత్మయగు శ్రీకృష్ణుని సంగము లభించుటచే వారి సమస్త శుభాశుభ కర్మబంధములును దెగిపోయెను. బంధములు తెగిపోఁగానే వారు తమ పాంచభౌతిక త్రిగుణమయ శరీరమును త్యజించిరి. వారు దివ్యదేహముతోఁ బరాత్పర ప్రభువగు నందనందనుని గలిసికొనిరి.''

సూతుఁడిట్లనెను:- ''మునులారా! ఇది వినఁగానే విష్ణురాతుఁడగు బరీక్షిన్మహారాజునకొక గొప్ప శంక కలిగెను. ఆతఁడు నా గురుదేవుఁడగు శుకునకు జేతులను జోడించుకొని యిట్లడిగెను:- ''ప్రభూ! ఈ వ్రజాంగనలు శ్యామసుందరుఁడును, మదనమోహనుఁడునగు నందనందనునిఁ బరమ ప్రేష్ఠకాంతునిగా భావించిరి. వారి చిత్తము లాతని సౌందర్య మాధుర్యముల వలన నాకృష్టములైనవి. వారి కాతనియందు బ్రహ్మ భావము లేదు. బ్రహ్మభావము లేక సుదృఢమగు నీ సంసారబంధనము తెగదు. వారి బుద్ధియందు సంయోగ

సుఖేచ్ఛయే కలదు. వారు శ్రీకృష్ణుని బతి భావముతో నాలింగనమొనర్చుఁదలఁచుచుండిరి. అనఁగా వారి మనస్సులలోఁ గామ భావమే కలదు. గుణమయబుద్ధి యుక్తులైనను వారి యీ గుణప్రవాహరూపమగు సంసారమెట్లు తెగినది? వారేవిధముగఁ గర్మబంధనములనుండి విముక్తులైరి? కామ భావమున్నను వారికి సుదుర్లభమగు పరమపదప్రాప్తి యెట్లు లభించినది?

సూతుఁడిట్లనెను:- "మునులారా! మా గురుదేవుఁడు మిక్కిలి యుల్లాసముతోఁ దన్మయుఁడై రాసలీలా వర్ణన మొనర్చుచుండెను. రాజు చేసిన నీ శుష్కప్రశ్న కాతని ప్రవాహ మాగిపోయెను. ఆతఁడానందింపలేదు. ఏ వక్తయైనను ధారాప్రవాహముగఁ దన్మయుఁడై యేదో విషయమునుగూర్చి చెప్పుచుండిన నప్పుడు మధ్యలోఁ గుతర్క మొనర్చి దాని నాపినచో నాతని భావశృంఖల తెగిపోవును. ఆతఁడా ప్రశ్నకుఁ బ్రత్యుత్తర మొసంగును గాని ఆతని కథనమున నంతటి తన్మయత ఉండదు. ఈ విధముగ శుక మహర్షికిని ధారాప్రవాహముగఁ జెప్పుచుండిన ధార ఆగి పోయెను. ఆతఁడు రాజుచేసిన శంక కేవిధముగ సమాధాన జెప్పెనో దాని వర్ణనమును నేనుముందు చేసెదను."

---

# శ్రీకృష్ణునందు గామభావమును గల్యాణప్రదమే

(౯౬౪)

శ్లో॥ ఉక్తం పురస్తాదేతత్తే
చైద్యః సిద్ధిం యథాగతః।
ద్విషన్నపి హృషీకేశం
కిముతాధోక్షజ ప్రియాః॥

(శ్రీ) భాగ. ౧౦ స్కం. ౨౯ అ. ౧౩ శ్లో.

మ॥ మును నేఁ జెప్పితిఁ జక్రికిం బగతుఁడై
మూఢుండు చైద్యుండు పెం
పునఁ గైవల్య పదంబు నొందెఁ బ్రియులై
పొందంగ రాకున్న దే
యనఘుం డవ్యయుఁ డప్రమేయుఁ డగుణుం
డైనట్టి గోవింద మూ
ర్తి నరశ్రేణికి ముక్తిదాయిని సుమీ
తెల్లంబు భూవల్లభా॥

(శ్రీ) మదాంధ్ర భాగవతము.

పాత్రను బట్టియు, ననుపానమును బట్టియు ఫలము భిన్నముగనుండును. స్వాతిబిందువులు గజమస్తకమునఁ బడినచో గజమౌక్తికములగును, నదిలోఁబడినచోఁ ద్రావు నీరగును, అదియే సముద్రమునఁ బడినచో నపేయముగ నుప్పగ నగును. ఇది పాత్ర భేదమువలన ఫలభేదము కలిగినది. ఇదేవిధముగ ననుపాన యుక్తులచేతను బరిణామము భిన్నముగ నగును. విషముయొక్క ధర్మము చంపుట. కాని యెవని శరీరమున జంగమ విషము కలదో వానికి యుక్తితో స్థావర విషమీయఁబడును. అది జంగమ విష ప్రభావమును నశింపఁజేసి జీవన ప్రదాన మొనర్చును. విషము పని చంపుటయే, కాని అదియే పాత్ర విశేషమునఁ బ్రయోగించినచో నమృతము పనిచేయును. ఓషధినిఁ దెలిసి తిన్నను దెలియక తిన్నను దానిపని అదిచేయును. రోగికి విషౌషధ మావశ్యక మనుకొనుఁడు. దైవికముగ నది అట్లే లభించినచో, దెలియక ఆతడు దానినిఁ దిన్నను రోగమును నశింపఁ జేయును. తప్పక చేయును. ఈ విషయమున నొక యథార్థ మగు సంఘటనము కలదు.

ఒక ప్రసిద్ధుఁడగు వైద్యుఁడుండెను. అతని కడకొక నిర్ధనుఁడగు అసాధ్యరోగి వచ్చెను. వైద్యుఁడాతని రోగ నిదాన మొనర్చి యిట్లనెను:- "అయ్యా! నీరోగ మసాధ్యమైనది."

అతఁడు దీనముగ నిట్లనెను:- "వైద్యులవారూ! మీరన్ని రోగములకును జికిత్స నెఱుఁగుదురు. గొప్ప గొప్ప రోగములకు నయముచేయుచుందురు. నా రోగమునకు మీవద్ద నౌషధము లేనేలేదా?"

వైద్యుఁ డిట్లనెను:- "నాయనా! ఔషధమేల లేకుండును. ఒక్క-కాలమునకు దప్ప మిగిలిన రోగముల కన్నిటికిని నౌషధములు కలవు. కాని నీకౌషధమును జేయుట చాల ఆలస్యమగును. సర్పమును జంపి, దాని పడగ మీఁదఁ జెఱకును మొలిపించవలయును. దానిని సేవించుటచే నీకు రోగవిముక్తి కలుగును. దాని కాఱునెలలు పట్టును, నీ వాఱునెల లౌషధముగఁ జూచినను బ్రదుకఁజాలవు, కావున నేమియును జేయఁజాలము. భగవంతుని స్మరించుకొనుము. హరిస్మరణమే సమస్తరోగములకును దివ్యౌషధము."

ఇంతటి గొప్ప వైద్యుఁడు చెప్పినాఁడు కావున నిఁకఁ దాను బ్రదుకఁజాలనని నిశ్చయించుకొని, జీవితముపై నాశను విడిచి తన గ్రామమునకుఁ బోవుచుండెను. గంగాతీరమున నున్నగల పొలముల అచ్చటఁ జెఱకు అధికముగఁ బెరుగును. మార్గమున నాతని కాకలివైచెను. ఎదురుగాఁ జెఱకు తోటయున్నది. అతఁడందలొక లావైన చెఱకు గైకొని యచ్చటనే కూర్చుండి తినెను. తినిన దర్వాత

నాతఁడు రెండుసార్లు మల విసర్జనమునకుఁ బోవలసివచ్చెను. శౌచమార్గమున నాతని రోగమంతయును బయటకుఁ బోయెను. శరీరము స్వస్థముగను, రోగరహితముగను నయ్యెను. తిరిగి ఆతఁడు మరల వైద్యుని కడకుఁబోయి బరీక్ష చేయించుకొని నిట్లనెను:- "అయ్యా! ఇప్పుడు నా నాడినిఁ జూడుఁడు" వైద్యుఁడు మరలఁ బరీక్ష చేసి యిట్లనెను:-"నీవు స్వస్థుఁడవైతివి. నీవేమి తింటివి?"

ఆతఁడిట్లనెను:- "స్వామీ! నేనేమియును దినలేదు. ఒక చేనిలోఁ జెఱకును దీసుకొని తినియుంటిని.

వైద్యుఁ డిట్లనెను:- "పోవుదముపద. దానిని నాకుఁ జూపింపుము." అని ఆతఁడాతని వెంటఁబెట్టుకొనిపోయెను. ఆస్థానమును జూపింపఁగా నతఁడు దానినిఁ ద్రవ్వి చూడఁగా నచ్చట నొక నల్లత్రాచు చచ్చియుండెను. దానిమీఁద నీ చెఱుకుగడ మొలచియుండెను. దానివలన నాతని రోగము నశించెను. అట్లని సౌందర్యముమీఁద నాసక్తినిఁ జెంది గోపికలు ప్రేమించి యుండినచోఁ బాపము సంభవించెడిదే, వారు దైన యోగమునఁ దెలియకున్నను శ్రీకృష్ణుని సౌంద ర్యముమీఁద నాసక్తినిఁ జెందిరి. అట్టిమెడ నింక వారికి సంసార బంధనముండునా?"

సూతుఁడిట్లనెను:- "మునులారా! మా గురువగు శుకమహర్షి ధారాప్రవాహముగ రాస పంచాధ్యాయకథను జెప్పుచుండ మధ్యలో "భగవానునియందు బ్రహ్మభావము లేకయే గోపికలు గుణ ప్రవాహ రూపమగు సంసారము నుండి యెట్లు నివృత్తులైరి?" అను శుష్కప్రశ్నమును బరీక్షిన్మహారాజడిగెను. అప్పుడు శుకుఁడు గద్దించి యిట్లనెను:- "రాజా! నేనీ విషయము నిదివఱకే నీకు జెప్పితిని. నీవీ విషయమున మాటిమాటికేలఁ బ్రశ్నించెదవు?"

రాజు దీనతాస్వరమునఁ జేతులను జోడించుకొని యిట్లనెను:- "ప్రభూ! నేనల్పమతిని, మఱచితిని, మీరే ప్రసంగమున గోపికలయొక్క యీ భావము విషయమునఁ జెప్పితిరో నాకు గుర్తు లేదు."

శుకదేవుఁడిట్లనెను:- "గోపికల పేరును జెప్పి నేను జెప్పలేదు. కాని ప్రహ్లాద చరిత్ర నారంభించుచు దేవర్షి నారద, ధర్మరాజ సంవాదమునకుఁ బ్రారంభమున శిశుపాల ముక్తి విషయమునుగూర్చి చెప్పితిని. శిశుపాలుఁడు చేది దేశపురాజు. భగవానునకు మేనత్తకుమారుఁడు. ఆతనికిఁ గృష్ణునందు బ్రహ్మభావము లేదు. ఆతఁడాతనిఁ దన ప్రతిస్పర్థియగు శత్రువుగా భావించుచుండెను. నిరంతరమాతనిఁ దిట్టుచుండెను. పుట్టినది మొదలు చచ్చువఱకును భగవంతుని

దూషించుచునే యుండెను. ద్వేషభావముతో నాతనిఁ జింతించుచుండెను. అన్యునియెడల ద్వేషము వహించియుండి నచో నా మానవుఁడు నరకమునకుఁ బోవలసినదే; కాని దైవవశమున నాతఁడెవని ద్వేషించెనో ఆతఁడు పరబ్రహ్మ పరమాత్మ తెలియక అమృతమును ద్రావినను నమరుఁ డగును. అదేవిధముగ భగవానుని ద్వేషభావముచేనైనను జింతించినచో నాతనికిఁ బరమపదము ప్రాప్తించినది."

పరీక్షిన్మహాజిట్లనెను:- "స్వామీ! ఈ గోపికలు భగవానుని ద్వేషించుటలేదు."

నవ్వి శుకదేవుఁడిట్లనెను:- "ఓయీ! ద్వేషముచే శిశుపాలుఁడు తరింపఁగా భగవంతునిఁ బ్రేమించుటచే గోపికలు తరింపరా? గోపికలు భగవానునిఁ బ్రేమించుటయే కాదు. వారు నందనందనునకును బ్రియులు. గోపీజన వల్లభుఁడును బృందావన విహారియును వారినిఁ బ్రేమించు చుండెను. భగవానునిఁ బ్రాణములకంటె నెక్కుడుగఁ బ్రేమించువారును, భగవానుఁడును నెవరిని గలిసికొనుటకు తహ తహలాడుచుండునో అట్టి గోపికలు సంసారబంధనము నుండి నివృత్తినిఁ బొందుటలో సందేహముండునేమో నీవే చెప్పుము."

రాజిట్లడిగెను:- "స్వామీ! ముక్తి నిర్గుణ జ్ఞానము వలనఁ గలుగును. ఈ గోపికలు సగుణ సాకార కృష్ణునిఁ బ్రేమించుచున్నారు."

అంత శుకుఁడిట్లనెను:- "రాజా! మూర్ఖులగువారే సగుణ నిర్గుణ విషయక వితండ వ్యర్థవాదముల నొనర్చు చుందురు. వాస్తవమున నే భగవానుఁడవ్యయ, అప్రమేయ నిర్గుణుఁడో, ఆతఁడే గుణముల కధిష్ఠానముగ నున్నాఁడు. జీవుల కల్యాణముకొఱకే ఆతఁడు సగుణరూపమున నవత రించుచుండును. సగుణ నిర్గుణములకు భేదము లేదు. ఆ సర్వే శ్వరునితో నేవిధమగు సంబంధమును బెట్టుకొన్నను, నే భావముతో సంబంధమును బెట్టుకొన్నను సంసార బంధనము భిన్న భిన్నమగును?"

రాజిట్లడిగెను:- "స్వామీ! మనస్సులోఁ గామవాస నయును, క్రోధ లోభములును నున్నంతవఱకు భగవానుఁ డెట్లు ప్రాప్తింపఁగలఁడు?"

ధృతతాస్వరమున శ్రీశుక మహర్షి యిట్లనెను:- "ఏమియును ఫరవాలేదు. కామభావముండిన నుండనిమ్ము. కామభావములోనుండు నదేమి? ఒక సుందర పురుషుని స్త్రీ కాంక్షించును. సుందర స్త్రీని పురుషుఁడు కాంక్షించును. ఆ కామభావమును భగవానునియందు లగ్నమొనర్పుము.

## శ్రీకృష్ణునందు గామ భావమును గల్యాణ ప్రదమే

భగవానునకు మించిన సుందర పురుషుం డింకెవరుండును? ఆతనిఁగాంచి పశుపక్ష్యాదులును మోహితములైనవి కదా! ఆతనియందే పతిభావమునుంచి ఆతని నిరంతరము చింతింప వలెను. ఆతనికి మించిన సుందర స్త్రీయును లేదు. ఆతని "మోహినీ, రూపమును గాంచి కామారియగు కపర్దియును మోహితుఁడైనాఁడు. కావునఁ గామభావమును గలిగియుండి నచో భగవంతుని మీఁదనే కలిగియుండవలెను. ఆతనినిఁ గామ భావముతో నిరంతరము చింతింపవలయును. గోపిక లీ భావముచేతనే తరించిరి.

నీలోపలఁ గ్రోధమున్నచో నల్ప వీర్యవంతులగు మానవులతోఁ గోపగించిన నేమి లాభము? సర్వ సమర్థుఁ డును, సర్వేశ్వరుఁడగు భగవానుని యెడలఁ గ్రోధము వహించినచోఁ దీపింపఁగలరు. ఈ విధముగనే భయముండి నచో భగవానుని గూర్చియే భయపడవలెను. కంసుఁడు నిరంతరము భగవానునకు భయపడెడువాఁడు. భయకారణ మున నాతనికి రాత్రులందు నిద్రయును లేదు. మనస్సులో నాతనినే చింతించుచుండెను. భగవానుని నే రూపమునఁ జింతించిన వారికారూపమున వారి మనోభావనానుసారముగఁ గోరికలను దీర్చును. కంసుఁడు కాలరూపమున నాతనిఁ జింతించుచుండెను. భగవానుఁడు కాలుఁడై ఆతనినిఁజంపెను. గోపికలు పతిభావమున నిరంతరము చింతించుచుండిరి.

ఏరూపమును వారు భజించుచుండిరో ఆరూపముచే వారితో రమించుచు వారి కోరికలను దీర్చుచుండెను. ప్రహ్లాద, నారదాదులు భక్తిభావమునఁ బ్రేమపూర్వకముగ నాతనిఁ జింతించుచుండిరి. వారిని భగవంతుఁడు ప్రేమచేతనే కృతార్థులఁ గావించెను. కొందఱు ఋషులును మునులును 'నేనే బ్రహ్మ' నను భావముతో నాతనిఁ జింతించుచుండిరి. భగవానుఁడు వారి నా భావముతోడనే భజించుచుండెను. ఐక్యరూపముననే వారిని స్వీకరించును. పాండవాదులాతనిని సుహృదులుగను, సంబంధులుగను భజించుచుండిరి. భగవానుఁడు వారి నాభావముతోడనే కృతార్థులను గావించెను. సారాంశమేమనఁగా భగవానునెడల నెట్టి భావమునుంచిన ఆతఁడా భావముతోడనే తన్మయతను జెందును. భగవానుఁడు సర్వ సమర్థుఁడు.''

పరీక్షిన్మహారాజిట్లనెను:- ''స్వామీ! నా మనస్సులోని సందేహమిదియే. మనస్సులోఁ గామక్రోధాది శత్రువులున్నంతవఱకు సంసారబంధము లెట్లు తొలఁగుననియే.''

శుకదేవుఁడిట్లనెను:- ''అదిగో, మరల నదియేమాట. ఓయీ! ఈ కామక్రోధాదులు భగవానునిమీఁద లగ్నమైనపుడింక శత్రువులెక్కడ? ఒక యువకుఁడుండెను. ఆతఁడు యువతులను గాంచుట పాపము. ఆ యువతులలోఁ దనకుఁ

గాఁబోవు పత్నియును గలదు. ఆమెవైపు చూచినను అతఁడు పాపముగ భావించును. ఆమెతోఁ బాణిగ్రహణము కాఁగానే ఆత్యాజ్య మెచ్చటనున్నది? ఈ కామక్రోధాదులను భగవానునిపై లగ్నమొనర్చినచో భగవానుఁడే సమస్తమును సంబాళించుకొనును. భగవానుని విషయమున శంకింపవలసిన పనిలేదు. అతఁడు కర్తుమకర్తు మన్యథాకర్తుం సర్వ సమర్థుఁడు. అతఁడు యోగేశ్వరుఁడు. అజన్ముఁడు, అందఱను దనవైపున కాకర్షించువాఁడు, అతఁడు తలఁచుకొనినచో నేఁడే సమస్త జగత్తును - కీట పతంగ శిలా తృణాదులను ముక్తులను గావింపఁగలఁడు. అట్టి యెడల జారబుద్ధిచేఁ జింతించు గోపికల సంసారబంధనమును నాశమొనర్చుటేమంత గొప్పకార్యము!"

చేతులను జోడించుకొని పరీక్షిన్మహారాజిట్లనెను:- "ప్రభూ! నా శంకకు సమాధానము వచ్చినది. దయచేసి మీరు తర్వాత కథను జెప్పుఁడు."

సూతుఁడిట్లనెను:- "మునులారా! పరీక్షిన్మహారాజు యొక్క యీ ప్రశ్నవలన మా గురుదేవుని కథన ప్రణాళిక ఇప్పుడు కొంచెము మారెను. అతఁడీవిషయమును సుస్పష్టముగఁ జెప్పక కొంచెము రహస్యమయముగ వర్ణనమొనర్ప సాగెను. తమ తమ గృహములలోని పనులను వదలి మురళీ

ధ్వనిని విని శ్యామసుందరుని కడకు బోయినవారు ఆతని సమీపమునకుఁ జేరుకొనిరి. వారినిఁగాంచి నిష్ఠురుఁడగు శ్రీకృష్ణుఁడెట్టి కఠోర కఠోర వాక్యులను బలికెనో ఆ విషయమును మీకు నే నిప్పుడు చెప్పెదను.

---

# ప్రేమాధిక్య ప్రస్తావము

(౯౬౬)

శ్లో॥ తా దృష్ట్వాన్తిక మాయాతా
భగవాన్ వ్రజయోషితః।
అవ దద్వదతాం శ్రేష్ఠోవాచః
పేశైర్విమోహయన్।

శ్రీభాగ. ౧౦ స్కం. ౨౯ అ. ౨౭ శ్లో.

క॥ ఘన మధురగీత నినదము
విని వచ్చిన గోపికలను వీక్షించి నయం
బున మేటి సుగుణి నేర్పరి
తన వాగ్వైభవము మెఱయఁ దగ నిట్లనియెన్॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

ఎవని వలన నేవ్యవహారమును మనము కాంక్షింపమో అట్టి వ్యవహారమును మనయెడల వారొనర్చినచో మనకు మర్మాంతికబాధ కలుగును. మనము పిల్లవానిని 'నీవు నీవు' అనుచుందుము, వాని నెప్పుడైనను 'తమరు' అనినచో నాతఁడేదో పప్పుమాడినదనుకొనును. తన వలన నేదియో అపరాధము జరిగినదని 'తమ' రను శబ్దమును వినఁగానే భయమును జెందును. దీనికి విపరీతముగ మనము సదా తమరనుచు, నెప్పుడైనను 'నీవని' అనినచో దాని నాతఁ డవమానముగ భావించును.

ప్రేమను బొందుట కధికారియగు వానితో శుష్క వాక్యములను బలుకఁజొచ్చినచో నది యన్యాయమే యగును. కాని ప్రేమయం దన్యాయము సాధారణముగఁ జెడ్డభావనచేఁ గలుగదు. ప్రేమను వృద్ధిఁబొందించుటకై కలుగును. లడ్డునుదినుటచే నోరు దీపియై ముఖము మొత్తును. అప్పుడు తీపిమీఁదఁ గోరిక నశించును. అప్పుడు కారముగ నుండు రెండు మిరియాలను దినిన నోరు మండును, కన్నుల వెంట నీరువచ్చును. నోజుట కారంభించును. శరీరమునఁ గంపము జనించును గాని మరల లడ్డును దినుటకు ఉత్కంఠేచ్ఛ జనించును. కావున మధ్యలో మిరియాలను దినుట అధికముగ లడ్డును దినుటకే, ప్రేమయొక్క కఠోర భాషలో ననంతప్రేమ దాగియుండును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! గోపికలు తమ సర్వస్వమును వదలి శ్రీకృష్ణుని సమీపమునకు వచ్చిరి. శ్రీకృష్ణుఁడు తమ్ముఁ జూడఁగనే గట్టిగాఁ గౌఁగిలించుకొనుననియు, నాత్మీయతా వ్యవహార మొనర్చునని యు భావించిరి. కాని వారి యాశ లతలపైఁ దుషారాఘాతమువలె నయ్యెను. వారి యిచ్ఛమీఁద పెద్ద దెబ్బ తగిలెను. శ్రీకృష్ణుఁడు వారినిఁ గాంచి ఆత్మీయతా వ్యవహార మొనర్పలేదు. ఆతఁడొక అపరిచిత వ్యక్తివలె శిష్టాచార వ్యవహార మొనర్చెను. ఆతఁడు నిలుచుండియే యుండెను. గోపికలను చూడఁగనే మిక్కిలి మధుర వాక్కులతో నపరిచితునివలె నిట్లనెను:- "రండు, రండు! స్వాగతమ్! స్వాగతమ్!! మహాభాగులారా! అబ్బో ఎంతో శ్రమపడినారు. మీకు నాతో నేమైనఁ బని యుండినచో నివేదింపుఁడు. మీ యాజ్ఞ ప్రకారము నడుచుకొనుటకు నేను సర్వదా తత్పరుఁడనై యున్నాను."

ఈ వాక్యములను విని గోపికలు సంభ్రాంతలైరి. శ్రీకృష్ణుఁడు తమ యెడల నిట్టి శిష్టాచార వ్యవహార మొనర్చునని వారు కలలోనైన ననుకొనలేదు. వారిట్లనుకొనిరి:- "శ్యామసుందరా! నవ్వులాటాల కనుచున్నావేమో!" ఈతని స్వభావము వినోద స్వభావము. ఇప్పుడింకఁ బ్రియవాక్యములు పలుకఁగలఁడు. కాని శ్రీకృష్ణుఁడు కొంచెము స్వచ్ఛ

ముగఁ జేయఁదలఁచి మరల నిట్లనెను:- "సుందరులారా! ఈ ఘోర రాత్రివేళ పురుషులు లేక మీరిచ్చటకు ఒంటరిగా వచ్చుటవలన నాకు మిక్కిలి ఆశ్చర్యమగుచున్నది. వ్రజములో నందఋను గుశలముగ నున్నారా? భూత, ప్రేత, రాక్షసు లెవరును రాలేదుకదా! లేక జలాగ్ని చోరాది భయము లేవియును సంభవింపలేదుకదా! ఇట్టి వేవైనను సంభవించిన నాతో నేమైనఁ బనియుండినచోఁ జెప్పుఁడు. అట్టివేవియును లేకుండినచో నిచ్చట వనములో సింహా వ్యాఘ్రాది హింసక జంతువులుండును. కావున మీరెట్లు వచ్చితిరో అట్లే తిరిగిపొండు.

'తిరిగిపొండు' అనఁగానే అందఱుకు నిర్ఘాంతపోయిరి. శ్యామసుందరుఁడు పరిహాస మొనర్చుటలేదు. ఈతఁడు తప్పక మనలను గాదనుచున్నాఁడు. నేఁడీతఁడిట్లైనాఁడేమి? అయ్యో! మనమే ఏటి యెట్టి యాశాసౌధమును నిర్మించుకొంటిమి. దాని నతఁడొక్క కఠోర శబ్దముచేఁ గూలఁద్రొన్నినాఁడు. పడఁగొట్టినాఁడు. అయ్యో! వేఁటగాఁడుమన నమూయకముగ నుందురు, వారేమియును మాటలాడలేదు. వికచ కమలములవలె నున్న శ్యామసుందరుని నేత్రముల వైపున కట్లే చూచుచుండిరి. వానిలో ననంతానురాగము నిండియుండెను, కాని నోట విషము గ్రక్కుచున్నట్లుండెను. ఆతఁడు గోపికలు మెదలకుండుటనుగాంచి మరలని ట్లనెను:-

"స్త్రీలు ఏకాంతమునఁ బరపురుషుని సమీపమున నధిక కాలము నిలుచుట ఉచితముకాదు. మీరింట్లనవద్ద చెప్పకయే వచ్చియుంటిరి. అచ్చట మీ తల్లులు, తండ్రులు, పుత్రులు, అత్తలు, మామలు, సోదరులు, బంధువులు, పతులు మొదలగు వారందఱును మిమ్ములను వెదకుకొనుచుందురు. రాత్రులందు మీరు లేకుండుటనుగాంచి వారు చింతించుచుందురు. వారి నందఱను మీరు చింతలోఁ బడవేయరాదు. వ్యర్థముగ నిచ్చట నుండుటకేమియును బనిలేదు. అకారణముగ రాత్రియందు వనములో నివసించుటను శాస్త్రకారులు నిషేధించిరి. కావున మీరు మీ మీ గృహములకుఁబొండు."

తమ్ము వెడల నడుపఁదలంచుచున్నాఁడని గోపికలిప్పుడు గ్రహించిరి. ఇంతవఱకును ఏతఁడు చూపించినది ప్రేమకాదు, కపటప్రేమ. ఈతఁడు మనల నేవగించుకొనుచున్నాఁడు. హా! స్త్రీ జాతి కెంతటి దుర్దశ కలిగినది! వారేమియును మాటలాడలేదు. ఇట్లనుకొనిరి:- "ఇంత సుందరము మృదుమధురముగనుండు నీ నోటినుండి యిట్టి విషభరితములగు వాక్కులెట్లు వెలువడినవి. చంద్రునినుండి అమృతము స్రవింపవలయును. ఈ చంద్రముఖమునుండి విష ధారలు ప్రవహించుచున్న వేమి?"

శ్యామసుందరుఁడిట్లనెను:- "మంచిది, నేనిప్పుడు తెలిసికొంటిని. నేఁటిరాత్రి మిక్కిలి అందముగనున్నది. దీనిని

వస్త్రప్రదేశమునుండి గాంచవలయునని అందఱును గాంక్షించుచుందురు. బహుశః మీరట్లు చూడవలయు ననియే యిచ్చటికి వచ్చియుందురు. ఆ మీ కోరిక నెఱవేరినది. చంద్రకాంతులచే రంజితమై, యమునాజల ఉత్తాల తరంగ స్పర్శచే శీతలమై, మంద సుగంధ పవన గీతిచేఁ గదలుచుండిన నవ పల్లవములచే సుశోభితమై శారదీయ సుషమాచే వికసితమగు బృందావన శోభను గాంచితిరి గదా. శారదీయ నిశను చూడవలెనను మీసంకల్పము నెఱవేరినది. కావున నింక నాలస్య మొనర్పరాదు. ఇఁక నిప్పుడు మీరందఱును గలిసి వెంటనే వ్రజమునకుఁ దిరిగి పొండు. గృహస్థుల కిది పని సమయము. మీరింకను బాలను బితికినట్లు లేదు. ఇంకను గడ్డినిఁ దినక తల్లిపాల మీఁదనే ఆధారపడియుండునవి ఆఁకలి చెందియుండవచ్చును. అవి యింకను నిద్రింపకుండవచ్చును. అంబాయని యఱచు చుండును. త్వరగాబోయి వానినిఁ బాలకు విడువుఁడు. పాల మీఁద నాధారపడియుండు పిల్లలాఁకలినిఁ జెందియుందురు. వారింకను నిద్రించియుండరు. మీరు పోయి వారికి పాలిచ్చి శయ్యలపైఁ బరుఁడఁబెట్టుఁడు. మీ పతులు పగలంతయును పనిచేసి అలసియుందురు. పోయి వారిని సేవింపుఁడు ఈగృహ కార్యములన్నిటిని వదలి మీరందఱును నిచ్చటికేలవచ్చితిరి?

గోపికల సాహసము సడలెను. ఎట్టి నిష్ఠురునిఁ బ్రేమించితిమి. ఇట్టి సౌందర్యమాధుర్యమునఁ దిట్టి నిష్ఠురతయు నుండునా! ఇది మనకు మొదటనే తెలిసియుండినచోఁ బ్రీతి నిఁ జెందకుండెడువారమే, కాని యేమి చేయఁగలము. మోసపోయితిమి. పాము, ఛిట్టెలుకనువలె మ్రింగుటకును వీలులేకుండెను. గ్రక్కుటకును వీలులేకుండెను. వారు పోఁ జాలకుండిరి. ఉండుటకు వీలులేకుండెను. ప్రాణములున్నంత వఱకు వారు పోఁజాలరు. ఒక్కసారి హృదయము నర్పించి నప్పుడింక దానికిఁ దిరుగు లేదు.

శ్యామసుందరుఁ డాగలేదు. చెప్పుచునే యుండెను. అతఁడిట్లనెను:- "మీరిచ్చటికి నాయందాసక్తినిఁ జెంది వచ్చి రనుట నిజమే, నన్నుఁ బ్రేమించుట దోషముకాదు. ఏల ననఁగాఁ బరమ ప్రేమాస్పదుఁడను నేనే, ప్రాణులందఱును నన్ను బ్రేమించెదరు. అట్లు చేయవలెను. కాని ప్రేమ దూరమున నుండిననే బాగుండును. మిక్కిలి దగ్గఱగనుండిన గడబిడగనుండును. అధర్మము సంభవించుటకు వీలున్నది. మీరు సతులు మీయొక్క ధర్మము పతులకు సేవచేయు టయే. స్త్రీలకు పతియే పరమేశ్వరుఁడు, నిష్కపట భావము తోఁ బతిని సేవించుటయే వారికి పరమారాధనము. పతినిఁ, బతికి సంబంధించిన మఱఁది, బావ, అత్త, మామ, ఇతర

బంధువులను శుద్ధ భావనముతో సేవించుటయును, దమ సంతానమును ప్రేమపూర్వకముగఁ బాలన పోషణ మొనర్చుటయే, స్త్రీలకుఁ బరమ ధర్మము. పరపురుషులయందుఁ బ్రీతి కలిగియుండుట పాపము.

పతినిఁ ద్యజించుట ఆర్య స్త్రీలకు మిక్కిలి కలంకమగు విషయము. పతిత్యాగ మేస్థితియందును నుచితముకాదు. పతి క్రోధియైనను, దుష్టస్వభావము కలవాఁడైనను, భాగ్యహీనుఁడైనను, సతులు తాము కష్టమును సహించి నిర్వహించుకొనవలయును. దీనిలోనే వారికి గొప్పదనము కలదు. మహాత్వము కలదు. ఏ స్థితిలోను బతిని ద్యజింపవలయునను కొనరాదు. అతఁడు సర్వథా పతితుఁడైనను, విధర్మియైనను ద్యజించుట వివశత చేఁదప్పదు.

గోపికలిట్లనుకొనిరి:- "నిన్నటి కుఱ్ఱఁడగు నీ శ్యామసుందరుఁడు మనకు ధర్మోపదేశమును జేయ నిలిచినాఁడు. ఇచ్చటికి మనము ధర్మోపదేశమును వినుటకు వచ్చితిమా? ధర్మోపదేశమును వినఁదలఁచినఁ బెద్ద పెద్ద గడ్డములను బెంచుకొనిన వేదజ్ఞ బ్రాహ్మణులు చాలమంది కలరు. కలశమునందు విషమువలె నున్నది.

శ్యామసుందరుఁడాగలేదు, అతఁడట్లే చెప్పుచునే యుండెను. అతఁడిట్లనెను:- "సతీ సాధ్వులగు, కులవతులు

కగు పతివ్రతలకు జారసేవ సర్వత్ర నిందనీయమైనది. జారుల వలన నింతవఱకెవరైన సుఖమును బొందిరా? జారులు చాల స్వార్థులుగ నుందురు. తమ సుఖమునే చూచుకొనుచుందురు. వారికి స్వార్థసిద్ధి కలుగగానే ఇంకఁ బలుకరు. మరల స్త్రీ యింకొక జారుని వెదకికొనును. ఈ విధముగ నామె కెన్నటికిని శాంతి లభింపదు. విషయములు భోగములచే శాంతింపవు. ప్రజ్వలితాగ్నియందు నేతినిఁబోసిన నది యధికమైనట్లు జారుల కడకుఁబోయిన నెవరికిని శాంతి లభింపదు. తృప్తి జనింపదు. అధికముగు నశాంతియే యుండును. జారుని సేవించువారలకే లోకమునను సుఖము లేదు, పరలోకమునను సుఖము లేదు. ఈ లోకమున నపయశస్సును, బరలోకమున నరకయాతనలను ననుభవింపవలసివచ్చును. ఇది అత్యంత తుచ్ఛమును, నీచమును, నిందనీయమును, భయదాయకమును, గష్టకారకమునగు గర్మ కాఁగలదు.''

గోపికలిట్లనుకొనిరి:- ''మనము భగవంతుఁడను కొనువానినిఁ బ్రేమించు టేమంత పాపము కాదు. ఆతనిని జారుఁడనుట ఇది అన్యాయముకాదా? భగవంతునిఁ బ్రేమించుటలో దోషము కలదా? మనము మన సర్వస్వమును నాతనికి సమర్పింపఁగా, మన మనస్సులోఁ గామభావమున్నను, దానిని శమింపఁ జేసికొనుట కాతని కడకుఁ

బోయి, మన భావములను, విరుద్ధమొనర్చు కొనెదము. మన మాతని ప్రేమించితీరెదము.''

భగవానుఁ డంతటితో నాగలేదు. ఆతఁడిట్లనెను:- ''సరే, మీరు నన్నన్యముగఁ ప్రేమించుచున్నారను కొనుఁడు. ప్రేమలో నంగ సంగమును జెందు నవసరము లేదు. నిత్యమును నియమముగ నాగుణ శ్రవణ మొనర్పుఁడు. నిత్యమును రెండు వేళల వచ్చి శ్రద్ధా భక్తులతో నా దర్శనమును జేయుఁడు, నా మూర్తిని ధ్యానింపుఁడు. నిత్యమును నా సుమధుర నామములను గీర్తింపుఁడు. వీనిచే నామీఁదఁ ప్రేమ కలిగినట్లు నా సమీపమున నుండుటచేఁ గలుగదు. ఎక్కువ కాలము సమీపమున నుండుటచే నశ్రద్ధ కలుగును అతి పరిచయము వలన నవజ్ఞాభావము జనించును. కావున మీరందఱును మీ మీ యిండ్లకుఁబొండు, అచ్చట నే కూర్చుండి నా ధ్యాన మనన, కీర్తనము లొనర్పుఁడు.''

సూతుఁడిట్లనెను:- ''మునులారా! భగవానుని యిట్టి కఠోర వచనములను విని గోపికలకు మహాదుఃఖము కలిగెను. వారు గడ గడ వణఁకిరి. వారి హృదయములు కొట్టుకొన నారంభించెను. వారరఁటి యాకువలె వణఁగ నారంభించిరి.''

ఇది విని శౌనకుఁడిట్లడిగెను:- ''సూతా! భగవానుఁ డా పరమ భావమయులగు గోపికలతో నిట్టి కఠోర వచనముల నేల పలికినాఁడు?''

సూతుఁడిట్లనెను:- "స్వామీ! ఈ మాటలు లోపలి నుండి పలికినవి కావు, ఇవి కపటముగఁ బైకి అనినవి. లోపల నాతనికిఁ బ్రేమ నిండియున్నది, పైకి కేవలము ప్రేమ పరీక్షార్థమై యీ పలుకులు పలికెను. వీరికి తనయెడల నెంత ప్రేమయున్నదో కనుఁగొనవలయునని యిట్లనెను."

శౌనకుఁడిట్లనెను:- "సూతా! గోపికలు తమ సర్వస్వమును శ్రీకృష్ణున కర్పించిరి. వారి ప్రేమను సర్వజ్ఞుఁడగు శ్రీకృష్ణుఁడేల శంకించినాఁడు? అనన్య ప్రేమిని శంకించుట పాపము కాదా? శ్రీకృష్ణున కన్నియును దెలియును గదా! వారినిఁ బరీక్షింపవలసిన నవసరమేమున్నది?"

సూతుఁడు నవ్వి యిట్లనెను:- "స్వామీ! దీనినిఁ బరీక్షయనరు. ఇది ప్రేమరీతి, నిన్నుఁ బ్రేమించినట్లం కెవరినిఁ బ్రేమింపనని ప్రేమియొక్క నోటిద్వారా వినవలయునని ప్రేమాస్పదుఁడు కోరుకొనుచుండును. దీనిని వినుటకై ఆతఁడు వివిధములగు శంకలను లేవఁదీసెను. వారి నోట నీమాట వినఁగానే వారి హృదయము ముప్పొంగును. దాని వలనఁ బ్రేమ అధికమగును. రెండువైపులను బెరుగును. ఈ వాక్యములు ప్రేమను బెంచునవి; కాని తగ్గించునవి కావు, ప్రేమ బీజములు హృదయమున నంకురించును. అశ్రుజలములను రాల్చుటచే నచ్చట అంకురములు ఉత్పన్నములగును,

పల్లవితము, పుష్పితములగును. ప్రేమరాజ్యము జ్ఞాతమైనది. మునులారా! ప్రేమికులు గాక దీని నెవరు తెలిసికొనఁగలరు. ఇవి రహస్య విషయములు.

శౌనకుఁడు నవ్వి యిట్లనెను:- "సూతా! ఇప్పుడు నీ యీ ప్రేమకు సంబంధించిన వంకర టింకర విషయముల అర్థము మాకేమి తెలియును. మేము ప్రేమ హీనులము."

సూతుఁడిట్లనెను:- "స్వామీ! మీరందఱెఱిఁగినదే, మీకు నిజమైన ప్రేమ తెలియును. విషయపంకమునఁ బడిన నీ సాంసారికులకు ప్రేమించుటేమి తెలియును? ప్రేమ విషయ విహీనమగు చిత్తమందే కలుగును."

శౌనకుఁ డిట్లనెను:- "సూతా! ఈ విషయములను వదలివేయుము. తర్వాత కథను జెప్పుము. పాపము గోపికల గతి యేమైనది, వారేమనిరి?"

సూతుఁ డిట్లనెను:- "మంచివిస్వామీ! వినుఁడు ఇప్పుడు నేను గోపికల స్థితినిఁగూర్చి చెప్పెదను."

---

# వ్రజాంగనల వివశత్వము

(౯౬౭)

శ్లో॥ మైవం విభోఽర్హతి భవాన్ గదితుం నృశంసమ్
సంత్యజ్య సర్వవిషయాంస్తవ పాదమూలమ్।
భక్తా భజస్వ దురవగ్రహ మాత్యజస్మాన్
దేవో యథాది పురుషో భజతే ముముక్షూన్॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౨౯ అ. ౩౧ శ్లో.

మ॥ అకటా నమ్మితి మేము క్రూరుఁడని ని
స్సర్వంబె మా యిండ్లలో
సకలవ్యాప్తులడించి నీపద సరో
జాతంబు లర్చింపఁ జో
క్కఁక యేతెంచితి మీకు ఁడాఘ్యుఁడవు మో
క్షాసక్తులంగాచు పో
లికఁ గావందగుఁ గానవే విడువ మే
లే కాంతలన్ భ్రాంతలన్ ॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

జీవితాంతమువఱకు ప్రేమను నిలుపుకొనుట అత్యంత కఠిన కార్యము. చిత్తము సదా ఒక్కరీతిగ నుండదు. దీని యందు నిరంతరము సాత్త్వికి రాజస తామస తరంగములు

లేచుచుండును. భార్యాభర్తలు జీవితాంతమువఱకు నిర్వ
హించుకొనుచుందురు. దీనిలో ధర్మభయము, పరలోక
భయముండును. కావునఁ గర్తవ్యపాలన దృష్టితో నిర్వా
హము జరుగుచుండును. ప్రపంచమున నేవస్తువును నొక్క
రీతిగ నుండదు. ప్రపంచమంతయును బరివర్తన శీలమైనది.
కొన్ని పెరుగుచుండును, కొన్ని తరుగుచుండును. కాని ప్రేమ
ప్రతి క్షణమును వర్ధమానమగుచుండును. దీనిలోఁ దగ్గుట
యనునది లేదు. తగ్గిపోవునది ప్రేమకాదు. అది మోహము.
విషయాకర్షణము, ప్రేమలోఁ బ్రతిక్షణమును బరీక్ష
యుండును. ఏలనఁగా నాగిన తర్వాత జలప్రవాహ
మత్యంత తీవ్రముగనుండును. ప్రేమయందు ప్రేమాస్పదుఁ
డొకఁడుండును. ప్రేమించు ప్రేమి యొకఁడుండును. ప్రేమా
స్పదుఁడు - తనకు శ్రేష్ఠుఁడు స్వతంత్రుఁడు, ఆతఁడేదైన
వాగవచ్చును. తనకు నోటికి వచ్చిన దనవచ్చును. ప్రేమి
దానిని గమనింపనే గమనింపఁడు. ఆతఁడిట్టి వాక్కుల నేల
పలికినాఁడని ఆతఁడెన్నడును మనస్సులో ననుకొనఁడు, ఆతఁ
డొక్కటే కోరుకొనును, తన ప్రియుఁడు తన యెడల నప్ర
సన్నుఁడు కారాదనుకొనును. ఒకవేళ నప్రసన్నుఁడైనను
నాతని వీడి యింకొకరినిఁ బ్రేమింపరాదనుకొనును. ఏదో
విధముగఁ గాళ్లమీఁదనో వ్రేళ్లమీఁదనో పడి ఆతనినే
బ్రతిమలాడుకొని ఆతనిఁ బ్రసన్ననిగా నొనర్చుకొనవలయును.

నూర్లకొలఁది శపథములొనర్చి ఆతని శంకలను నివారింప వలెను. ఆతనికి విశ్వాసము గలిగింపవలయును. మాకు నీవే గతి, మామతి నీయందే యున్నది. నీవుగాక మాకింకెవరును నాధారములేరు, కాలదన్నినను, కౌఁగిలించుకొని స్వీకరించి నను నీ చరణములు తప్ప జీవితములో నాకింకొకగతి లేదన వలెను. ఈ యనునయ వినయములచేఁ బ్రేమలో నత్యధిక మాధుర్యము కలుగును. హృదయమత్యధికముగ ద్రవించును. మనస్సంగీకరింపకుండిన నిరువైపుల నుండియును హృదయ ముప్పొంగును. అప్పుడే రాస జరుగును. లోకమునను నింతయే, ప్రేమ హద్దులు దాటినచో మానవుఁడు నాట్యము చేయఁ దొడఁగును. నాట్యమే వృత్తిగాఁ గలవారి విషయ మును, అభినయముచేతనే తన జీవితమును వెళ్లఁబుచ్చు కొనువారి సంగతి వేఱు. నేతితోడను, చక్కెరతోడను జేసిన లడ్డు సుందరముగ నున్నను, వంకరగనున్నను, సరిగా నున్నను, గుండ్రముగ నున్నను, పొడుగుగ నున్నను బొట్టిగ నున్నను నది స్వాదిష్టముగనే యుండును. ఇదే విధముగఁ బ్రేమ విషయములు కఠోరముగ నున్నను. సరసముగ నున్నను, సరిగానున్నను, వక్రముగనున్నను నెట్లైన నుండ నిందు ప్రేమను వృద్ధిచేయునవిగనే యుండును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! శ్యామసుందరుఁడు వచ్చిన గోపికలతోఁ బ్రథమమున నిట్టి ప్రేమహీనములును,

నీరసములును, గఠినరములునగు పలుకులు పలుకఁగా గోపికల ఉత్సాహమంతయును భంగమయ్యెను. వారి ముఖమండలములు మ్లానములయ్యెను. వారి ఆశాలతలు వాడిపోయెను? ప్రేమాలింగనముయొక్క ఆశ నిరాశగాఁ బరిణమించెను. వారగాధ దుస్తర చింతా సాగరమున నిమగ్నులైరి.''

మునులారా! ఆ సమయమున నా ప్రేమపిపాసినులగు నా యబలల స్థితి పరమదయనీయముగనుండెను. సహృదయులగు వారెవ్వరైన వారి స్థితినిఁ గాంచినచో వారి హృదయములు విదీర్ణములగును. వారు శోక కారణమున దీర్ఘముగను, ఉష్ణముగనుండు నిశ్వాసములను విడుచుచుండిరి. నాసిక నుండి వెలువడు ఉష్ణోచ్ఛ్వాసముల వలన వారి కోమల బింబాధరోష్ఠములు వాడి యెండ నారంభించెను. నీరు లేక వికచనీరజము వాడి క్రిందకు వంగునట్లు, నిరాశచే వారు ముఖములను గ్రిందకు వంచుకొని నేలవైపునకుఁ జూచుచుండిరి. నేలవైపున కేలఁజూచుచుండిరయ్యా?'' ఏలననఁగా బృథివియును స్త్రీయే, స్త్రీయొక్క వేదన స్త్రీకే తెలియును. పురుషుఁడు స్వార్థపరుఁడు, ఆతఁడు ప్రేమించినను స్వార్థముననే, పైఁగాఁ గోమలాంగులగు నబలలు సహింపఁ జాలనట్లుగఁ గఠిన వాక్యములను బలుకుచుండును. అయినను సహింపవలయును. సహింపకుండిన నెచ్చటికిఁ బోఁగలరు?

ఎచ్చటికి వెడలినను బురుషుల బాటిపడవలసిన దేకదా! అందఱు పురుషులు నొకటే రకము. కొందఱు చిన్న కొందఱు పెద్ద, అందఱ ప్రకృతియును గఠినమైనదే, గోపికలు పృథివితోఁ జెప్పుచుండిరి. దేవీ! ఈ నల్లనివాఁడు నీ కూఁతురగు సీతతోడను నిట్టి కఠినతను జూపినాఁడు. రాజపుత్రియు సుకుమారియైనను వన వనములీ నల్లని వానితోఁ దిరిగినది. రావణుఁడామెను దీసికొనిపోయెను. ఆతనిఁ జంపి యీమెను విడిపింపఁగా నామెకు ముఖము వికసించెను. "రాఘవా! నన్ను మీరెంత ప్రేమించితిరి!" అనెను. ఈ కీర్తి లోలుపులగు బుషులకుఁ బ్రేమించుట తెలియదు. వీరు వ్యాధులవలెఁ దీక్ష బాణములచే బాధను గలిగించెదరు. కన్నులెఱ్ఱఁజేసి నీలమణివలెనున్న ఆతఁడిట్లనెను:- "సీతా! నేను నిన్నుఁ బ్రేమ కారణమున విడిపింపలేదు. నా కీర్తిని స్థాపించుటకును, నా కలంకమును బోఁగొట్టుకొనుటకును నేను నిన్ను విడిపించితిని, నీవు తొమ్మిది మాసములు రావణునింట నుంటివి. ఇప్పుడు నీవు నాకు తగవు. ఇప్పుడు నీవిఁక నీయిష్టము వచ్చిన చోటునకుఁ బొమ్ము. నీ యిష్టమువచ్చిన వారినిఁ బతిగా గ్రహింపవచ్చును. భరతుని సంగమున నుండుము లేదా లక్ష్మణునిఁ బతిగా గ్రహింపుము. లేదా యీ వనరాజగు సుగ్రీవుని సంగమునకుఁ బొమ్ము లేదా విభీషణుని భజించుము." సీతా

దేవి యిది విని నిర్ఘాంతపడినది. ఆహా! ఈ పురుషజాతి యెంత కఠిన హృదయులుగ నుందురు. నేనెన్నడును, స్వప్నముననైనఁ బరపురుషునిఁ జింతింపలేదు. అట్టియెడ నీ నిండుసభలో నందఱముందఱ నన్ను దోషిగాఁ జేయుచున్నాఁడు, సరే, ఇఁక నీ శరీరమును ధరింపను.'' అని యాలోచించుకొని చితినిఁ జేర్పించుకొని దానిలోఁ బ్రవేశించెను. రాఘవుఁడామెను వలదనలేదు. చితిలోఁ గూర్చుండెను. సువర్ణమువలె శ్రేష్ఠమైనదై బయటకు వచ్చెను. అప్పుడు రాముఁడామెను స్వీకరించెను. ఆమె గర్భవతియైనపుడు, ఒకానొకఁడిట్లనెను:- ''రాముఁడు కాముకుఁడు, రావణు నింటనుండిన సీతను మఱలఁ దనయింట నుంచుకొనెను.'' దీనివలన మఱల నాతఁడు తన కీర్తికి సీతయే బాధకమని యనుకొనెను. అప్పుడామెను హింసక పశువు లుండు ఘోర వనమున దిగవిడిపించెను. రాణి యయ్యు గర్భవతిగానుండు స్థితిలో నామె అన్నము నడుగుకొనవలసి వచ్చినది. అయోధ్యకు వాల్మీకాశ్రమము దగ్గఱ కాదు. పండ్రెండు సంవత్సరముల వఱకాతఁడామె జాడను గనుఁగొనలేదు. మరల నామెను బిలిపించుకొనెను. ఇంతటి యవమానమును సహించి యేజీవియైన రాఁగలఁడా? బ్రదుకఁగలఁడా? కాని యీ స్త్రీ జాతి హృదయమందు బ్రహ్మ సమస్తమును సహించు సహనశీలతను బెట్టియున్నాఁడు.

వాల్మీకి యెన్నో శపథము గావించెను. ఋషులచే నొప్పించెను. రాముని గనరెను. ఆ సమయమున తలను వంచుకొని సాక్షాత్తుగ లజ్జాదేవివలె సీతాదేవి వచ్చెను. కఠోరుడగు రాముఁ డిన్నిదినములకు వచ్చినను రెండు ప్రేమ వాక్యముల నైనను బలుకలేదు. రాఁగానే పరీక్ష నిమ్మనెను.

ఇదివఱలో నామె అగ్నివడిలోఁ గూర్చుండి పరీక్ష నొసంగెను. ఇప్పుడిట్లనుకొనెను:- "ఈ యగ్నియును బురుషుఁడే ఈతనిద్వారా యీయఁబడిన పరీక్ష విఫలమైనది. ఈసారి స్త్రీ యుత్సంగమునఁ గూర్చుండి పరీక్ష నొసంగెదను. అందువలనఁ దలను వంచుకొని ఓ పృథివీదేవీ! నాకును ఒక వివరమునుచూపించుము. దానిలోఁ బ్రవేశించెదను. వెంటనే విలీనమయ్యెదను. అప్పుడుగాని రాముని మనస్సు కరుగఁ బోదు. కావున మాతా! ఇప్పుడు నాకు మార్గము నొసంగుము దానిలో నేను బ్రవేశించెదను." ఇట్లని ఆమె మాటి మాటికిని పృథివి వైపునకు చూచుచుండెను. కాని పృథివి బిలము నీయలేదు. ఆమె బ్రద్దలుకాలేదు. సువర్ణ సింహాసనమును దేలేదు.

పృథివి బ్రద్దలు కాకుండుటను గాంచి యామె తన కోమల చరణ నఖములతో దానినిఁ ద్రవ్వ నారంభించెను: బ్రద్దలుకమ్ము బ్రద్దలు కమ్మని కోరెనుగాని నఖములతో

నెంత పృథివి త్రవ్వఁబడును. ఆమె నిరాశనుజెంది యేడ్వ నారంభించెను. ఇంటినుండి మిక్కిలి ప్రేమతో బాగుగాఁ గాటుకను బెట్టుకొని బయలుదేరి వచ్చెను. కాటుకను తొందఱలోఁ బెట్టుకొనెను. అశ్రువులతోఁ బాటుగా నదియును గార నారంభించెను. ఆ కాటుక కంటినీరు ఉబ్బెత్తు బుగ్గల మీఁదుగా వక్షః స్థలమునఁబడెను. ఇంకను వక్షః స్థలమున నలఁదుకొనినఁ జందన మిశ్రిత కుంకుమలేప మింకను నాఱనే లేదు. నేత్రములనుండి జాఱిన నల్లనినీరు నచకుంకుమ మీఁదఁ బడఁగా నారంగుతోఁగలిసి అది హోళీవలె ఖేలన మొనర్ప సాగెను. వస్త్రములను నల్లగాఁ బచ్చగాఁ జేయుచుండెను. గోపికల స్థితియు నిట్లే యుండెను. గోపికల కీసంగతి తెలియనే తెలియదు. వారేమియును మాటలాడలేదు. కూర్చుండలేదు, మెదలక తలలను వంచుకొని నిలుచుండిరి.

వారిట్లనుకొనిరి:- "అయ్యో! ఎవని నిమిత్తమై మనము మన సమస్త సాంసారిక విషయములను వదలితిమో ఆతఁడు నేఁడింత నిష్ఠురుఁడై నాఁడు. స్త్రీజాతి జీవనము వివశతతో నిండియుండును. దానిలో నడుగడుగునకును వివశత్వము అనుభవమునకు వచ్చుచుండును. మానవుఁడు తాను బాలతోఁగడుగఁబడిన వాఁడనుకొనుచుండును. తాను రావణుని వ్యవహార మొనర్చుచున్నను, తన స్త్రీ సతీ, సీతలుగ నుండవలయునని ఆతఁడు కోరుకొనుచుండును,. పురుషుని

కొఱకు స్త్రీ యెంతటి త్యాగమొనర్చినప్పటికిని పురుషుఁడు నిష్ఠురుఁడుగనే యుండును. అయినను నీ ప్రేమబంధ మతి దృఢమైనది. స్త్రీ ప్రియతముని వదలి యింకెవరిని మనస్సున నైనను దలఁపదు. పురుషునియొక్క కఠోరత ఇంకను నాతని వైపున కాకర్షించుచుండును. ప్రియుఁడేమన్నను మన మేడ్చి ఆతని హృదయమును గోమలము కావింపవలయును. అనునయ వినయము లొనర్చి ఆతని యంతఃకరణమందు దయను ఉదయింపఁజేయవలయును.'' ఇట్లాలోచించుకొని వారు తమ మృదుహస్తములతో నేత్రములనుండి జాలువారు అశ్రువులను దుడిచికొని, గద్గద వాక్కులతోఁ బ్రణయ మిశ్రిత కోపస్వరమున నప్రియభాషణ మొనర్చు శ్యామసుంద రునితో నేదియో పలుక నారంభించెను. వారు లజ్జా, ప్రేమానురాగ, సంకోచ స్వరమున గద్గద వాక్కులతో నిట్లనిరి:- ''విభూ! ఇంకెవరైన ననిన ననుకొననిందు, కాని సర్వాంతర్యాములగు మీ రిట్టి కఠోర వాక్కులను బలుకరాదు.''

భగవానుఁ డిట్లనెను:- ''ఏమి? నేనిందు కఠోర వాక్కుల నేమి పలికితిని?''

గోపికలిట్లనిరి:- ''మే మితరులను బ్రేమించుచున్నా మని నీవు సందేహించుచున్నావు. మా లౌకిక పతులందును,

పుత్రులందును, బంధు బాంధవులందును జిత్తములు లగ్నము లైనవని నీవనుకొని యుండవచ్చును. మేము శపథమొనర్చి చెప్పుచున్నాము. మేమందఱమును మీ చరణారవిందము లందే అనురక్తినిఁ జెందియున్నాము. మా కింకొక గతిలేదు. మీ దర్శనమైనప్పటినుండి మా చిత్తములు నీయందే నిలిచి యున్నవి. మేము మాతను, మన, ధనములను సర్వస్వమును నీ చరణములందే సమర్పించితిమి. నీవు స్వచ్ఛందుఁడవు. బహు వల్లభుఁడవు. నిన్నుఁ బ్రేమించుట కింతటి ప్రపంచ మున్నది. నీ వెవరికో ఒక్కరి వాఁడవుకావు. మాకు నీ ఒక్కఁడవే మమ్ములను బరిత్యాగ మొనరింపకుఁడని మా మనవి. శరణాగత ప్రతిపాలన మొనర్చెదనని మీ ప్రతిజ్ఞ కలదు. ఆ ప్రతిజ్ఞను విడువకుఁడు" మే మన్నిటిని వదలి మీ చరణములనే ఆశ్రయించితిమి. అట్టియెడ నీవు మమ్ముల నందఱనేలఁ బరిత్యాగ మొనరించుచున్నారు. ఇట్టి కఠిన వాక్యములను బలుకనేల? ఏ ముముక్షువులు ముక్తికాంక్షచే ముక్తి దాతయగు నాదిపురుషుఁడునగు శ్రీమన్నారాయణుని శరణు వేఁడుచున్నారో వారి కోరికల నాతఁడు నెఱవేర్చును. వారికి ముక్తి నొసంగును. అదే విధముగఁ బ్రేమకొఱకై సమస్త సంబంధములను వీడి నీ చరణముల నాశ్రయించిన మాకేల ప్రేమ ప్రదానమును గావింపవు. మమ్ముఁ గఠిన వాక్యములను బలికి కాలఁదన్నుచున్నావేల? మమ్ము స్వీక

రింపరేల ? నీవు హృదయమునకేల హత్తుకొనవు ? ప్రేమా లింగన ప్రదాన మొనర్చి మా హృదయ సంతాపము నేలఁ బోఁగొట్టవు. మమ్ముల నిరాశులఁ జేయనేల ?''

సూతుఁ డిట్లనెను:- ''మునులారా! ఈ విధముగ మధుర శబ్దములతోఁ బ్రార్థించిన తరువాత నిప్పుడు గోపికలు భగవానుఁడు పలికిన వాక్యములను ఖండించిరి. ఆతని వాక్యములన్నిటికిని మధుర వాక్కులతో సమాధానము లీయ నారంభించిరి. తమ యనన్యతను స్థాపించుకొనిరి. భగవంతుని సర్వగతునిఁగను, సర్వసాక్షిగను, సర్వేశ్వరునిగను సిద్ధాంత మొనర్చిరి. ఆ ప్రసంగమును నేను ముందు చెప్పఁగలను. ఇది చాల గహనమైన గూఢ విషయము. కావున దీనిని మీరందఱును బాగుగా సమాహిత చిత్తులరై శ్రవణ మొనర్పవలయును.

---

# ప్రియత్వ మాత్మయందే కలదు.

(౯౬౮)

శ్లో॥ యత్పత్య పత్య సుహృదామను వృత్తిరంగ
స్త్రీణాం స్వధర్మ ఇతి ధర్మవిదా త్వయోక్తమ్।
అస్త్వేవమేత దుపదేశ పదే త్వయీశే
ప్రేష్ఠో భవాంస్తను భృతాం కిల బంధురాత్మా॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౨౯ అ. ౩౨ శ్లో.

మ॥ పతులన్ బిడ్డల బంధులన్ సతులకుం
బాటించు టే ధర్మ ప
ద్ధతి యానంటివి దేహధారిణులకున్
ధర్మజ్ఞ చింతింపుమా
పతి పుత్రాదిక నామమూర్తి వగుచున్
భాసిల్లు నీయందుఁ ద
త్పతి పుత్రాదిక వాంఛలన్ సలిపి సం
భావించు టన్యాయమే॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

ప్రియత్వ మాత్మ మీఁదనే యుండును. ఆత్మీయత లోనే ప్రీతి కలదు. ప్రీతికి కారణము సౌందర్యము, ధనము, విద్య, యశము కులీనతాది గుణములు కావు. ఎవఁడెంత సుందరముగనున్నను మన కాత్మీయత కలుగదు. మన కాతఁడు సర్వ సాధారణుఁడే. దీనికి విపరీతముగ నొకఁడు కురూపిగనుండును. ఆతని యందాత్మీయత కలుగును. ఆతఁడు ప్రియులలోఁ బ్రియుఁడు, ఇదేవిధముగ నెవఁడెంత ధనికుఁడైనను, యశస్వియైనను, కులీనుఁడైనను, వానియందు మమత్వమును, ఆత్మీయతయును లేనప్పుడు ఆతని ధన, యశ, విద్యా, కులీనతలవలన నేమి ప్రయోజనము ?

స్త్రీకి ప్రపంచమునఁ బతికంటెఁ బ్రియుఁడెవఁడు నుండఁడు. సత్స్త్రీకి సత్పతియెడల నెంత ప్రీతి యుండునో అంతటి ప్రీతి ప్రపంచమున నెవని యెడలను నుండదు. ఒక్కటి ఆలోచించుఁడు. స్త్రీలు పతులను శరీరముతోఁ బ్రేమించుచుండిరా ? శరీరము మీఁదనే ప్రీతియగుచో చచ్చిన తర్వాతను నదే శరీరము, అవియే కండ్లు, చెవులు, ముఖము, ముక్కు, చేతులు, కాళ్లు మొదలగు నితర అవయవము లవియేకదా ! కేవలము జీవాత్మ శరీరమును త్యజించుటచే నది ఘృణాస్పదమైనది. దానిని దీర్ఘకాలము ఇంటిలో నుంచుకొనుము, తగులఁబెట్టుదుము. దీనినిబట్టి

ప్రేమ శరీరమందు కాదు ఆత్మయందేనని తేలినది. చైతన్య మందేకలదు. శరీరమందంతటకును చైతన్యత ఒకే స్థానము నుండి వచ్చుచుండును. అట్టి కేంద్ర స్థానమునఁ బ్రేమ నిలిచినచో దాని నింకొక స్థానమున నిలుపవలసిన పనియే మున్నది? రాజుతో స్నేహము లభించిన రాజుయొక్క అనుయాయులు ప్రేమించితీరెదరు. ఎవరింట విపులముగఁ బాలు లేవో వారే మజ్జిగకొఱకు ఇంటింటఁ దిరుగవలయును. ఎవరింటఁబాలు పుష్కలముగ గలవో, వారు దానితోఁ బెరుగును, వెన్నను, మీఁగడను, నేతిని, కోవాను రసగుల్లాలను జేసికొనవచ్చును. అదేవిధముగ నీ సంసారమునందు సర్వాత్మ స్వరూపుఁడు ప్రభువు మీఁదఁ బ్రేమ జనింపనంతవఱకే తల్లి, తండ్రి, తోఁబుట్టువులు, పతి, పుత్ర, మిత్ర బంధు, బాంధవులందును, కుటుంబ, పరివారమునందును బ్రేమయుండును. ఆతని మీఁదఁ బ్రేమ కలిగెనా ఇవన్నియును వ్యర్థములగును. ఆతని మీఁదఁబ్రేమ కలిగినచో నాతని స్వామి యనుకొనుము, సఖుఁడనుకొనుము, పుత్రుఁడనుకొనుము, పతి యనుకొనుము, ఏసంబంధమునఁ బ్రేమించినను సుఖమే. ఆనందమే, నిరానందము లేశమైన నుండదు.

సూతుఁడిట్లనెను:- "మునులారా గోపికలు రాఁగానే శ్రీకృష్ణుఁడిన్ని ప్రశ్నల నడిగెను. వ్రజమునఁ గుశలమేనా?

మీరీ నిశీథి నిచ్చటికేల వచ్చితిరి? వ్రజమున కే ఆపత్తును సంభవింపలేదుకదా! మీరు శారదీయరాత్రి శోభను చూచుటకు రాలేదుకదా! నామీఁదఁ బ్రేమచే వచ్చినారా? లేక నామీఁదఁ బతిభావమునుంచి నాతోఁ గ్రీడించుటకు వచ్చితిరా?" ఈ విషయముల నన్నిటిని నాతఁడుచితముగనే పలికెను. కాని చివరకిట్లనెను:- "ఇవన్నియు యథార్థములే కాని ఇప్పుడు తిరిగిపొండు. మీరు నామీఁద జారభావము నుంచి వచ్చియుండినచో నిది కులస్త్రీలకు కలంకవిషయము."

వ్రజాంగన లీ ప్రశ్నలన్నిటికినిఁ బ్రత్యుత్తర మొకే మాటతో నిచ్చిరి. వారు సంక్షేపముగ నిట్లనిరి:- "మేమన్ని విషయములను వీడి నీ చరణ కమలములందే అనురక్తులమై యున్నాము. కావున నీవు మమ్ములను ద్యజింపవలదు."

భగవానుఁడిట్లనెను:- "మీరు నామీఁద నశ్వర బుద్ధినుంచుట ఉచితమే. కాని స్త్రీ ధర్మము పతినిఁ, బుత్రులను, బంధు బాంధవులను నిరంతరము సేవించుటే."

వ్రజాంగన లిట్లనిరి:- "అందఱకును బతి పుత్రాదులందును, బంధు బాంధవులందును నెట్టి ప్రీతియుండునో అట్టి ప్రీతి మాకు నీయందుండవలయును."

భగవానుఁ డిట్లనెను:- "ఉండుటలో దోషము లేదు: కాని సతీస్త్రీలకు ధర్మము పతిసేవయే పతినే పరమేశ్వరునిగ భావింపవలయును."

అంత నొక గోపిక యిట్లనెను:- "శ్యామసుందరా! మే మొక కథను వింటిమి. వినెదవా? మే మొక ప్రశ్న నడిగెదము, ప్రత్యుత్తర మొసంగెదవా?"

భగవానుఁ డిట్లనెను:- "సరే, చెప్పుఁడు. ప్రత్యుత్తర మీయఁదగిన దగుచోఁ బ్రత్యుత్తర మిచ్చెదను."

గోపిక యిట్లనెను:- "ఒక పతివ్రత స్త్రీ యుండెను, ఆమె భర్తను బ్రాణాధికముగఁ బ్రేమించెడిది, సదా పతి సేవయందే నిమగ్నయై యుండెడిది. దైవవశమున నొకసారి పతి అత్యంతావశ్యకమగు పనిమీఁద పరదేశమునకుఁ బోవలసివచ్చెను. పతివ్రత యిట్లనెను:- "ప్రాణనాథా! నేను మీరు లేక యెట్లు జీవించి యుండఁగలను. నా కేకైక వ్రతము మీకు సేవచేయుటయే, నా జీవితమున కవలంబన మును చూపింపుఁడు."

పతియును దన పత్నిని హృదయపూర్వకముగఁ బ్రేమించెడువాఁడు. ఆతఁడు తన ప్రతిమను మృత్తికతోఁ జేయించి యిట్లనెను:- "నీవు దీనిని నా రూపముగ భావించి

సేవింపవలయును. ఇంతలో నేను తిరిగి వచ్చెదను." అని చెప్పి ఆతఁడు వెడలిపోయెను.

యథార్థమున కామ్య మృత్తికామూర్తి పతికాకున్నను దానియందుఁ బతియాజ్ఞ చేఁ బతి భావనను గావించి ఆమె శ్రద్ధాభక్తులతోఁ బూజించుచుండెను. దాని ముందేడ్చును. దాని చరణామృతమును గొని పానమొనర్చును. దానికే నివేదించి ప్రసాదమును భుజించును."

ఒక దినమున నామె పతి ప్రతిమకుఁ బ్రేమతో బూజ నొనర్చుచుండెను. ఇంతలోనే ఆమె పతి తలుపును గొట్టి ఆమెను బ్రేమతోఁ బిలిచెను. ఇప్పుడామె ధర్మమేమో చెప్పుఁడు - ఆమె మృత్తికామూర్తి పూజనమున లగ్నమై యుండవలయునా? లేక పతి యాహ్వానమును విని - సమస్త మును వీడి ద్వారముకడకు పరుగిడవలయునా?"

భగవానుఁ డిట్లనెను:- "దీనిలో నడుగ వలసిన దేమున్నది? యథార్థమగు పతివచ్చి, ప్రేమపూర్వకముగఁ బిలుచుచున్నప్పుడు మృత్తికామూర్తి పూజనమేల?"

గోపిక యిట్లనెను:- "చూడుఁడు, ఇప్పుడు నీ నోటనే నీ వాక్యము ఖండితమైనది. పతినిఁ బరమేశ్వరునిఁగ భావించి ఆతని సేవను జేయుఁడని నీ వంటివి. దీనినిబట్టి పరమేశ్వరుఁ డొకొకఁడని నిర్ధారణమైనది. ఎముకలు మాంసములున్న

పతియందాతని భావించుచుంటిమి. మాకు యథార్థమగు పరమేశ్వరుఁడే లభించి, ఆతఁడే వేణువు నూది మమ్ములను హాటాత్తుగఁ దన సమీపమునకుఁ బిలువఁగా నింక మేము తిరిగి యెచ్చటికిఁ బోఁగలము ?''

భగవానుఁ డిట్లనెను:- ''మీ బంధువులు మీ కొఱకు చింతించు చుండెదరు కాఁబోలు.''

గోపిక లిట్లనిరి:- ''వారెందులకుఁ జింతించుచున్నారు. మేము వారిమీఁద మమకారమును బెట్టుకొనినాము కావు ననే, ఇప్పుడు మేము కోరుకొనునదేమనఁగా వారందఱి మీఁద మాకు గల మమకారమును నొక్కచోఁ గూర్చు కొని నీయందుంచవలయుననియే. ఏలననఁగాఁ బ్రాణి మాత్రునకుఁ బ్రియాతి ప్రియబంధువు నీవే, జీవమాత్రున కంతరాత్మవు నీవే. నీద్వారానే అందఱకును జీవనముకలదు. మేము సర్వాంతర్యామియును, జీవనాధారుని శరణు జొచ్చి నపుడు మే మింకెవరి కడకును బోనవసరములేదు. మూర్ఖుల మాటను మేము చెప్పుటలేదు. ఆ యజ్ఞాను లీ అస్థిమాంస ములతోఁ జేయఁబడినఁ బాంచభౌతిక శరీరమునే ఆత్మగా భావించెదరు. కాని శాస్త్రకుశలులగువారు ఆత్మ స్వరూ పుఁడవగు నీయందే ప్రేమనుంచెదరు. ప్రపంచమునందు బెట్టిన ప్రేమ అనిత్యమైనది. యూపమే కారణమగుచో

రూపము నశింపఁగనే ప్రేమయును నశింపఁగలదు. దేహామే కారణమగుచో నదియు నశించునదియే; కాని నీవవినాశుఁడవు. కావున నీవే నిత్యప్రియుఁడవు. నిన్నుఁ బ్రేమించుటలోనే సుఖమున్నది. నీమీఁదఁ బ్రేమ కలుగఁగానే పతి పుత్రాదులు మట్టిబొమ్మలుగ గోచరించెదరు. పుత్రునిఁ బ్రేమించిన దుఃఖమే దుఃఖము. పసివాఁడైనచో నిరంతర మాతని మల మూత్రములను గడుగుచుండవలెను. ఏ సత్సంగమునకైనఁ బోయినచోఁ బిల్లవాఁడేడ్చును, అఱచును అప్పుడు నీకథయును బోవును, ఇతర శ్రోతలకును గష్టము కలుగును. ఎనిమిది జాములును నాతని ముఖమును చూచుచుండవలసినదే. అస్వస్థుఁడైనచో రాత్రింబవళ్లు మేల్కొని ఆతని సేవచేయవలసియుండును. పెద్దవాఁడైనచో వానికి చదువు సంధ్యలను జెప్పింపవలయును. వానికి పెండ్లియై పెండ్లాము వచ్చినచో నిద్దరకును సేవను జేయవలయును. రాత్రింబవళ్లు వారి ముచ్చటలే, వారి సుఖదుఃఖములకు సుఖ దుఃఖులు కావలసియుండును. పిల్లవాఁడు చచ్చినచో నేడ్చి యేడ్చి గ్రుడ్డివాఁడు కావలసినదే. దీనిలో నేమి సుఖమున్నదో చెప్పుము. వ్యర్థమగు మోహా మమతయే. కావునఁ బరమేశ్వరా! నీవు మా యెడలఁ బ్రసన్నుఁడవు కావలయును. మా ఆశాలతపైఁ దుషారా ఘాతమును గావింపకుఁడు. మమ్ములను గాలఁదన్నకుఁడు. మమత్వమును

వహింపుఁడు. మీ దాసీలనుగాఁ జేసికొనుఁడు, మా హృదయమునకు హత్తుకొనుఁడు. మే మెన్నాళ్లనుండియో ఆశపెట్టుకొనియుంటిమి. ఎన్నాళ్లనుండియో రోజులు లెక్కించుకొనుచున్నాము. ఎన్నాళ్లనుండి యీరాత్రికొఱకు ప్రతీక్ష చేసికొనుచున్నాము! నీవు మమ్ము నట్టేట ముంచుచున్నావు. ఇది మంచిపనియేనా? మే మెన్నాళ్లనుండి ఆసుగొట్టమువలె నీయింటి చుట్టును దిరుగుచున్నాము. మీ యింటి సమీపమునకు రాఁగానే పోయి నీదర్శన మొనర్చి నీ ప్రేమవాక్కులను రెండు నీతో మాట్లాడవలయునని యుండును. తల్లిదండ్రులను, పరిజనమును మా చుట్టు నుండుటచే మా హృదయమందలి మాటలను జెప్పుకొనుట కవకాశము చిక్కుట లేదు. మా వేదనను వ్యక్తపఱచుకొంద మనుకొందుము. నేఁడుమా కేకాంతమున లభింపఁగానిట్టి నిష్ఠుర వాక్యములను బలుకఁజొచ్చితివి. ఇట్టి ధర్మోపదేశమును గావింపఁ పూనితివి. ఈ ధర్మోపదేశమును మీ తల్లియగు యశోదకుఁ జేయుము. కృష్ణా! ఒక్క విషయమును దెలిసికొనుము. మేము ధర్మగ్రంథములను దెచ్చి మేము నీకడ ధర్మశాస్త్రములను బఠింపరాలేదు. మేము నిన్నుఁ బ్రేష్ఠతమునిగను బ్రేమాస్పదునిఁగను భావించి ప్రేమను యాచింపవచ్చితిమి. మాకు ప్రేమ ప్రదానమును గావింపుము. మాకు వ్యాకులతను గావింపకుము.''

సూతుఁ డిట్లనెను:- "మునులారా! గోపికలనోట నిట్టి ప్రేమభరిత వాక్యములను విని శ్రీకృష్ణునకుఁ బ్రేమసాగరమున లెహ్హృదయమునఁ దరంగము లుబుక నారంభించెను. అయినను నాతఁడు ప్రేమను వృద్ధిఁబొందించుటకై యిట్లనెను:- "గోపికలారా! మీరు చెప్పునదంతయును సత్యమే. అయినను మీ రీ సమయమున నీఘోరవనమున నుండరాదు. మీరు తిరిగి మీ మీ గృహములకుఁ బొండు."

అంతఁ బ్రేమ కోపమున నుండిన గోపిక లెట్టిగ నశ్రుపూరితములైయుండిన నేత్రములతో శ్రీకృష్ణునిఁ గాంచుచు గద్గద వాక్యములతో నిట్లనిరి:- "నీవు మాటి మాటికినిఁ బొమ్మనుచున్నావు. ఎచ్చటికిఁ బోవుదుము? గమనక్రియ పాదములచే జరుగవలెను, ఇప్పుడు పాదములు మా స్వాధీనమున లేవు. అవి ఒక్క అడుగైనను ముందునకు సాగకున్నవి. ఇంటికిఁబోయి యింటిపనులు చేసికొనుఁడని నీవనుచున్నావు. పనులను జేతులతోఁ జేయవలయును. ఆ చేతులు మాకు వ్యర్థములైనవి. వానివలనఁ బని జరుగుటలేదు, దీనిలో మా యపరాధ మేమియును లేదు. అపరాధము నీదే. మేము సుఖముగ నింటిపనులలో మునిఁగియుంటిమి. ఇంటిలోని పనుల నన్నిటినిఁ జేసికొనుచుంటిమి. నీవు మధుర మురళిని వాయించుచు మా చిత్తములను హరించితివి. నీవైపున కాకర్షించి

తివి. ఇప్పుడు పో పొండనుచున్నావు. వెళ్లుట యెట్లు? మా పాదములంటుకొని పోయినవి. అవి నీవద్దనుండి ఒక్క అవ గింజంత దూరమైనను బోదలఁచుటలేదు. ఒకవేళ మమ్ము బలవంతముగ నీ సామర్థ్యముచేఁ బంపినచో మే మేమి చేయఁగలము: అబలలము, వివశులము వెడలిపోయెదము. మా నోటిలోని కొక గ్రాసమన్నమైనను, ఒక్కబిందువు జల మైనను బోదు. రాత్రింబవళ్లేడ్చుచుందుము. ఏడ్చుచునే మా కాలమును వెడలఁబుచ్చుకొందుము. మాకింటి పనులును జరుగవు. ఎవరికిని సేవా శుశ్రూష లొనర్పఁజాలము. ఏ నరకమునుండి మేము బయటపడి వచ్చితిమో మరల నా నరకమునకే మమ్ములను బంపఁదలఁచుచున్నారు.''

భగవానుఁ డిట్లనెను:- ''మీరందఱును నాదర్శనము కొఱకు వచ్చితిరి. నా దర్శనమై పోయినది. మాటలాడుట కూడ అయిపోయినది. ఇప్పుడింక వెళ్లుఁడు ఆలస్యమును చేయవలసిన పని లేదు.''

గోపిక లిట్లనిరి:- ''నేఁడు చిత్తము దర్శనముచేఁ దృప్తిచెందునది కాదు. మనోహర మురళీగానము మా హృదయములలోని కామరూపమగు నింధనమున నగ్ని రగుల్కొన్నది. దానివలన గొప్ప పొగ లేచెను. మేము దానివలన వ్యాకులరమై మురళీ ఉద్గమస్థానమును వెదకి

కొనుచు వచ్చితిమి. ఇచ్చటికి వచ్చి నీ మందహాస వదనార వింద దర్శనమను నూగుటచే మా కామానలమింకను బ్రజ్వ లితమైనది. ప్రబలమైనది. దాని నిప్పుడు శాంతిపఁజేయుట నీ చేతులలో నున్నది. నీ కోమల రసయుక్తమగు దొండ పండువంటి యధరమునుండి స్రవించు నమృతధారలచే మా కామాగ్నిని శాంత మొనర్పుము, కంపించుచుండిన మా కపో లములమీఁద వానిని స్థాపించి యీ తాప సంతాపమును శాంత మొనర్పుము, నీవు దయఁజూడకుండి, మమ్ముల నుపేక్షించినచో, నీ విరహానలముచే మా శరీరములు భస్మ మ్ములైపోవును. మేము నిన్నుఁ జింతించుచుఁ బరలోక ప్రయాణ మొనర్పఁగలము. దివ్యశరీరముచే నీపాద సన్ని ధికి జేరుకొందుము.''

సూతుఁ డిట్లనుచున్నాఁడు:- ''మునులారా! ఇట్లు పలుకుచు గోపికలు మూర్ఛితలైరి. కాని, కఠోరుఁడగు కృష్ణుఁడు కఱుగలేదు. ఆతఁడట్లే నిష్ఠురుఁడై యుండెను.''

---

# కామాభితప్తలగు వ్రజ వల్లభలు

(౯౬౯)

శ్లో॥ తన్నః ప్రసీద వృజినార్దన తేంఘ్రి మూలమ్
ప్రాప్తా విసృజ్య వసతీస్త్వ దుపాసనాశాః।
త్వత్సుందరస్మిత నిరీక్షణ తీవ్ర కామ
తప్తాత్మనాం పురుషం భూషణ దేహి దాస్యమ్॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౨౯ అ. ౩౮ శ్లో.

ఉ॥ అత్తల మామలున్ వగవ
నాఱడి కోడక నాథులన్ శుగా
యత్తులఁ జేసి యిల్వరుస
లాఱడి వోవఁగ నీదు నవ్వులన్
మెత్తని మాటలన్ మరుఁడు
మేకొని యేఁచిన వచ్చినారమే
పొత్తుల నొల్లమో పురుష
భూషణ దాస్యములిచ్చి కావవే॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

రోగములు రెండురకములుగ నుండును. ఒకటి శారీరకము, రెండవది మానసికము. శారీరక రోగము శారీరక రోగములు కఫవాత పిత్తములయొక్క విషమత వలనఁ గలుగును. శరీరమున నుండవలసిన దానికంటె కఫ మెక్కుడుగనుండి, వాతపిత్తములు తగ్గినఁ గఫ జరోగములు వచ్చును. అట్లే ఇతరములును ఈ మూఁడును శరీర మందం తటను వ్యాపించియుండును. కాని కఫమునకుఁ బ్రధాన స్థానము కంఠము. పిత్తస్థానము కంఠమునకుఁ గ్రిందనుండి నాభివఱకు. నాభికిఁ గ్రింద వాతస్థానము. కఫవాత పిత్తములు తగ్గినను హెచ్చినను దోషములనఁబడును. వాని వలన జ్వరము, అతిసారము, సంగ్రహణి, శోధము, శోషము ప్రమేహము, కుష్టము మొదలగు రోగములు కలుగును. వాత ప్రధానులకు వాతరోగము లధికంబుగ గలుగు చుండును. తీట, గజ్జి, దద్దురు, అపానవాయువు అధికముగ వెడలుట, శరీరమందు మాంద్యము, మలము కఠోరమగుట మొదలగునవియును, పిత్తము ప్రధానముగఁ గలవానికి పిత్త సంబంధములగు రోగము లధికముగఁ గలుగును. దాహ మగుట, ధాతు సంబంధరోగము లధికముగనుండును, కఫ ప్రధానులకుఁ గఫ సంబంధమైన రోగములు సంభవించును. కఫ గ్రంధి పడుటయును, కాక పెరుగుట, శ్లేష్మము కలుగుట, మొదలగునవి కలుగును. వీని శమనమును గూర్చి

శాస్త్రములో ననేకోపాయములు చెప్పఁబడినవి. శారీరక రోగములు కఫ. వాత పిత్తములచే నెట్లు సంభవించుచున్నవో సత్వ, రజస్తమములను గుణములచే మానసిక రోగము లుత్పన్నములగుచున్నవి. మనస్సు సత్వగుణ ప్రధాన మైనపుడు; సత్వగుణములచే శాంతికలుగును. చిత్తము శాంతమగును. సద సద్వివేకము కలుగును. చిత్తమున రజో గుణ తమోగుణములు వృద్ధిచెందినపుడు కామ, క్రోధ, లోభ, ఈర్ష్యా, మదాభిమాన శోక చిత్తోద్వేగాదులును. ఈర్ష్యాదులు నుత్పన్నము లగును. చిత్తమున జనించు రోగ ములన్నిటిలోఁ గామము ప్రబలమగు రోగము. కామము వలననే క్రోధ, లోభ, మోహాలు జనించును. కామరోగము స్త్రీ పురుషులిద్దర మనస్సులలోను నుత్పన్నమగును. కామో త్పత్తి బ్రహ్మవలన నైనది. పుట్టఁగానే ఆతఁడు బ్రహ్మ మీఁదనే ప్రయోగించెను. ఆ సమయమునఁ జిత్త పిల్లలకుఁ గామపీడ కలుగకుండుగాక యను నియమ మొనర్చెను. అందువలన నా రోగము బాలకులను వదలి అందఱను బీడించును. కామము ప్రబలమైనచో నది మానసిక రోగ ముగ నుండక శారీరక రోగము కూడ కాఁగలదు. స్త్రీలకుఁ గామ జ్వరము కలుగును. దానికి ఇష్టవస్తు ప్రాప్తియే ఔషధము. పురుషులకు వీర్యోన్మాద రోగము కలుగును. దానికిని ఇష్టవస్తు ప్రాప్తియే నౌషధము. ఒక సరము

నుండి రక్తమును దీసివేయుట చేతను నది శాంతించును. కామ వేగమతి ప్రబలమైనదిగ నుండును. ఇంతటి ప్రబలవేగ మే రోగమునకును నుండదు. స్త్రీలకు గురులందును, నేత్రములందును, ముఖమందును, వక్షః స్థలమందును. నాభియందును, గుహ్యామందును, జఘనములందును గాముఁడు విశేషముగ నివసించును. కావున శ్రేయస్కాముఁడగువాఁడీ స్థానములను గామ భావముతో నెన్నడును నవలోకన మొనర్పరాదు. పురుషుని హృదయమందు గామభావ ముత్పన్నమైనచో వాని చిత్తము చంచలమగును. నేత్రములందును రాగము కనఁబడును. శరీరమందు బులకలేర్పడును. ఇష్టవస్తువును నిరంతరము చింతించుచుండును. ఏ పనినిఁ జేయుటకును దోచదు. అతఁడు తన కర్తవ్యమును మఱచి పోవును. ఏ పనినిఁ జేయరాదో దానినిఁ జేయుట కుద్యుక్తుఁ డగును. ఇదేవిధముగ స్త్రీలయొక్క కామవేగము ప్రబల మగుచో వారత్యంత దీనముగఁ గనఁబడుదురు. ప్రత్యంగ మునుండియును ననురాగము పెల్లుబుకుచుండును. మాటి మాటికి రోమాంచమగుచుండును. ఇష్టవస్తు ప్రాప్తిచే నది శాంతించును. ఈ భావమే భగవానునియందు గలిగినచో దానినిఁ బ్రేమయందురు. సాధారణ స్త్రీ పురుషుల అంగ సంగేచ్ఛకుఁ గామమందురు. ఈ కామమే ప్రబలవేగముచేఁ బరమాత్మయందు లగ్నమై, పరమాత్మను దన ప్రాణపతిగ

భావించుచు నీ భావములన్నియు నాతని యందుండినచో నిది పరమపద ప్రాప్తికి ప్రధాన సాధనము కాఁగలదు. స్వాతి జలములు పేడ మీఁదఁబడినచోఁ దేళ్లగును. ముత్యపు చిప్పలోఁ బడినచో ముత్యములగును. అందువలననే గోపికల కామమును విశుద్ధప్రేమ యనిరి. కామ పీడితులగు గామినుల కెట్టి స్థితి కలుగునో అవన్నియును వారికిఁ గలిగినవి. కాని భగవానునిపైఁ గలుగుటచే నవి దూషణములు గాక భూషణములైనవి. కావున నిప్పుడు జరుగఁబోవు వర్ణనము గోపికల కామ సంతప్తావస్థకు సంబంధించినవి. కావునఁ బాఠకులు దానియందుఁ బ్రాకృత బుద్ధి యుంచక భగవద్భావనమునే చేయవలయును. ఇది ప్రభుని రాసవిలాసము. తన ప్రతిబింబములతోఁ గ్రీడ.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ప్రేమ ఏకాంతమునగు వ్యక్తమగను. ధ్యానమును, భజనమును, పూజనమును, ప్రేమయును నందఱముందు వృద్ధినిఁ బొందదు. అందువలన సాధకులు ప్రపంచ కోలాహలమును వదలి ఏకాంత వనమునకుఁ బోయి ధ్యానమొనరించుచుందురు. సమూహమున నుండుటచేఁ జిత్తవృత్తి చెదరిపోవును. లోకమునందును జూచుచున్నాము. పదిమంది స్త్రీపురుషులతో నెవరువచ్చినను బోయినను మనస్సునం దేప్రభావమును బడదు. శీలసంకోచముండును. గుహ్యాభావములను

వ్యక్తమొనర్చుకొనంజాలరు. మఱియుం జిత్తవృత్తియును బెదరిపోవును. విజనప్రదేశమున నేకాంతమున స్త్రీ పురుషుని, పురుషుండు స్త్రీనిం గాంచినచో వికారములు కలుగును. అందుకనియే శాస్త్రకారులు మాటిమాటికిని హెచ్చరికను జేయుచు వచ్చిరి, తన తల్లితోనైనను, సోదరితోనైనను, కూంతురుతోనైనను నేకాంతమున నుండరాదు. ఇంద్రియ గ్రామము బలవత్తరమైనవి. ఇవి విద్వాంసుల మనస్సులను గూడ లాగును. భార్యాభర్తలు తమ భావములను నేకాంతమున, పెద్దవారుగాని, వృద్ధులుగాని గురుజనులుగాని వినం గలరను ననుమానము లేనిచోటం బ్రకటమొనర్చుకొందురు. అందువలనదీని నేకాంత భావమనిరి. మనస్సులో శంక గల చోట నేకాంతిక సుఖమును, రసాస్వాదమును నుండదు. ప్రేమ క్రమముగ దర్శనముచేతను. స్పర్శనముచేతను అంగ సంగముచేతను నధికాధికముగ నుత్తరోత్తరముగం బెరుగును. లోకములోం బతియందు పత్నికుండు భావమే గోపికలకు శ్రీకృష్ణ భగవానుని యందు గలదు. ప్రేమయందెంతగా నాత్మీయతా భావములుండునో అంతగా నది పెరుగును. ప్రేమగా, స్వదుండు మాటిమాటికిని నీచరణములు తప్ప నాకింకేమియును గతిలేదు వాక్యమును వినినతోడనే ఆతని హృదయమున సమస్త విధములగుం బ్రేమ తరంగములును, పూర్ణిమయందు సముద్రమునం జంద్రునిగాంచినం బొంగినట్లు

పొంగును. ప్రేమాస్పదుని హృదయమందు ప్రేమాభివృద్ధి కలుగుటచేఁ ప్రేమికి ఉత్సాహమింకను వృద్ధిఁబొందును. అప్పుడాతఁడు తనప్రస్తావమును నిస్సంకోచముగ ననావృత భావముతో నుంచును. ఇరువైపులను ప్రేమసముద్రము తమ హద్దుల నుల్లంఘించి యుబుకునో ఉప్పొంగునో, అప్పుడే రాసవిలాసము కలుగును. దానికి పూర్వము కలుగునది క్షణికమగు నింద్రియ వికారమే. అది తుచ్ఛమైనది. అందులో సుఖము లేదు, శాంతి లేదు. హృదయ దౌర్బల్యము కలదు.

తామింతవఱకును శ్యామసుందరునితో ననునయ వినయము లొనర్చినది వ్యర్థము కాదనియు, శ్యామసుందరుని హృదయమందు అనురాగ తరంగము లుబుకుచున్నవనియు, పైకి యాతఁడు కాదు కాదనుచున్నను మనస్సీతని ననురాగముతో నిండియున్నదనియుఁ నాతఁడెంతో తన్మయుఁడై తాము పలికిన పలుకులను వినుచున్నాఁడనియు గోపికలు తెలిసికొనిరి. అందువలన వారి సాహసము పెరుగఁగా నిట్లనిరి :- "శ్యామసుందరా! అబలలనుగు మాయెడల నన్యాయమొనర్పకుము. ఆలోచించుకొనుము. ఈ నిబిడారణ్యమున మాకేమున్నది. మేము ఇల్లు వాఁకిండ్లను గుటుంబ పరివారమును వదలి యేలవచ్చితి మనుకొన్నావు. నీకొఱకు కాదా? కమలనయనా! నీవు వనవాసులగు మునులకుఁ ప్రియుఁడవు.

వనములోనుండి భజన మొనర్చువారి నెడలఁ బ్రసన్నుఁడ వయ్యెదవని మేము వినియున్నాము. అందువలన మేమిండ్లు వాకిండ్లను వదలి వనమునకు వచ్చితిమి. నీవు గుమ్మలను బ్రేమింపవా? నీవు శేషశయ్యపై శయనించి యుండఁగాఁ జంచలయగు లక్ష్మి నీ చరణములను నిరంతరము సేవించు చుండును. అట్టి చరణసేవను జేయు నవకాశమును మా కీయరాదా? మేము నిన్ను నేఁడు క్రొత్తగాఁ బ్రేమించు చున్నామని నీవనుకొనుచుండ వచ్చును. అట్లు కాదు, మేము నీపాదముల సాక్షిగ శపథ మొనర్చి చెప్పుచున్నాము. ఏదిన మున మేము కమల సదృశముగఁ గోమలములును, నవనీత మున కంటె నధిక స్నిగ్ధముగ నుండు నీ చరణములను స్పృశించితిమో, ఆ దినమునుండి మేము నీకు మూల్యము లేకయే అమ్ముడు వోయితిమి. నీకు క్రీత దాసీలమైతిమి. మమ్ములను యమునలో నిలుచుండఁబెట్టి సర్వాంతర్యామి యగు బరమాత్మయందు మాకు బతి భావము కలదని మాచేఁ బ్రమాణమును జేయించుకొనుము. ఈ భావమును మేము పాపముగ భావించుట లేదు. ఏలననఁగా నెవరు నిన్నుఁ బుత్రునిఁగా నొనర్చుకొనిరో వారు పిల్లలకు వలె నీనోటికి స్తన్యము నొసంగిరా లేదా? నీవును వారి భావానాను సారముగ బిడ్డవై వారి స్తనములను జీకుచుండువా లేదా? మేము నిన్నుఁ బతిరూపముగ గ్రహించితిమి. నీవు మావశుఁ

స్థలముల మీఁద నీ పాదముల నుంచుము. నీవు ఒక్కసారి అనుము, లక్షసార్లనుము, నీ కడఁ దప్ప మే మింకొక లౌకిక పతి పుత్రాదుల సమ్ముఖమున నిలువఁజాలము.''

భగవానుఁ డత్యంత అమాయకుని వలె నిట్లనెను :- ''మీ రేమి కోరుచున్నారు. నా వక్షఃస్థలమును నేను లక్ష్మీ దేవి కిచ్చివైచితిని. దాని మీఁద నామె కధికారము కలదు.''

గోపికలు దృఢస్వరమున నిట్లనిరి :- ''ఉండ నిండామె కధికారమును, ఆమె యెడల మాకు మాత్సర్యము లేదు. ఆమెను నీ హృదయమున విహరింపనిమ్ము. మే మామె అధి కారమును లాగుకొనఁ దలఁచుట లేదు. కాని నీవు నాథా! బహువల్లభుఁడవు కదా! తులసీదేవి నీచరణ సేవ యొనర్చు చుండును. భక్తులు వచ్చి నీ చరణముల మీఁదఁ బడుచుం దురు. ఎవరు వచ్చినను వారికి నీ చరణాశ్రయము నిచ్చు చుందువు. హృదయమున లక్ష్మి నివసింపవచ్చును. కాని యీచరణము లందఱవి. ఎవరు వచ్చిన వారు చరణముల మీఁదఁ బడుచుందురు. దీని వలనఁ జపలా చంచల యగు లక్ష్మీదేవి యొక్క చిత్తమును జంచల మగుచున్నది. ఆమె యును జరణసేవ నొనర్ప నువ్విళ్లూరుచుండును. ఆమెను నీవు కాదనుట లేదు. ఆమె చేతను నీవు చరణసేవను జేయించు కొనుచున్నావు. అట్టి యెడ మమ్ముల నేలఁ గాలఁ

దన్నుచున్నావు? మా యెడల నిట్లు కఠోరత వహింపనేల? మేము లక్ష్మివలె ననధికార కార్యము లొనర్చుట లేదే! ఏ చరణములను భక్తులందఱును సేవించుచున్నారో, వేని మీఁద సర్వసాధారణులకును నధికారము కలదో, మేమట్టి చరణ రజమును గోరుచున్నాము. మేమిచ్చటికి వనమును జూచుటకును, ధ్యానమొనర్చుటకును, శారదీయసుషమ నవలోకించుటకును నిల్లు వాఁకిండ్లను వీడి రాలేదు. మేము వచ్చుటకు కారణము నీసేవ యొనర్చుటకు మాత్రమే. మాకు సేవచేయుట కనుజ్ఞ నొసంగవలెను. సేవికలని స్వీకరింపుము. శిష్టాచార విషయములను బలిమి కుశల ప్రశ్నలను, క్షమా యాచనలను, బైపై మాటలను బలికి మమ్ములను గాలఁదన్న వలదు. నీచరణ సన్నిధిని నుండనిమ్ము.”

ఇందులో మా యపరాధ మేమున్నది? మేము గృహకార్యములలోఁబడిన వారము. నీవు మాకుదర్శన మేల ఇచ్చితివి? “మీ రింపఁబను దర్శించుచున్నారు వారి నంద అను ప్రేమింపరేమి? అని నీవడుగ వచ్చును. అందఱును సజ్జనులుగనే యుందురు. నీవు చోరశిఖామణివి. నీవు నీ మందహాసము చేతను, చారు సౌందర్యము చేతను మా చిత్తములను హరించితివి. నీవు నీ యనురాగ భరితమైన అవలోకనములచేఁ గామబాణముల వేధించి మా హృదయమున

దాహము నుత్పన్నము గావించితివి. మా హృదయములు కామ సంతప్తము లైనవి. నీవు దయఁ జూపి మమ్ములను నీకు దాసీలనుగాస్వీకరించి, సేవికలుగ భావించి మమకారము వహించినచో నీదాహము శాంతించును. లేదన నిర్మూలన మగును. నీవు మమ్ములను జావనిచ్చుటలేదు బ్రదుక నిచ్చుటలేదు.''

శ్రీకృష్ణుఁడిది విని నవ్వి యిట్లనెను :- ''గోపికలారా! మీరింత వెఱ్ఱిగా నుండుటకు నావద్ద నట్టి వస్తు వేమియున్నది. నేను నిర్ధనుఁడ నగు నొక సామాన్యపు గోపకుమారుఁడను.''

గోపికలిట్లనిరి :- ''నిన్ను సాధారణుఁడవని యెవ రందురు ? నీవు మూఁడు చోట్ల వంకర వాఁడవు. నీకు ధనము లేకున్న నేమి ? కానీ నీవద్ద నాఱు వస్తువు లున్నవి. వానిని గాంచినఁ ద్రిలోకములలో నే స్త్రీయును నిన్ను మోహింపకుండఁ జాలదు.''

భగవానుఁడు సంభ్రమముతోఁ దెలియని వానివలె నిట్లడిగెను :- ఆ యాఱు వస్తువు లేవి ?''

గోపికలిట్లనిరి :- ''ఒకటి యీ నల్ల నల్లని కుటిల అలకావళిచే నావృతమగు ముఖము, దాని కుపమానముగఁ జంద్రునిఁ గమలమును జెప్పుట వ్యర్థము. దీనినిఁ గాంచి యే స్త్రీ ధైర్యమును వహింపఁగలదు ? రెండవది-కర్ణముల

వ్రేలాడు చుండిన కమనీయ కనకకుండల కమనీయ కాంతిచే సుశోభితమగు నీ గుండ్రని కపోలము. ఈ కపోలముల మీఁద నెవరు తమ సర్వస్వమును సమర్పింపరు?

మూఁడవది: బింబాఫల సదృశములగు నీ మృదులాధరముల నుండి జాలువారు అధరామృతము. ఒక్కసారి యైనను దాని నోష్ఠములతో స్పర్శించినచో నింక నిల్లు, వాఁకిలి కుటుంబము, పరివారములందు నాసక్తినిఁ జెంది యుండునా? ఇంక నింట నిలిచి యుండునా?

నాల్గవది:- విషాక్తబాణముల వలె మనోహరము గను, మందహాసముతోఁడ నుండు నీ చంచల దృగంచలములు సహజ స్వభావముతో నీ వెవరివైపు చూచిన వారింటిలోను నుండరు, బయటను నుండరు. ఇండ్లు వాఁకిండ్లను వదలి దారమును గట్టిన బావురమువలె నీ వెంటఁబడి తిరుగ వలసినదే.

అయిదవది:- గుండ్రముగ నుండి అభయదాయకములగు నీ విశాల బాహుయుగళము. ఎవరి భుజముమీఁద నివి పడినవో, ఈ నీ బాహుయుగళ మెవరి కంఠమున హారముగఁ బడినవో వారికీ మణిమాణిక్య, మౌక్తిక, సువర్ణాది హారములు నచ్చునా? నీ కరకమలములతో నీవొక్కసారి తాఁకితివా వారింక దేనినిఁ దాఁకినను నంతటి సుఖమును జెందరు.

ఆఱవది :- లక్ష్మీదేవి కాటపట్టైన నీవిశాల వక్షః స్థలము. దాని మీఁద శ్రీవత్సలాంఛనమున్నది. కౌస్తుభమణి శోభించుచుండును. ఆ వక్షఃస్థలమున కే భాగ్యవతి యొక్క వక్షఃస్థలము తాఁకినదో ఆ సౌభాగ్యవతినిఁ బొగడ నెవరికిఁ దరమగును. ఇంక నామెకీ ప్రపంచమున నేమి కర్తవ్య ముండఁగలదు ? వ్రజ వల్లభా ! నీ యీ యాఱు వస్తువులను గాంచి మేము నీకు హృదయ దాసీల మైతిమి. మేము మా సర్వస్వమును శ్రీచరణములమీఁద శాశ్వతముగ సమర్పించి తిమి. ఇప్పుడు స్వీకరించుట నీవంతు.

నీవు మాటి మాటికిని నిది ఉచితము కాదనియు, ననుచిత కార్యమొనర్చితిమనియు ననుచున్నావు. మే మేమి అనుచితకార్యము నొనర్చితిమి ? కృష్ణా ! నీవు స్త్రీవై యుండిన మే ముచితమునే కావించితిమో అనుచితమునే కావించితిమో తెలియఁగలదు. మధుర పదావళీ యుక్తమై కలకంఠ విస్తృతమై, అనుపమానమున నీ నూదిన వచ్చు నుచ్ఛస్వరయుక్తమగు గానము నీ వాహ్వానము కొఱకు పాడితివి. మధుర స్వరాలాపముచే యుక్తమగు నీ మురళీ ధ్వనిని వినియు, త్రైలోక్య సుందరమగు నీ సుకుమార స్వరూపమును గాంచియుఁ బ్రపంచమున నే స్త్రీ గృహకార్య ములందు లగ్నమైయుండును. ఉన్మత్తమై నీ చరణముల

కడకు రాకుండునా? స్త్రీల విషయమును వదలివేయుము. గోవులును నీ వెంటఁ బెంపుడు జింకలవలెఁ దిరుగుచుండును. అవియును నీ సంకేతమున నాడును. పాదపముల మీఁద నుండు పక్షులును నీ మనోహర మధుర ముగ్ధరూపముచే ముగ్ధలై మునులవలె సమాధి మగ్నములగును. ఈ యన్నిటి విషయములను వదలుఁడు. వృక్షములును రోమాంచమును జెందును. పశు, పక్షి, వృక్షముల స్థితియే యిట్లుండిన స్త్రీలు తమ ఆర్య మర్యాదను వీడుటలో నాశ్చర్య మేమున్నది?

మే మధికముగఁ జెప్పము. మాటలాడుటకు మాకు శక్తియును లేదు. యోగ్యతయును లేదు. ప్రపంచమున నిర్బలులను సబలులు రక్షించుచుందురు. దేవతలకు దుఃఖము కలిగినప్పుడు విష్ణువు తన చక్రసుదర్శనముచే వారిని రక్షించు చుండును. ప్రజల కేదైన నాపత్తు సంభవించినచోఁ దన అస్త్ర శస్త్రములచే రాజు వారిని రక్షించుచుండును. వ్రజ మండలమునకు విపత్తులు వచ్చినప్పుడెల్ల నీవు వారిని రక్షించి తివి. గోప గోపికల దుఃఖములను నివారించితివి. ఇప్పుడు మాయెడల నిట్లు నిష్ఠురుఁడవై యుండనేల? కామపీడితలమైన నీదాసీలను గూడ నీవు రక్షింపుము. మా వక్షః స్థలము లందొక విధమగు దాహము కలుగుచున్నది - గంధమును దీసి పూసికొంటిమి. అది వెంటనే యెండిపోయినది. అగరు,

కర్పూరములను రాచుకొంటిమి. దాహమింకను నెక్కువైనది. నూటి రాచితిమి తామరగడ్డను నూటిరాచితిమి. కాని దాహ మణఁగ లేదు. నీవు నీ సుఖద శీతర కోమల కర కమలమును గొంచెముసేపు మా మా వక్షః స్థలములపైఁ బెట్టుము. ఈ కరకమల శీతలముచే నది అవశ్యము శీతలమగును. ప్రపంచమున కభయ ప్రదానమొసంగు మీ వరద హస్తమును మా శిరస్సులపై నుంచుము. దీనివలన మా శిరోవేదనయు శాంతించును. శ్యామసుందరా! ఇంతటి నిష్ఠురుఁడవైతివేల? శరణమునకు వచ్చిన నబలలమగు మాతో నేకాంతమున నిట్టి అనాచారమును అత్యాచారమును జేసెదవేల? అచ్యుతా! మమ్ములనేల స్వీకరింపవు? మేము విశుద్ధలము కాకున్న నీవు విశుద్ధుఁడవా? భృంగము కీటకమును దనవలె జేయునందురు. నీవును భృంగమువలె నల్లని వాఁడవే నీశక్తిచే మమ్ములనుగూడ నీవలెఁ జేయుము. మే మన్యులమని నీ వనవచ్చును. అన్యుఁడు నీవు గాక యింకెవరున్నారు! నీవు నీవే మమ్ముల నన్యులనుగా భావింపక పాషాణ ప్రతిమవలెఁ గూర్చుండుదును; కాని యేకాంతమునఁ దన సహచరులతో నుండినచో నవ్వుచుఁ బ్రేలుచునుండును, వినోదము లొనర్చు చుండును. అప్పుడెవరైన నంతరంగ భక్తుఁడు "ఇదేమి స్వామీ?" అనినచో నప్పుడిట్లనును:- "వీరు నా బాలసఖులు, ఆడుకొనుచున్నాము." ఇంత వఱ

పను సింహాసనము మీఁద గూర్చుండుటయును ఖేలనమను నది వారికి తెలియదు. అదియును ఖేలనమే. ఇదంతయును నాటకమే. జీవుఁడు క్రీడాప్రియుఁడు. ఆట అందఱితో జరుగదు. ఎవరితో నాత్మీయత యుండునో వారితో విచ్చల విడిగా నాడుకొందురు. ఇతరులతో శిష్టాచారము లొనర్చు టయును నాటకమే. నాటకమే. దీనిలోను జీవున కానందము లభించును. నాటకాభినయ మందందఱకు రుచి కలుగును. దానిలోఁ బ్రత్యక్ష ఖేలనము కలదు. మనము సాధువులను నిత్యము జూచుచుందుము. వారినిఁ గాంచినఁ గుతూహల ముండదు. నాటకములో సాధువులను గాంచినచోఁ గుతూ హలముండును. ఏలననఁగా నది నాటకముయొక్క సాధు త్వము. ఖేలనము రెండు విధములుగ నుండును. ఒకటి సుఖాంతము, ఒకటి దుఃఖాంతము, కరుణాపూర్ణ ఖేలనము దుఃఖాంతము, సంయోగము, హాస్యము, శృంగారాదుల ఖేలనము సుఖాంతము, కాని సుఖాంత దుఃఖాంతములు రెండును సుఖము నొసంగును. సుఖము కలుగక పోయినచో శ్రీరామ చంద్రుని యొక్కయుఁ బాండవుల యొక్కయు ద్రౌపది మొదలగువారి దుఃఖకథలను మాటిమాటికేల వినెదము. ఆ రోదనమందును సుఖము కలదు. సారాంశ మేమనఁగా జీవుఁడు క్రీడాప్రియుఁడు. అతఁడు నిత్యనూతన క్రీడను గాంక్షించును. భగవానుఁడును క్రీడా ప్రియుఁడే,

ఆతఁడొంటరివాఁడు, ఒంటరిగా కేలనము జరుగదు. కావున నాతఁడు తన యాత్మయందే నశించును. తాను దన మోహినీ మాయతోడనే క్రీడించును. అందువలన వేదోపనిషత్తులందు వాని నాత్మక్రీడ ఆత్మరతియను పేరఁ జెప్పఁబడినవి. ఆటయనుము, క్రీడయనుము, రతియనుము అన్నియు నొక్కటే. ఆటలలో నుచితానుచితముల సమావేశముండును. ఒకానొక ప్రతిష్ఠగల సాధువు ఏదైన లోక విరుద్ధమగు వ్యవహారమొనర్చినచో దానిని భక్తులు సరిగా గమనింపక స్వామి నాటకమాడినాఁడందురు. అనఁగా కేలనము నందన్నియు నుండును. ఎచ్చట చిన్న, పెద్ద. ఉచితానుచిత విచారముండునో అచ్చట ప్రేమకేలనము గాక శిష్టాచార కేలనమగును.

కేలనము, క్రీడ, రతి వీనిలో ముందుగా నిచ్ఛ యుండును. దానినిఁ బూర్వానురాగమందురు. పూర్వానురాగమందెవరితోఁ గ్రీడింప వలసియుండునో వారినిఁ గలిసికొనుటకుఁ బ్రబలమగు కోరిక యుండును. పూర్వానురాగానంతరమునఁ గలియక సంభవించును. కలియకయందు బూర్వానురాగముకంటె నధికానందము కలుగును. అంత విరహము కలుగును. విరహమున సంతాపము కలుగును. ఆ సంతాపమే సర్వశ్రేష్ఠమగు సుఖము, కృత, త్రేతా,

ద్వాపర, కలియుగములలో నొకటి పోఁగానే వెంటనే రెండవ యుగమురాదు. అనఁగాఁ గృతయుగము పోఁగానే త్రేతాయుగము రాదు. మధ్యలోఁ గొంత సంధియుండును. అది కృతయుగమునుగాదు. త్రేతాయుగమును గాదు. దానిని సంధియనియు, సంధ్యాంశకాలమనియు నందురు. ఇదే విధముగఁ పూర్వానురాగము, మిలనమునకు మధ్య నొక సమయముండును. దానిని రత్యోద్బోధక' మందురు. దానిలోఁ బ్రేమ నభివృద్ధి కావించుకొన వలయును. మనము పిల్లవానితో నాడుచున్నామనుకొనుఁడు ఆడఁగోరుట పూర్వాను రాగము, పిల్లవాఁడెదుటకు వచ్చుట మిలనముకాని వాస్త వికమిలన మిప్పుడెక్కడ? మనము వడిలోనికిఁ దీసికొను టకు మన చేతుల నెత్తెదము, పిల్లవాఁడు కొంచెము సేపట్లే చూచుచుండెను. అంత వెంటనే పారిపోయెను. పారిపోయి దూరముగనుండి తల నూపుచుండెను. నవ్వుచుండెను. సైగలు చేయుచుండెను. మన మాతనితో 'రమ్ము, రమ్ము' అనుచుందుము. అతఁడు రాఁడు శిరస్సు నూపుచుండును. వడిలోనికి వచ్చుట కాతని కిష్టములేదా యనిన నదియును గాదు. ఆతఁడును వడిలోనికి రాఁదలఁచును. కాని ఆతఁడు ప్రేమను బెంచుచుండెను. మారాముచేసి రతి నుద్బోధించు చుండెను. మన మాతనికి వివిధములగు నాశలను జూపు చుందుము. చివరకాతఁడు చేతులను జాచియో, ఇంకే విధ

ముగనో స్వీకృతి నొసంగును. అప్పుడు మనము వానిని గట్టిగాఁ గాఁగిలించుకొందుము. వాని ముఖములో మన ముఖమును బెట్టెదము. దీనినే మిలనమందుము. ద్వైత మున్నంతవఱకు మిలనములేదు. వ్యభిచారమే, ఏకత్వము కలుగుటే మిలనము. మిలనములో స్వీకృతి ఆవశ్యకమగును. సమాగము తర్వాత జరుగునది క్రీడ, పిల్లవానిని హృదయ ముతోఁ గాఁగిలించుకొని క్రీడించెదము. వాని చంకలో చక్కలిగింతలు పెట్టి వానిని నవ్వించెదము. పెరుగని,పాలని, పూలని, పండ్లని మొదలగు వ్యర్థవిషయముల నేవియో చెప్పి వాని కుతూహలము నినుమడించెదము. మాటి మాటికి ఆతని నాలింగన మొనర్చుకొందుము, మిటాయియో యింకేదైనఁ దినుబండారమునో ఆతని నోటఁబెట్టుదుము. అతఁడును దన చిన్న చిన్న చేతులతో మన నోటఁబెట్టును. అట్లు నోటఁ బెట్టునపుడు మనము పెదవులతోడను బండ్లతోడను వాని చేతులను బిగించెదము. వాని చెవులలో 'కుర్రూ' అని అఱచి నవ్వించెదము. వాని వెంద్రుకలలో వ్రేళ్లను బెట్టి వానినిఁ జిక్కుతీసెదము. చేతులలోనికిఁ దీసికొని పైకి నెగుర వేయుదుము, బంతినివలె వానిని మరలఁ బట్టుకొందుము. వానినిఁ బట్టుకొని త్రిప్పెదము. ఈ విధముగ ననేక విధము లగుఁ గ్రీడల నొనర్చెదము. దీనిలో బాలకునకును నత్యధిక మగు సుఖము కలుగును. ఆడువాఁడును నాత్మ విస్మృతినిఁ

జెందును. ఆ సమయమున నాతని శోక సంతాపములన్ని యును శాంతించును. కేలసమున నాతఁడాత్మ విస్మృతినిఁ జెందును.

సూతుఁ డిట్లనెను:- "మునులారా! నేను గోపికల పూర్వానురాగదశను, వేణుగీతాది ప్రసంగమందు వర్ణించి యుంటిని. ఇప్పుడు నేను సమాగమ ప్రసంగమును విని వ్రజాంగనలు తమ గృహకార్యమును బరిత్యజించి శ్యామ సుందరుని సమీపమునకు వచ్చిరి. వా రాతని యంకమునఁ గూర్చుండి క్రీడించుటకు సముత్సుకులై యుండిరి. శ్రీకృష్ణుని సమీపమునకు వచ్చిరి. చూపులలోఁ జూపులు కలిసెను. కాని చూపులును జూపులతోఁగలియుట యథార్థమగు కలి యక కాదు, హృదయముతో హృదయము కలియుటయే యథార్థమగు సమాగమము. కొందఱు చూపులు కలియు టయే నిజమగు సమాగమ మని చెప్పినను నది ఉపాలంభము మాత్రమే. వ్యంగ్యము నేత్ర సమాగమము పూర్వాను రాగము నభివృద్ధి కావించును. అది సమాగమము కాదు. శ్రీకృష్ణుఁడు కలియుట లేదనునది లేదు. ఒక చేతితో నెన్నటికినిఁ దాళము పడదు. గోపికలకు కలియవలయునను నుత్కంఠచ్ఛ కలదు, కాని కృష్ణుఁ డంగీకారమును సూచింప లేదు. "తనయందనురక్తి కలిగిన భక్తులగు గోపికలకు

శ్యామసుందరుఁడేల కలియక నంగీకరింప లేదు?'' ఇప్పుడు మీకు మాటిమాటికిని జెప్పుచునే యుంటిని. వెంటనే యేదైన వస్తువు ప్రాప్తించినచో దానిలో నంతసుఖముండదు. అత్యంతోత్కంఠతతోఁ జిరకాల ప్రతీక్షచేఁ బ్రాప్తించిన వస్తువునందు సుఖమెక్కువగ నుండును. ఆఁకలి లేక కేవలము కూరలు పచ్చళ్ల సహాయమున నింత పొట్టకుఁ గ్రుక్కినచో దానిలో రసముండదు. రుచిలేదు. తుష్టియును బుష్టియును నుండదు. ఆఁకలి యెంతగా నుండిన భోజనమందంత అధికముగు రుచి కలుగును. గోపికలకు సమాగమేచ్ఛ ఉత్కటముగనే యున్నది. దాని నత్యుత్కట మొనరించుటకై భగవానుఁడు పైకి దలనూపుచున్నాఁడు. నిస్పృహస్వామివలె నైనాఁడు. వారి యభిలాష అత్యుత్కటమని తెలిసికొనఁగానే కఠోరుఁడగు నా కృష్ణుని హృదయమందును దయా సంచారము కానారంభించెను. ఆ వ్రజాంగనల దీనత్వ వినయ, వివశత్వములకుఁ బాషాణములును ద్రవీభూతములగుచుండెను. ఆత్మారాముఁడయ్యును నా గోపికలతో భగవానుఁడు రమించెను.

శౌనకుఁ డిట్లడిగెను:- ''సూతా! వ్రజ వల్లభుఁడగు నంద నందనుఁ డాత్మారాముఁడును, ఆప్తకాముఁడు కదా! ఆతఁడు తన యాత్మయందే నిత్యము రమించునందువు.

ఆతఁడు నిత్య తృప్తుఁడును నాప్తకాముఁడును గదా! ఆతని కేమి స్పృహ? ఆత్మ తుష్టునకు గోపికలతో రమించు నావశ్యకత యేమి కలదు? పైఁగా శ్రీకృష్ణుఁడొక్కఁడే, గోపిక లసంఖ్యాకములుగఁ గలరు. ఆ యొంటరివాఁడంద ఱతో నెట్లు రమించినాఁడు?

అంత సూతుఁ డిట్లనెను:- "స్వామీ! ముందుగా మీరు 'వ్రజ' ఆత్మారామ, ఆప్తకామ శబ్దముల అర్థమును తెలిసికొనుఁడు "వ్రజ" మనఁగా వ్యాప్తి అనిపేరు. వ్యాప కుఁడగుటచేతనే నందనందనుని క్రీడాభూమికి వ్రజమను పేరు వచ్చినది. ఆతఁడు సదానందస్వరూపుఁడు. పరమ జ్యోతిర్మ యుఁడు. అవినాశి. వ్రజము సాక్షాత్పర బ్రహ్మ స్వరూపుఁడై నపుడు, దానిలో నంద నందనుఁడగు శ్రీకృష్ణుఁడు నిత్య నివాస మొనర్చుచున్నాఁడు. అది ఆతని స్వరూపమే. కావున నంద నందనునకు వ్రజవల్లభుఁడను పేరు వచ్చినది. ఆ వ్రజ వల్లభుని గూర్చిన అనుభవమును పిండినిబొక్కి ఆఁకలినిఁ దీర్చుకొను శుష్క ప్రకృతి కలవారు తెలిసికొనఁజాలరు. సుస్వాదు పదార్థముల ననుభవించువారును, రసగుల్లావలె లోపలను బయటను ప్రేమరసముతో నిండియుండిన ప్రేమ గల రసిక జనులే రసిక శేఖరుని మధుర రసము ననుభ వింపఁగలరు.

భగవానుని ఆత్మారాముఁడనియు, ఆప్తకాముఁడనియు నేల యనినారో విచారింప వలయును. నంద నందనుఁడగు శ్రీకృష్ణచంద్రుని ఆత్మ రాధికాదేవియే. భగవానుఁ డామెతో రమించుచుండును. ఇరువైపులను ప్రేమ సముద్రము పెల్లుబుకుచుండును. నిత్యమును నిత్య నూతన ప్రేమ అభివృద్ధినిఁ జెందుచుండును. నిరంతరము కలియుచున్నను నిరువైపులనుండియును సదా అనుభవము కలుగుచుండును. ఇదివఱకెన్నఁడును గలియక యిప్పుడే కలియుచున్నట్లుండును. ఈ విధముగ రమించుటచే నాతఁ డాత్మారాముఁ డనఁబడును.

మంచిది, ఆప్తకాముఁడనుట కర్థమేమి? కామన యనఁగాఁ గోరిక. కోరిన వస్తువును బొందవలయునను నభిలాషకుఁ గామమని పేరు. వ్రజమున నుండఁగా భగవానుని కోరికయేమి? గోవులను బోషించుట, గోపబాలురతోఁ గ్రీడించుట, గోపికలతో మధురరస ఖేలన మొనరించుట, సరసలీలా విహారమొనర్చుట, ఇవన్నియును భగవానునకు వ్రజమునఁ బూర్ణముగఁ జిక్కెను. అందువలన నాతనికిఁ బూర్ణ కాముఁడని పేరు వచ్చినది. ఈ లీలా రహస్యమును ప్రాకృత పురుషులు ఆతని కృపలేక తెలియఁజాలరు. ఏల యనఁగా నివి యన్నియును ప్రకృతి కావలి విషయములు, భగవానుఁడు ప్రకటరూపమున నవతరించినప్పుడు దాని

అనుభవమును ప్రాకృత పురుషులును గొంచెముగఁ దెలిసి కొనఁగలరు. భగవంతుని అవతార లీలలును రెండు విధము లుగ నుండును. ఒకటి వాస్తవికము, రెండవది వ్యావహారి కము. వాస్తవలీల స్వసంవేద్యము, దాని యనుభవమును స్వీయముగ భగవానుఁడును ఆతని పరమ రసిక అనన్యో పాసకులగు భక్తజనులును దెలిసికొనఁగలరు. వ్యావహారిక లీల ప్రకృతి వెంటనుండక జరుగదు. కావునఁ బ్రకృతితోఁ గూడి యుండుటచేఁ బ్రాకృతులు చూడఁగలరు. కాని ఇది వాస్తవ లీలకు సర్వథా భిన్నమైనది. ఇది ఆత్మారాముఁ డనుటకు, ఆప్తకాముఁడనుటకు నర్థములు.

ఒక్క శ్రీకృష్ణుఁ డసంఖ్యాకులగు గోపికలతో నెట్లు రమించెనని మీ రడిగితిరి? కావున దీనికి ప్రత్యుత్తరమును వినుఁడు. యోగి తన యిచ్ఛచే ననేక రూపములను జెందఁ గలఁడు. సౌభరి మహర్షి మాంధాతయొక్క యేబదిమంది కుమార్తెలతో యేఁబది రూపములను యోగబలముచే ధరించి రమించెననుట మీ రెఱిఁగినదే. యోగికి యోగ ముచే సమస్త సామర్థ్యములును బ్రాప్తించును. సమస్త యోగములకును నీశ్వరుఁడు శివుఁడు, కావున నాతని యోగే శ్వరుఁ డందురు. ఆ శివునకును నెవఁడీశ్వరుఁడో అట్టి యోగేశ్వరుఁ డిన్ని రూపములను ధరించు టేమంత ఆశ్చర్య కరమగు విషయము! గోపికలందఱును నెవరికివారు శ్యామ

సుందరుఁడు చేతులను జాచి తననే ఆలింగన మొనర్చుకొను చున్నాఁడని తలఁచిరి.

శౌనకుఁ డిట్లనెను:- "సూతా! మా శంకకు సమాధానము వచ్చినది. తర్వాత కథను జెప్పుము. తర్వాత నేమైనది?".

అంత సూతుఁ డిట్లనెను:- "స్వామీ! తర్వాత కథను జెప్పుటకు నాకు శక్తి లేదు. తర్వాత నేమి జరుగవలసి యున్నదో అది జరిగినది. రమణము జరిగెను. రాసవిలాసము జరిగెను. వర్ణనమును యీ పెద్ద గడ్డముతో నెట్లు చేయఁ గలను. దానిలోనికి మీసములును గడ్డములును లేనివారికే ప్రవేశము కలదు. కృష్ణునకును గడ్డములు మీసములు లేవు. గోపికలకును గడ్డములు మీసములు లేవు. వారి శిరస్సులపై నల్లగ నుంగరములు తిరిగిన వెంట్రుకలు మాత్రము కలవు. తెల్ల వెంట్రుక లచ్చట కనబడనే కనఁబడవు. నా పెద్ద గడ్డమును నచ్చటి గోపికలు చూచినచో నేలోకము నుండియో భయంకర జంతువు వచ్చినదని భయపడి పరు విడెదరు. కావున రాసవిలాస వర్ణన మొనర్చుట నాశక్తికి మించినది. ఆ వర్ణనమును నేను జేయఁజాలను. మీరు నన్ను బలవంత మొనర్పకుఁడు. తర్వాత కథను నేను జెప్పెదను."

నమ్రతతో శౌనకుఁ డిట్లనెను:- "సూతా! అట్లు కాదు. అట్టిదేమియును లేదు. భగవల్లలను యథార్థ రూప

మున వర్ణించుటకు బ్రహ్మకైనను సాధ్యముకాదు. ఇంక నితరుల విషయము చెప్పనేల? గంగాజలము నంతను బాత్రలో నింపుకొని పోవుట కెవరికి సాధ్యము కాఁగలదు? గంగను బాత్రలోఁ దీసికొనిపోవుదురు. అప్పుడు నేను గంగను దెచ్చితి ననుచుందురు. అనంతాకాశమును బక్షి దాటఁ గలదా? అయినను నది తన సామర్థ్యము ననుసరించి యెగు రును. నీవు కాడి నావల వేయవలదు. తప్పక రాసలీలా వర్ణన మొనర్పుము. నీవును బిల్లలవలె నాటల నాడుట లేదు కదా? ఒక్కొక్కప్పుడు లేదు, కావనుచు మా అభిలాష లను బెంచుట లేదుకదా! మహాభాగా! మేము మొదటి నుండియును నీ ప్రసంగమును వినుట కత్యంతోత్సాహమును జెందియున్నాము.''

దీనిని విని నవ్వి సూతుఁ డిట్లనెను:- ''స్వామీ! అట్లుకాదు. నిజముగ నీ విషయము చాల గంభీరమైనది. నాబోటి విషయాసక్తునకు దీనినిఁ జెప్పుట కధికారము లేదు. అయినను మీరింతగా నాజ్ఞాపించుచున్నారు కావునను, బల వంతము చేయుచున్నారు కావునను మీ యాజ్ఞను శిరసావ హించెదను. యథామతిగను. యథాశక్తిగను నేను దీనినిఁ గూర్చి వర్ణించెదను. ఇప్పుడు మీరు సమాహిత చిత్తులరై యీ పుణ్య ప్రసంగమును శ్రవణ మొనర్పుఁడు.''

---

# ఆత్మారాముని రమణము

(౯౭౧)

శ్లో॥ బాహు ప్రసార పరిరంభ కరాళ కోరు
నీవీ స్తనాలభన నర్మ నఖాగ్రపాతైః।
క్ష్వేల్యావలోక హసితై ర్వ్రజ సుందరీణామ్
ఉత్తంభయన్ రతిపతిం రమయాం చకార॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౨౯ అ. ౪౬ శ్లో.

మ॥ కరుణా లోకములం బటాంచల కచా
కర్షంబులన్ మేఖలా
కర బాహు స్తన మర్శనంబుల నఖాంక
వ్యాప్తులన్ నర్మ వా
క్పరిరంభంబుల మంజులాధర సుధా
పానంబులం గాంతలం
గరఁగించెన్ రతికేళిఁ గృష్ణుఁడు గృపం
గందర్పుఁ బాలార్పుచున్॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

అనుభవ విషయములను, రహస్యమయములను భాషలో వర్ణింపఁజాలము. కొన్ని రూఢి రహస్యమయ శబ్దములుండును. అవి యా విషయమున వ్యవహృతము లగును, దాని యర్థము పరంపరగాఁ దెలిసికొనవలయును. పిండ శబ్దము కలదు. కొందఱు మాతండ్రికి పిండమును బెట్టుచున్నామందురు. మన చిన్న పిల్లలును దీని యర్థమును దెలిసికొనఁగలరు. కాని పునర్జన్మ సిద్ధాంతము నంగీకరింపని దేశములలోను, శ్రాద్ధ తర్పణములు లేనిచోటులందును బిండమునుగూర్చి చెప్పవలయుననినచోఁ బిండిముద్ద, లేక పిండి బంతియని చెప్పవలయును. ఇట్లు చెప్పినను వారు భావమును గ్రహింపఁజాలరు. ఉపనిషత్తులలోఁ జాల యంత్రములు కలవు. అవి పరంపరగ నశించినవి. ఇప్పుడు వానిని, జేయఁదలఁచినచోఁ జేయలేము. ఏలననఁగా వానిలోఁ బ్రచలితములైయున్న శబ్దస్వరూపమును మన మెఱుఁగఁజాలము. నేఁడు సర్వతోభద్రచక్రమును లిఖించుఁడని చెప్పినచో నెంతటి యల్పాల్ప కరిష్ఠియైనను నే శ్రమ లేకయే వ్రాయుదురు. వ్రాసి చెప్పినఁ దెలిసినఁ జాలరు. ఈ విధముగనే ముద్రల విషయమునను, పరంపరగా ముద్రలను నేర్చుకొనిన వారు ముద్రలను మనకు బాగుగా నేర్పఁగలరు. కాని పుస్తకమును జూచి ముద్రలను వేయుట అత్యంత కఠినమగును. ఈ విధముగనే గోపికలతో శ్యామసుందరుఁడు రమించిన

విషయ మీ వాక్కునకును, లేఖనికిని మించిన విషయము. గోపీభావముచే భావితులము కానిచో దాని ననుభవ మునకుఁ దెచ్చుకొనఁజాలము. కావున నిది చెప్పు విషయ మును గాదు, వినఁదగిన విషయమును గాదు. అనేక జన్మ ములు సాధన చేయఁగాఁ జేయఁగా నీ విషయము అనుభవ మునకు రాఁగలదు. గోపి యనిన స్త్రీయునుగాదు, పురు షుఁడుగాఁడు నపుంసకుఁడును గాదని మే మిదివఱకే చెప్పి యున్నాను. ఇది లింగాభిమానమునకుఁ బరమగు భావము. అయినను లోక లీలా నిమిత్తముగ గోపికలకు స్త్రీ వేష మును, శ్యామసుందరునకుఁ బురుష వేషము నేర్పడినది. స్త్రీ పురుషులకు బరస్పరము ప్రేమక్రీడ యెట్లు జరుగునో గోపిక లకును శ్రీకృష్ణునకును జరిగినది. కావున నీ భావము స్త్రీ జాతికే విశేషముగఁ గలదు. ఏలననఁగా వారికి స్వాభావిక ముగ భర్తయందు ప్రేమకలదు. దానినే భగవంతుని మీఁదకు ద్రిప్పవలయును. ఏ మానవుఁడు దేనినిఁ గూడ ప్రేమించనేలేదో అతఁడు భగవంతునిఁ బ్రేమింపఁజాలఁడు. ఏ పొలమున జిల్లేడు, ఉమ్మెత్త, ఆముదము, బొమ్మజెముడు, పూరుగు ఇవి యుత్పన్నమగునో దానిలో గోధుమలు పెరు గును గాని అది సర్వథా ఊసర భూమిగనే యుండును. అసలు పండనే పండనిచోట దానిమీఁద నేమి యాశ

యుండఁగలదు ? ఒకానొకఁడొక సాధువు కడకుబోయి "నాకు మార్గదీక్ష నొసంగుఁ"డని యాచించెను.

సాధు విట్లడిగెను:- "ప్రపంచమున నీ వింతవఱ కెవరి నైనను బ్రేమించితివా ?"

ఆతఁ డిట్లనెను:- "లేదు స్వామీ! నే నెవ్వరినిఁ బ్రేమింపలేదు."

సాధు విట్లనెను:- "అయితే, పోయి, ముందుగాఁ బ్రపంచమున నెవరినైనఁ బ్రేమించుటను నేర్చుకొనుము. ముందుగా నొకదాని ననుసరించుచు వ్రాయుటను నేర్చు కొనుము. తర్వాతఁ జేయి తిరిగిన తర్వాత కాగితము మీఁదను వ్రాయఁగలవు." సారాంశ మేమనఁగా ప్రపంచ ప్రేమ ప్రేమ మహా విద్యాలయమునకుఁ బ్రథమ ప్రాథమిక పాఠము. ఈ ప్రపంచము ఆరంభిక పాఠశాల. మొదటగా నేత్ర చికిత్సను నేర్చువారికీ పాఠమును జెప్పుదురు. ఒకా నొక జలపాత్రమున వేఁప పండ్లను వేసి, విద్యార్థులతో నిట్లందురు:- "ఈ పండుమీఁద నీరు కదలకుండగనే సూదిని గ్రుచ్చవలయును." ఈ ఫలముమీఁద సూదిని గ్రుచ్చుట యొక్క తాత్పర్యము, కన్నులమీఁద సూదితోఁ బొడుచు నభ్యాసము కొఱకే చేతినిఁ దేలికగ నుంచవలెను, కన్నుల కే పధమగు హానియును గలుగకుండవలయును. శిక్షణమున

కనధికార చేష్ట నొనర్చినచో వారు సఫలులు కాలేరు. ప్రేమసాధన అనుభవ వస్తువు, అందఱును దీనినిఁ జెప్పుటకుఁ గాని వినుటకుఁగాని అధికారులు కారు. కావున మునులు దీనినిఁ జాల గుప్తముగ నుంచినారు. దీని నెచ్చట వర్ణించి నను జాల రహస్యమయ రీతిని వర్ణింపఁబడినది.''

సూతుఁ డిట్లనెను:- ''మునులారా! మీరు గోపికా కృష్ణుల రమణమును గూర్చి వర్ణింపవలసినదని ఆజ్ఞాపించు చున్నారు, కాని నాకు సాహసము లేదు. మహాభాగులారా! మూఁగ గుడమును దినియును దాని రుచిని వర్ణింపఁజాలఁడు. నవనీతముయొక్క రుచి యెట్టిదని యెవరినైన నడుగుఁడు, ఆతఁడు 'బాగున్న'దని అనుటకంటె నింకేమి చెప్పఁజాలఁడు అందువలన మా గురుదేవుఁడగు శుకదేవుఁ డీ వర్ణనమును నత్యంత సంకేతముగ సంక్షేపముగఁ జెప్పియుండెను. అతని పదముల ననుసరించి నేను గొంచెముగఁ జెప్పెదను. కాని దీనిలో నేను సఫలుఁడను గాఁజాలను. ఏలననఁగా నాలో నంతటి యోగ్యత లేదు.''

శ్రీకృష్ణుని స్వీకృతి లభింపఁగానే ఆ వ్రజాంగనల ముఖ కమలములు వికసించెను. ఆ ప్రఫుల్ల వదనములు గల బాలలు తమ కమనీయ దృక్కులతోఁ గోటి కందర్ప దర్ప దళన పటిష్ఠుఁడగు శ్రీకృష్ణుని వైపున కనురాగ భరిత

దృష్టులతోఁ జూడ నారంభించిరి. మదన మోహనుఁడు తన మనోహర మందహాసములతోడను, మల్లె మొగ్గలవంటి పలువరుసలయొక్క కమనీయ కాంతులతోడను, వ్రజ వల్లభుల మధ్య తారకలలోఁ జంద్రునివలెఁ బ్రకాశించుచుండెను.

భగవానుఁడా వ్రజాంగనల కంఠమందుఁ జేతులను వైచి మన్మథునివలె శోభించుచుండెను. ఆతఁడు వైజయంతీ మాలను ధరించి వారందఱితోఁ గలిసి, యూథపతివలె నిటు నటు వనములోఁ దిరుగుచుండెను. కృష్ణ ప్రియ కమనీయ కామినులగు నా గోప వనితలు తమ కమనీయ కలకంఠ కంఠములతో కృష్ణుని కవిత కీర్తినిఁ గానము చేయుచుండిరి. శ్రీకృష్ణుడును వారి స్వరమున స్వరమును, లయలో లయను గలిపి తానును వారి గానము ననుకరించుచుండెను. వారి తాళములోఁ దాళమును గలిపి ఆతఁడును బాడుచుండెను. ఆతని సుఖద సంస్పర్శచే వారి యంగములను బులకింపఁ జేయుచు వారికి వర శోభను జూపించు చుండెను. వ్రజాంగనల అనురాగము అనుక్షణమును నభివృద్ధిఁ జెందుచుండెను. కావున వివారగా నంతరము వారితో రమించ వలయునను నభిలాష ఉత్కంఠితమయ్యెను. దానినిఁ పూర్తిచేయుటకై యమునాపులిన పావన సైకతములమీఁద వచ్చిరి. అచ్చటి

యిసుక సరసముగను, స్వచ్ఛముగను, కోమలముగను, మెత్తగను నుండును. అది ఎవరో అతి మృదులమును, సుఖదమునగు శయ్యయందు ఆస్తరణమును బఱచినట్లుండెను. ఎంతమంది గోపికలుండిరో అన్ని కుంజముల నిర్మాణమును తన యోగమాయచే నంద నందనుఁ డొనర్చెను. తరువాతఁ బ్రతి గోపికతోను రమించుటకై వారితో వేఱు వేఱుగా నికుంజములలోఁ బ్రవేశించెను. ఆ సమయమున దృశ్యము అలౌకికముగ నుండెను. కాముని సఖుఁడు మలయానిలుఁడు కాళిందియొక్క ఉత్తాల తరంగముల సంసర్గముచే శీతలముగను బరమ సుఖముగను నయ్యెను. కుముదినీ పుష్పగంధముచే నది సుగంధితమయ్యెను. శ్రీకృష్ణునిఁ దప్పించుకొని మంద మందగతిచేఁ బోవుచుండెను. ఆ యలౌకిక ఆనందమయ సమయమున నచ్యుతుఁడు తన యనన్యోపాసకులగు గోపికల సంకల్పములను పూర్ణము కావించెను. కామ కళ యందు పరమ ప్రవీణుఁడగు ప్రాణపతి, ప్రేష్ఠుఁడు తన ప్రియతమలగు గోపికల చిరకాలీన అభిలాషను పూర్తి కావించెను. బాహు ప్రసార, పరిరంభ, కర, అలక, జఘన, కటి, పట, బంధన మోక్షణ, హృదయ, స్పర్శ, నర్మ, నఖ, దంతక్షత, చారు స్వరూపమున మందహాసములతోఁ జేయవలసిన పనులన్నిటినిఁ జేసి వారి కామ సంతప్త హృదయములను శాంతింపఁజేసెను. వారికి సుఖమును గలిగించెను.

వారి కధీనుఁడైనటయ్యెను. దీనముగఁ గనఁబడెను. మాటి మాటికిని వారిని ప్రణయయాచ చేయసాగెను. ఇప్పు డా గోపికలకు గర్వ మెక్కువయ్యెను. ఇంతవఱకును బిల్లులవలె మ్యావు మ్యావు అనువారిప్పుడు సింహకిశోరిణులవలె గర్జింపఁ దొడంగిరి.

సూతుఁ డిట్లనెను:- "మునులారా! మానవునకుఁ దన పూర్వస్థితి స్మరణ యుండినచో వారి కెన్నిటికిని అభిమానము కలుగదు. భగవంతుని మఱవదు. పూర్వస్మృతిని మఱచియే భగవానుఁడు తన వేఱని తలఁచును. అశాంతినిఁ జెందును. తనకు సుఖశాంతుల నొసంగువానిని లోపల వెదుకకొనక బయట వెదుకుచుండును. కాని ఆతఁడు దూరమున లేఁడు. దగ్గఱలోనే యున్నాఁడు. హృదయ కందరమున దాగి యున్నాఁడు. అచ్చట వెదుకక బయట వెదుకును. ఈ యనర్థమంతయును నభిమానముచే సంభవించును. గోపికల మనస్సులలో నభిమానము గలుగగనే భగవానుఁడిట్లనెను:- "వీరి హృదయములలో నన్యుఁడగు జారు డెవఁడు ప్రవేశించినాఁడు. ఆజారుని నాశమొనర్చుటకై వానినిఁ జంపుటకై భగవానుఁడొక యుపాయము నాలోచించెను.

# అంతర్ధానము

౯౭౨

శ్లో॥ తాసాం తత్సౌభగమదం
వీక్ష్య మానం చ కేశవః।
ప్రశమాయ ప్రసాదాయ
తత్రైవాంత రధీయత॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౨౯ అ. ౪౮ శ్లో॥

ఉ॥ చిక్కక యీశుఁడై యెదిరిఁ
జిక్కులఁ బెట్టెడి మాయలానికిం
జిక్కి కృతార్థులై మరుని
చిక్కులఁజొక్కి లతాంగులుండఁగా
మక్కువ శాంతి సేయుటకు
మన్నన సేసి ప్రసన్నుఁడౌటకుం
జక్కన నా విభుండు గుణ
శాలి దిరోహితుఁడయ్యె నయ్యెడన్॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

లోకమున నేవస్తువు చెడ్డదని చెప్పఁబడుచున్నదో, దానినే భగవానునియందు వినియోగించినచో మంచిదగును. కామ, క్రోధ భయాదులు లోకమునఁజెడ్డవి. వానినే భగవంతునియందు వినియోగించినచో నది పరమపదప్రాప్తికి సాధనములగును. లోకమున గర్వమును జెందుటయు, దన సౌభాగ్యమును జూచుకొని మదమును గలిగియుండుట చాల చెడ్డది. ఈ మాన మదములనే భగవానుని యెడలఁ గలిగినచో విరహ ముత్పన్నమగును. దానివలన హృదయము ద్రవీభూతమగును. అంతఃకరణము విశుద్ధమగును. దీనివలన మందహాసమొనర్చుచు మాధవుఁడు సమ్ముఖమునఁ బ్రకటమగును. లోకమందు పతి పత్నులందుఁ బ్రేమమానము కలుగును. అది ప్రేమ నినుమడింపఁజేయును. భక్తిరస శాస్త్రములందు ప్రేమయొక్క వ్యభిచారీభావములు చెప్పఁబడినవి. నిర్వేద, విషాద, దైన్య, గ్లాని, శ్రమ, మద, గర్వ, శంకా, త్రాస, ఆవేగ, ఉన్మాద, అపస్మార, వ్యాధి, మోహ, మృతి, ఆలస్య, జాడ్య, వ్రీడా, అవహిత్థా, స్మృతి, వితర్క, చింతా, మతిధృతి, హర్ష, ఔత్సుక్య, ఉగ్రతా, అమర్ష, అసూయ, చాపల, నిద్రా, సుప్తి, బోధ వీనిలో నధికాంశము లోకమందు నిందితులుగఁ జేయఁబడినవి; కాని యివి భక్తి సంబంధమున నైనచో నివి ఆదరణీయ రస పోషకములుగఁ జెప్పఁబడినది. రసవృద్ధి కొఱకు మాన

మదములు గోపికల హృదయములందు ఉత్పన్నములైనవి. అట్లు కాకున్నచో నెవరి తను మనఃములలో మన మోహనుఁడగు శ్రీకృష్ణుఁడు నివసించినాఁడో వారి హృదయములందు లౌకిక మద మానము లెట్లు ప్రవేశింపఁగలవు? మాన మదములు కలుగుటయును నొక క్రీడయే.

సూతుఁ డిట్లనెను:- "మునులారా! వ్రజాంగనలను భగవానుఁ డత్యధికముగ సమ్మానించి, తన చేతులతో వారి కేశపాశములను జిక్కు-తీసియు, వానిలోఁ బుష్పమాలలను దుఱిమియు, వారికి తిలకములను బెట్టియు, నింకను నిట్లు సమస్త విధముల నాదరింపఁగా, మానవతులగు వారు తమ్ముఁ బ్రపంచమున స్త్రీలలో సర్వశ్రేష్ఠులుగా భావించుకొనుచుండిరి. వారిట్లనుకొనిరి:- "జనులందఱును నెవని దర్శనముకొఱకు ఉవ్విళ్లూరుచుందురో, సుందరులలో సుందరలగు స్త్రీ లెవని కృపా కటాక్షముకొఱకు ఆతురతను, వ్యాకులతను జెందుచుందురో, అట్టివాఁడు నేఁడు మాకీ విధముగ సేవ జేయుచున్నాఁడు. ఆతఁడే నేఁడిట్టి దీనతను జూపించుచున్నాఁడు." వారి సౌభాగ్యమునకై మదము కలిగినదని భగవానుఁడు తెలిసికొని అది ప్రేమ ఘాతకమని భావించి శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! మదమన నేమి?

సూతుఁ డిట్లనెను:- "మదమున కే వ్యాఖ్యను జేయఁ గలము? మదమనిన లోకమున నందఱకును దెలిసినదే. చాల ప్రసిద్ధమైనది. మా సౌభాగ్యము పండినది. కృతకృత్యులమైతిమి. ఆహా! మన మెంతటి సౌభాగ్యశాలురము. ఇంతటి గొప్పవాఁడు మా వశమున నున్నాఁడు. ఈవిధముగఁ దన రూపమును, యౌవనమును, గుణములను, సర్వోత్తమాశ్రయమును, ఇష్టలాభమందు గర్వము కలిగినచో దానినే మద మందురు. గోపికలు తమ సౌభాగ్యమునుగూర్చి పొగడుకొనుచుండిరి. వారికిఁ దమ రూప యౌవన గర్వము కూడ ఉండెను. సర్వోత్తమాశ్రయమును బొందియును, చిరాభిలషిత యిష్టమును బొందియును వారు తాము సర్వశ్రేష్ఠ గుణవతుల మనుకొనుచుండిరి. రస శాస్త్రకారులు మదమునకును గర్వమునకును గర్వమున్నదనిరి. మదము యౌవనాధిక్యముచేతను, మధుపానముచేతను గలుగును. దానిలో వివేకముండదు. హృదయమున నుల్లాస మధికముగ నుండును. వాక్కు స్ఖలితమగును. కొందఱు వాగుటకుఁ బ్రారంభించెదరు. కొందఱు నవ్వుచుందురు. పాడుచుందురు. ఱంకుచుందురు. కేకలు వేయుచుందురు. బూతులు తిట్టుచుందురు. ఏడ్చుచుందురు. కొట్టుకొనుచుందురు. కాన యిచ్చట సౌభాగ్య మదమునకు సంబంధించిన నభిప్రాయమునకు గర్వ మందురు. వారికి మాన

మును గలుగును. మాన మనిన నిచ్చటఁ బ్రేమలోఁగలుగు మానము కాదు. ఇచ్చట మానమనిన నభిమానమునకుఁ బేరు. తన ప్రియుల హృదయమున మద మానములు ప్రవే శించుట ఉచితము కాదు. వీనిని శాంతింపఁ జేయవలయునని భగవానుఁ డనుకొనెను. ఒకానొక దరిద్రునకు విపులమగు ధనరాశి లభించినచో వాని కత్యధికమగు మదము కలుగును. దానికే కైకోపాయము 'సంపన్నాంధున కంజనంబు వినుమా దారిద్ర్య మూహింపగన్'' కావున వాని ధనమును నాశ మొనర్పవలయును. నష్టమనఁగా నదర్శనమునకుఁ బేరు. అందువలన భగవానుఁడు వారినిఁ గృపఁ జూచుటకై, మద మానములను శాంతింప జేయుటకై అచ్చటనే అంతర్ధాన మయ్యెను. గోపికలాతని కంఠమునఁ దమ బాహువులను వైచిరి. అవి అట్లే యుండెను. తమ సమీపమున శ్యామ సుందరుని వారు కాంచకపోవుటచే వారి మదమును, మాన మును నెత్తునుండి రాతిపైఁబడిన గాజు ముక్కవలెఁ జూర్ణ ముగ నయ్యెను. వా రేడ్వ నారంభించిరి. కేకలు వేయ సాగిరి.''

శౌనకుఁ డిట్లడిగెను:- ''సూతా! ఇచ్చట రసభంగ మైనది. అయ్యో! సమాగమ సుఖము నొసంగి వెంటనే అంతర్ధాన మగుట అమృతమును ద్రావించి చేతులలోనికి హాలాహల విషపాత్ర నొసంగుటయే.''

సూతుఁ డిట్లనెను:- "స్వామీ! ప్రేమ రాజ్యమున నిట్టి ఖేలనములే జరుగుచుండును, ఎప్పుడును గలిసియే యుండిన చోఁ బ్రేమ పెరుగు టెట్లు? ఒక్కొక్కప్పుడు కలియవలయును, ఒక్కొక్కప్పుడు వియోగమును జెందవలయును. వియోగమున హృదయమున సదా కలిసియుండును. ఆతని ఒక్కొక్క మాటయును, ఒక్కొక్క చేష్టను నేకాంతమున స్మరించిన హృదయ ముప్పొంగును. మనస్సు ప్రఫుల్లితమగును, సమాగమేచ్ఛ తీవ్రమగును. ఉత్కంఠత కలుగును. చిరకాల వియోగానంతరమునఁ గలుగు సమాగమమునఁ గలుగు సుఖము అత్యధిక సుఖమును గూర్చును. చిరకాలమునకు విశుద్ధమగు గలకండ కలిపిన పాలలో నానందమున్నట్లుండును. ఇది రసభంగము కాదు. రసపోషకము, శ్రీకృష్ణునిఁ బొందఁజాలక గోపిక లున్మాదినులవలెఁ జేష్టలొనర్ప సాగిరి."

శౌనకుఁ డిట్లనెను:- "సూతా! ఉన్మాదమన నేమి? దానిలో నే యే చేష్టలొనర్చెదరు?"

సూతుఁ డిట్లనెను:- "స్వామీ! హృదయములో విభ్రమము కలిగినపుడు ఒకటి చేయఁదలఁచి యింకొకదానినిఁ జేసిన దాని నున్మాద మందురు. ఇందులో నేమి చేయవచ్చునో యేమి చేయరాదో తెలియదు. దేని నడుగవలయునో దేని నడుగరాదో తెలియదు. ఎవరితో నేమి

యడుగవలయునో యీ వివేకముండదు. ఈ యున్మాదము లోకములో నొక రోగము. కాని యిది ప్రేమలో మూఁడు కారణములచే సంభవించును. ఒకటి హృదయములోఁ దన ప్రియ వస్తువునందు నిరంతరము స్మృతి కలుగుటచే నానంద ముప్పొంగి, అందులో నున్మాదము కల్గును. శ్రీ రాధికా దేవికెట్లు హృదయమందు సదా శ్యామసుందరుఁ డేవసించునో, వీనులను జేయుచు సదా ఆతని చింతనమునే చేయుచుండును. ఒక దినమునఁ దల్లి యిట్లనెను:- "అమ్మా! కొంచెము చల్లను జేయవే." మనస్సు మన మోహనుని మూర్తి మీఁద నిలిచియుండెను. పూర్తిగా మగ్నమై యుండెను. తల్లి చెప్పఁగా శరీర భావమునుననిచ్ఛాపూర్వకముగ నెత్తి దధిమంథన మొనర్చు స్థానమునకు రాధిక వచ్చెను. అచ్చటఁ బెరుగును జిలుకుటకుఁ గవ్వ ముండెను. అచ్చట చల్లగుంజమఁ ద్రాడు కట్టఁబడి యుండెను. ఇప్పుడు బానలోఁ గల పెరుగును నొట్టిలోఁ గుమ్మరించి దానినిఁ గవ్వముతోఁ జిలుకవలసి యుండెను. కాని ఆమె శ్రీకృష్ణుని స్తుతిలో నామె ఉన్మత్తయై యుండెను. కాని ఆమె ఉత్తకుండలోఁ గవ్వమునుబెట్టి చిలుక నారంభించెను. తల్లివచ్చి యిట్లనెను: "రాధా! నీకు మతి తిరిగిపోలేదుగదా! నీవు వెఱ్ఱిదానవు కాలేదుకదా! పెరుగును బోయకయే రిక్తపాత్రమునఁ బెరుగును జిలుకుచున్నావా?" అప్పుడు రాధకు స్మృతి

కలుగగాఁ జాల లజ్జితయయ్యెను. దీనికిఁ బ్రౌఢానందోన్మాద మందురు. ఇది యుభయపక్షములను గలుగును. రాధాదేవికీ స్థితి కలుగుచునుండే కాదు. శ్రీకృష్ణుఁడును రాధాస్మృతిలో నిట్లు తన్మయుఁడై యుండెను. ఆతఁడు గోవులను బాలు పిండుటను మఱచెను. ఆతఁ డేకాంతమునఁ గూర్చుండి రాధను జింతించుచుండఁ దల్లి యిట్లనెను:- "కృష్ణా! నీవు చింతగా నున్నావేమి? ఆవును బాలు పిండుకొని రారా!"

తల్లి చెప్పఁగా నాతఁ డావును బాలు పిండుటకై పోయెను. కాని ఆతఁడు ప్రియయొక్క ప్రేమోన్మాదమున మైమఱచి, ఆవును బాలుపిండక యెద్దు దగ్గఱ కూర్చుండి పిండ నారంభించెను. ఇంతలోనే అచ్చటికొక సఖుఁడు వచ్చెను. ఆతఁ డిట్లనెను:- "కృష్ణా! ఏమి చేయు చున్నావు?"

అచ్చటఁ గూర్చుండియే యిట్లనెను:- "ఓయీ! నీకుఁ గన్నులు పోయినవా యేమి? ఆవును బాలుపిండుట కనఁబడుట లేదా?"

నవ్వి గోపకుఁ డిట్లనెను:- "నా కన్నులు పోలేదు. నీ కెవరో గౌరవర్ణముగల వస్తువు నిన్ను ఉన్మాదునిఁగఁ జేసి నట్లున్నది. నీ వావును బాలుపిండు చుంటివా? లేక ఎద్దును బిండుచున్నావా?" ఇప్పుడు శ్రీకృష్ణునకుఁ దెలివివచ్చి

యిట్లనెను:- "నేను ఎద్దు గోమారులను దీయుచున్నాను. ఇవి కలిచుకొని దానినిఁగుట్టుచున్నవి." గోపకుఁడు నవ్వుచు వెడలిపోయెను. ఇది యిరుపక్షములను క్రొధానందోన్మాద లక్షణము.

ఆపత్తులందును నున్మాదము కలుగును. ఆపత్తులలోఁ బడి జనులు రాళ్లను అప్పలను గూడ అడుగుచుందురు. చేయరాని పనులను జేయుచుందురు, విరహమునందును నున్మాదము కలుగును. గోపికల కీయున్మాదము శ్రీకృష్ణుని విరహమున సంభవించినది.

శౌనకుఁ డిట్లనెను:- "సూతా! ఇప్పుడు మాకు గోపికల యొక్క విరహోన్మాదమును గూర్చి చెప్ప వలయును."

సూతుఁ డిట్లనెను :- "మునివరా! గోపికలకు శ్రీకృష్ణుని విరహమున విచిత్రమగు దశ కలిగెను. వా రానందముగ్ధులై శ్రీకృష్ణ సమాగమ సుఖము నాస్వాదించు చుండిరి. ఇంతలోనే శ్రీకృష్ణుఁ డంతర్ధానము నచ్చటనే అంతర్ధానము చెందెను. ఆ సమయమున యూధ పతినిఁ బోఁగొట్టుకొనిన నాడు యేనుఁగులు వ్యాకులము చెందిన నట్లును, నల్లజింక పోఁగానే హరిణములు వ్యాకులము చెందిన నట్లు అందఱును వ్యాకులమును జెందిరి. వారు మనస్సుతో

భగవంతునియొక్క లీలలను జింతించుచుండిరి. శ్యామసుందరుఁ డెట్లు లలితగతిచే విలాసముగ మంద మందముగఁ బోవు చుండునో, ఏ విధముగ నమృతములోఁ దడుపఁ బడినఁ దన మనోహర మందహాసము ద్వారా మా సంతప్త హృదయ ములను సుశీతల మొనర్చెనో, విట్టి సుఖద శీతల విలాస మయ వైఖరిచే మా చిత్తములను హరించెనో, ఆతని ప్రేమ భరిత వాక్కులను, వినిన శ్రవణములు తృప్తిచెందుట లేదు. ఆతఁడు మాటలాడుట కాదు. కర్ణములలో నమృతమును గ్రుమ్మరించెడువాఁడు. ఆతని వాక్యములలో నెంతో మాద కత, యెంతో తన్మయత నిండియుండెడిది. ఎంతవఱకు చెప్పఁ గలము? ఆతని సమస్త లీలావిలాసయుక్త కార్యములలో మాదకత నిండియుండెడిది. ఈ విషయముల వలన మా చిత్తములన్నియును నాతని వైపునకు బలాత్కారముగ నాకర్షింపఁ బడినవి.''

సూతుఁ డిట్లనెను:- ''మునులారా! నే నెంతవఱకు చెప్పఁగలను. ఆ వ్రజాంగనలందఱును శ్రీకృష్ణుని భావ మందే తన్మయులై ఆతని భిన్న భిన్న చేష్టల ననుకరిచు చుండెను. వారందఱును దమ్ము శ్రీకృష్ణుఁడనని భావించుఁ కొనుచుండిరి. ప్రేమోన్మాదమున వా రేచేష్టల నొనరించితిరో వాని వర్ణనమును గొలఁదిగ ముందు చేయఁబోవుచున్నాను.''

---

# విరహోన్మాదినులగు వ్రజాంగనలు

(౯౭౩)

శ్లో॥ గాయన్త్య ఉచ్చైరముమేవ సంహతా
విచిక్యురున్మత్తకవద్వనాద్వనమ్।
పప్రచ్ఛురాకాశ వదంతరం బహి
ర్భూతేషు సంతం పురుషం వనస్పతీన్॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౨౯ అ. ౪ శ్లో॥

వ. ఇట్లు హరి గనుమొఱంగి చనిన గానక తిరుగు కరిణుల
వెల్లిన నుల్లంబులు దల్లడిల్ల వల్లవకాంతలు తదీయగమన
హాస లీలావిలాస వీక్షణ విహార వచన రచనాను
రాగంబులం జిత్తంబులు గోల్పడి వివిధ చేష్టలకుం బాల్పడి
తదాత్మకత్వంబున నేన నేన కృష్ణుండ నని శ్రీకృష్ణ
గుణావేశంబులం జరియించుచుండిరి.

మ॥ అని యిబ్భంగి లతాంగు లందఱును
బృందారణ్యా మందీశ్వరుల్
వనజాక్షుం బరికించి కానక విభున్
వర్ణించుచుం బాడుచున్

మనముల్ మాటలుఁ జేష్టలుం గ్రియలు
నమ్మానాథుపైఁ జేర్చి వే
చని రయ్యామున సైకతాగ్రమునకున్
సంత్యక్త గేహేచ్ఛలై॥

సిద్ధాంతరీత్యా బృందావనమందలి సమస్త వృక్ష, లతా, గుల్మ పాషాణాదులు చిన్మయములు, బత్తులలోను చైతన్య మున్నప్పటికిని వానికి మాటలాడు శక్తి లేదు; కాని ప్రేమోన్మాదమున నిది జడమా లేక చైతన్య మాయను వివేకముండదు. దానిలో జడ చైతన్యభావ ముండదు. దానిలో ఇష్టదేవతయే దృష్టి సమ్ముఖమున నుండును. ఆ సమయమున హృదయమున దీనత్వము వచ్చును. మనస్సు జేనినిఁ జూచునో దానిమీఁదఁ బూజ్యభావముండును. గుణ దోషములను గాంచు ప్రవృత్తి విలీనమగును. ఎల్లెడను దమ ప్రియునిజాడ తెలియవలయునను నాశయుండును. దీని వలనఁ గలుగవలెను. ఈ యవస్థలో నీ విధముగ నన్వేషణ ముండును. ప్రియస్మృతిలోఁ దన్మయత్వము లభించి ఆ మూలకముగ నాతని రూపము గోచరించుచున్నట్లుండును. ఏ భాగ్యశాలుర కీస్థితి కలుగునో వారు వందనీయులు. శ్రీకృష్ణ విరహమున గోపికలకిట్టి స్థితియే కలిగెను.

సూతుఁ డిట్లనెను:- "మునులారా! హఠాత్తుగా శ్రీకృష్ణుఁ డంతర్ధానము కాఁగా వ్రజ గోపికలు వికలలైరి.

వారి హృదయములు శ్రీకృష్ణ విరహ తాపముచేఁ దప్త మగుచుండెను. శ్రీకృష్ణు నన్వేషించుటకై వారు వన వనము లందు దిరుగఁ దొడంగిరి. ప్రియ వియోగమున నేస్థితులు కలుగునో వానిలోఁ జాల స్థితులు వారి శరీరములందు ప్రకటమై ప్రత్యక్షముగఁ గనఁబడుచుండెను.''

శౌనకుఁ డిట్లనెను:- ''సూతా! వియోగమని దేని నందురు? దానిలో నే యే స్థితులు కలుగును?''

సూతుఁ డిట్లనెను:- ''స్వామీ! ప్రియునితో విచ్ఛేదము కలుగుటయును, ప్రాప్తి సంగముచే వేఱగుటయు ఇదియే వియోగము. ప్రేమ యెంత యుత్కంఠముగ నుండునో, వియోగమంత సహింపరానిదిగ నుండును. ప్రియుఁడు పరదేశమునకుఁ బోవుట సామాన్యముగ నిదే వియోగము; కాని ఉత్కంఠప్రేమలో దృష్టికి దూర మగుటయే విరహము. కన్నులయెదుట నుండినను వియో గానుభవము కలుగును. గోపికలు బ్రహ్మను దూషించుచు నిట్లనిరి -

ఉ॥ నీవడవిం బగల్ దిరుగ
నీకుటిలాలక లాలితాస్య మి
చ్ఛావిధిఁ జూడకున్న నిమిషంబులు
మాకు యుగంబులై చనుం

గావున రాత్రులైన నినుఁ గన్నుల
నెప్పుడుఁ జూడకుండ ల
క్ష్మీవర రెప్ప లడ్డముగఁ జేసె
నిదేల విధాత క్రూరుఁడై॥
శ్రీమదాంధ్ర భాగవతము.

చేపలకుఁ గనురెప్పలుండవు. అవి అనిమిష దృష్టుల తోఁదమకు బ్రియతమమగు జలమును నిరంతరము చూచుచుండును. ప్రియుని అంకమున నుండినను వియోగానుభూతి కలుగును. ఇది వియోగమునకతి ఉచ్చావస్థ. సామాన్యముగఁ బ్రియుఁడు దూరమగుట వియోగమగును. చక్రవాకముల జంట వెంటనుండియును రాత్రులందు రెండును గలిసియుండఁజాలవు. వానికి రాత్రియంతయును సహింపరాని వియోగము కలిగియే యుండును. ఒకటి రాత్రియంతయును నిచ్చట కొట్టుకొనుచుండును. రెండవది ఆవల వియోగాగ్నిలో దగ్ధమగుచుండును. వియోగమున సాధారణముగ స్థితి కలుగును. సమస్తాంగములందును దాపము కలుగుటయును, దుర్బలత్వము వచ్చుటయును, రాత్రులందు నిద్ర పట్టక పోవుటయును, వచ్చినను నిద్రాభంగమై ఆతని స్మరణమే కలుగుటయును, ఆలంబ శూన్యత ననుభవించుటయును, అట్లఁగా నీ చింత కలుగుట:- "అయ్యో! ఆతఁడు

మమ్ము వదలినచో నెవని నాశ్రయించెదము ? ఎట్లు జీవిత మును గడుపుదుము ? ఎవని సహాయమునఁ బ్రపంచమున నిలుతును ? ధైర్యము సడలుటయును, శరీరమున జడత్వ మును, అంగములు శిథిలములగుటయును, ఆతని స్మృతి కలుగఁగనే శరీరము జడమువలెను పాషాణమువలె నగుట యును, శరీరమున వ్యాధి సంభవించుటయును, ఉన్మా దావస్థకలుగుటయును, ఏదో ఒక పనినిఁ జేయుటయును, దేనిని చేయుచుండునో దానిని మఱచుటయును, నిలుచుండి నను, కూర్చుండినను మూర్ఛవచ్చుటయును, మృతావస్థ వలె సంభవించుటయును, ఈ విధముగ వియోగమున నిట్టి స్థితులు కలుగును. గోపికలకు ప్రియసమాగమము నందాశ యుండుటచే వారు చావలేదు, మూర్ఛరాలేదు కాని వారు ఉన్మాదావస్థలోఁ బిచ్చివారివలె నటు నిటుఁ దిరుగ నారంభించిరి.

పోయి పోయి వారు వనమున నొక రావిచెట్టును గాంచిరి. దానికి సుఖద శీతలఛాయ యుండెను. అది పచ్చగ బాగుగా నుండెను. కాని కోమల పత్రములు గాలికి కదలుచుండెను. దానిక్రిందకు బోఁగానే గోపికలకు శీతల తానుభవము కలిగెను. ఇప్పుడు వారికొక సందేహము కలిగెను. శీతలానుభవము శ్యామసుందర ఛత్ర చాయలో

నుండవలయునే దీనిలోని కది యెట్లు వచ్చినది? ఓహో! శ్యామసుందరుఁ డిప్పుడే యిచ్చటినుండి పోయియుండ వలయును. ఇచ్చటినుండి వెడలిపోవునపుడు చాచిన దీని చేతులలోనికిఁ దన శీతలత్వమును గొంచెముగ విడిచిపోయి యుండవచ్చును. అందువలన వారశ్వత్థమును సంబోధించుచు నిట్లనిరి:- "ఓ అశ్వత్థ వృక్షరాజమా! నీవు వృక్షము లన్నిటిలో శ్రేష్ఠమవు. భగవద్విభూతివి అందఱును నిన్నుఁ పూజించెదరు. మేమును నిన్నుఁ పూజించెదము. కాని నీవు మా ప్రాణధనమగు శ్యామసుందరుని జాడను జెప్పవలయును మా నంద నందనుఁడు మమ్ములను వదలి యెచ్చటికిఁ బోయి నాఁడో చెప్పుము. ఆతని యుదరాకృతి నీ పత్రమునకుఁ బోలియున్నది."

రావిచెట్టు వారికిఁ బ్రత్యుత్తర మీయకుండిన, వారు వటవృక్షము కడకుఁ బోయి, దానితో నిట్లనిరి:-"ఓవటమా! నీ జడము సువృత్తము. నీ ఫలములవలె శ్యామసుందరుని యెఱ్ఱని అధరోష్ఠము కలదు. నీ కోమల పల్లములవలె నాతని చరణతలమును, గరతలమును నున్నవి, నీవలెనే ఇదియును త్రితాపహారమే. ఆతని జాడ నీకు దెలిసినచోఁ జెప్పుము." దాని వలనను సమాధానము రాకపోఁగా వా రామ్ర వృక్షము కడకుఁబోయి యిట్లనిరి:- "ఓ రసాలమా! నీవు

రస సముద్రమవు, నీ ఫలము లన్నిఫలముల కంటెను శ్రేష్ఠ ములుగ నెన్నఁబడుచున్నవి. నీకీ మాధుర్యము తప్పక నంద నందనుని అధరామృతముచేఁ బ్రాప్తించి యుండవచ్చును. శ్యామసుందరుఁడు తన ప్రణయ మందహాసమయ స్వరూప ముచే మా చిత్తముల నన్నిటిని హరించి చాతుర్యముగఁ బోయినాఁడు. మేమందఱ మాతని నన్వేషించుచున్నాము. నీ వాతని జాడను జెప్పినచో మేము నీకు జన్మ జన్మాంత రముల వఱకును ఋణపడియుందుము. దానివలనఁ బ్రత్యుత్త రమును బొందక వారు మరల పూరుగుచెట్టు కడకుఁబోయిరి. అచ్చటను బ్రత్యుత్తరమును బొందక ఇతర వృక్షముల నడుగఁబోయిరి.

అశోకము కడకుఁబోయి వారిట్లనిరి:- "అశోకమా! నీవందఱ శోకములను హరించు దాసవని విందుము, మా శోకమునుగూడ హరించుము. మాకు మదనమోహనుఁడగు మాధవుని జాడను దెలుపుము. ఆతనితో మమ్ములను గలుపుము. అంత బిల్వముతో నిట్లనిరి:- "ఓ బిల్వమా! నీయందు లక్ష్మీదేవి నివసించుచుండును. కమలనుబొందుటకై కమలాకాంతుఁడు నీ నీడలోనికి వచ్చి దాగలేదుకదా! నీవు మాకాతని జాడను దెలుపుము. మే మాతనితో మాట లాడము. ఆతని పనులలో జోక్యమును గలుగఁజేసికొనము.

కేవలమొక్క క్షణకాలము కన్నులారఁ జూడఁ గోరు చున్నాము."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఎంతవఱకుఁ జెప్పఁగలను? వనములో వారేవృక్షము నెదుటఁగాంచి నను దానికి దండప్రణామ మాచరించి, అత్యంత స్నేహ దరములతో దానిని శ్యామసుందరుని జాడ నడుగుచుండును. వృక్షములేమి జవాబులీయఁగలవు. వాని వలనఁ బ్రత్యుత్తర మును బొందక ముందునకుఁ బోయిరి. న్యగ్రోధ, కురవక, నాగ, పున్నాగ, మరువక, హరిత, తాంమ్రడ, ఆమలక, పొగడ, నింబ, పనస, జంబు, జామ, పిప్పల, కోవిదార, పున్నాగ, పారిజాత, అర్క ఖర్జూర, వేణు, మొదలగు వృక్షములను వేలు వేలుగా వేణుగోపాలుని జాడ నడుగు చుండిరి. ఇందులో నెవరును బ్రత్యుత్తర మీయకపోఁగా వారి మనస్సులలో నొకభావము పెల్లుబికెను:- "ఈ వృక్షము లన్నియును బురుష వాచకములు, ఈ పురుషులు మిక్కిలి నిష్ఠురులుగ నుందురు. చూడుఁడు, శ్యామసుందరుఁడు మనల నెంతగా సుఖపెట్టి గడ్డిపోఁచలవలె వీడిపోయినాఁడు దయ స్త్రీల హృదయములలో నుండును. పరుల దుఃఖమును గాంచఁగానే వారి హృదయములు ద్రవీ భూతములగును. పరోపకారము కొఱకు సర్వస్వమును త్యజించు పాఠమును

స్త్రీ జాతి మాత్రమే నేర్చుకొన్నది. రండీ లతలను ప్రియత ముని జాడను గూర్చి యడుగుదుము. అని యిట్లాలోచించు కొని ఆ లతల తోడను. స్త్రీ జాతి పాదపములతోడను ప్రభుని జాడనుగూర్చి యడుగుచుండిరి.

---

# శ్రీకృష్ణుని జాడ లతాపత్రాదుల నడుగుట

౯౭౪

శ్లో॥ మాలత్యదర్శి వః కాచ్చి
న్మల్లికే జాతి యూధికే।
ప్రీతిం వో జనయన్ యాతః
కరస్పర్శేణ మాధవః॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౩౦ అ. ౮ శ్లో.

ఉ॥ నల్లనివాఁడు పద్మనయ నంబుల
వాఁడు కృపారసంబుపైఁ
జల్లెడువాఁడు మౌళిపరి సర్పిత
పింఛమువాఁడు నవ్వు రా

జిల్లెడు మోము వాఁడొకఁడు
చెల్వల మాన ధనంబుఁ దెచ్చెనో
మల్లియలార మీ పొదల మాటున
లేఁడు గదమ్మ చెప్పరే॥
శ్రీమదాంధ్ర భాగవతము.

ఓ భగవానుఁడా! నీవు బుద్ధి నీయఁదలఁచినచో మాకు నిత్యనిరంతరమును ధారాప్రవాహముగ నటవర శ్రీ చరణములందు మా బుద్ధి లగ్నమై యుండవలయును. మమ్ములను బుద్ధిహీనులగు నున్మత్తులనుగాఁ జేయఁ దలఁచినచో శ్రీకృష్ణ ప్రేమోన్మత్తులగా నొనర్పుము. ప్రభు ప్రేమోన్మత్తతలో నెంతటి ఆనందము కలదో, ఎంతటి ఆనందము కలదో దానిని సాంసారిక వ్యవహారికులగు చతుర పురుషులెట్లు తెలిసికొనఁగలరు. ఆహా! జడచేతనములందు తన యిష్టదేవత కనఁబడుచున్నప్పుడు, చరాచర, స్థావర జంగమ, జీవ నిర్జీవ భేదభావములు నశింపఁగా నా సమయమునఁగల ద్వంద్వాతీత స్థితిలో నెట్టి రసానుభూతి కలుగునో అనుభవ శూన్యులును, నీరసహృదయులగు వ్యక్తులెట్లు తెలిసికొనఁ గలరు? ఇవి రసమునకు సంబంధించిన విషయములు, రసికులే దీని నెఱుఁగఁగలరు.

సూతుఁ డిట్లనెను:-"మునులారా! ప్రేమోన్మత్తలైన నా వ్రజబాలలు వ్రజవిహారి నన్వేషించుచుఁ బాదపములను నాతని జాడనుగూర్చి అడుగ నారంభించిరి. వృక్షములు పరమ ప్రేష్ఠుఁడగు ప్రాణపతి జాడ చెప్పకపోఁగా వారు తులసీ సమీపమునకుఁబోయి యిట్లనిరి:- "కల్యాణీ! తులసీ నిన్ను హరిప్రియ యందురు. ప్రియుఁడు నిన్నత్యధికముగఁ బ్రేమించును. నీవును నాతని చరణముల నంటిపెట్టుకొని యుందువు. ఆతని కంఠము నంటుకొని యుందువు. శ్యామ సుందరుఁ డెచ్చటనైనను దాగియుండినచో నీకు తప్పక ఆతనిజాడ తెలిసియుండవచ్చును. నీవు మావద్ద దాచకుము. మా కాతని జాడను దెలుపుము. మా కాతని నొక్క సారి కేవల మొక్కసారి మాత్రము చూపింపుము. శ్రీకృష్ణ చరణ ప్రియా! నీవు మాయెడల సవతి మత్సరమును జెందకుము. మేము నీ స్థానమును లాగుకొనఁ దలఁచుట లేదు. మే మాతని దర్శన తృష్ణను జెందియున్నాము. ఆతఁడు కంఠమున నిన్ను ధరించి, వనమాలయొక్క దివ్య మకరంద లోభముచే నలువైపులను ఝుంకారమొనర్చుచుండు మధుకరములను గరముల వారించుచు నిప్పుడే ఆవశ్యమిటువచ్చి యుండవచ్చును.

చిన్న కృష్ణతులసి ప్రత్యుత్తరమేమియు నీయకున్న గోపికలు పరస్పర మిట్లనుకొనిరి:- "సోదరీమణులారా!

ఈచిన్నది మిక్కిలి చెడ్డది. ఇదియును గృష్ణప్రియయగుగృష్ణ తులసియే. ఇదియును దన ప్రియతముఁడగు గృష్ణునివలెఁ గఠోరమైనది. స్త్రీ జాతిలో నెన్ని సద్గుణములున్నను సవతి మత్సరమను నొక దుర్గుణము కలదు. నా ప్రియతముఁ డితరులతో నెవరితోడను బ్రేమాలాపమును జేయఁగూడదని యిది తలఁచుచుండును. ఈ తులసిని శ్రీకృష్ణుఁడు నెత్తి కెక్కించుకొనినాఁడు. దీనిమీఁద నెంతటి యాదరమో తెలియదు. ఆతని కేబదియాఱు పిండివంటలను బెట్టినను దులసి లేక కృష్ణుఁడొక్క గ్రాసమైనను ముట్టఁడు. తులసీ కానన మెచ్చటనుండునో నంద నందనుఁడు నిత్య నిరంతర మచ్చటనే నివసించును. కావున నాతఁడుండినచో నీ తులసీ వనమున నే యుండవలయును. ఎచ్చటనో యీ బృందావన నికుంజములలో నిచ్చటనే ఆతఁడు దాగియుండును. కాని యీ తులసి వలన జాడను దెలిసికొనుట చాల కఠినము, అసంభవము. పోవుదము. ముందునకుఁబోయి పుష్పించి, ఫలించిన నీ లతల నడుగుదము. ఏలననఁగా నివి యన్ని యును బరమ ప్రముదితములైనవి. ఆనందమగ్నములై పుష్పించియున్నవి. ప్రభువుయొక్క సుఖద సంస్పర్శ లేక ప్రాణికి ప్రసన్నత యుండదు. అని యిట్లాలోచించుకొని లతల సమీపమునకు వచ్చిరి.

మునుముందుగా వారు మల్లిక వద్దకుఁబోయి యిట్లనిరి:- "మల్లికా! నీవు స్త్రీ యెడల నన్యభావమును జెందవు కదా! అందఱియొక్క కేశపాశముల శోభమయముగఁ జేసెదవు. అంగన లందఱును నిన్నత్యధికముగ నాదరించెదరు. నిన్ను నెత్తికెక్కించుకొందురు. తమ తమ కుటిల కేశములందును ధమ్మిల్లములందునునిన్నుఁదుఱుముకొందురు. నిన్నుఁ గంఠహారముగ నొనర్చుకొందురు. నిన్నుఁ దన ప్రియను ప్రీతి పాత్రవని శ్యామసుందరుఁడును నిన్నుఁ బ్రేమించును. మమ్ములనందఱను నొంటరిగ వదలి శ్యామ సుందరుఁడు తన ప్రియతమను నొంటరిగఁ దీసికొని యిటు నుండి పోయినాఁడేమో మాకు జెప్పవలయును."

తెల్లమల్లె యేమియును బ్రత్యుత్తర మీయలేదు. అప్పుడు వారు పసుపుపచ్చని సువర్ణమల్లె వద్దకుఁబోయి యిట్లనెను:- "స్వర్ణమల్లికా! నీరంగు పూర్తిగా రాధికా శరీరవర్ణమువలె నున్నది. ప్రియా శరీర వర్ణ సాదృశ్యముచే శ్యామసుందరుఁడు నిన్నందఱికంటె నధికముగఁ బ్రేమించును. నీహారములను గంఠమందు మిక్కిలి యుల్లాసముతో ధరించెదరు. దానినిఁబట్టి నీవు రాధికకు సహచరివని తోఁచు చుండును. నీకు పక్షపాత మెవరి యెడలను లేదు. మా సౌభాగ్యమదము వలనను అభిమానముచేతను మదనమోహనుఁడు మా యెడల నలిగి మమ్ముల ననాథలగను, నిరాలంబ

లగను జేసి పోయినాఁడు. ఎచ్చటికి వెడలెనో ఒక్కరైనను మాకు జెప్పెడువారలు లేకుండిరి. నీకుఁ దెలిసిన మాకుఁ జెప్పుము.''

స్వర్ణమాలతియును మౌనము వహించి, మదనమోహనుని జాడను జెప్పకపోవఁగా నంత వారు మాధవీ లతా కుంజముకడకుఁ బోయిరి. మాధవిని సంబోధించి వారిట్లనిరి:- ''మాధవీ! నీవు మాధవునకుఁ బరమప్రియవు. అందువలన నీకు మాధవియను బేరు వచ్చినది. నీ కుంజములందు కేళి నొనర్చుట శ్రీకృష్ణున కత్యంతప్రియముగ నుండును. నీవు మాధవునకుఁ బ్రియమగు మాధవీలత వైనప్పటికిని మాకు నీయందు విశ్వాసము లేదు. ఏలననఁగా నీవు సదా రంగులను మార్చుచుందువు. నీకు పూవులు పుట్టునపుడు బాల్యకాలమున స్వచ్ఛముగను, శుభ్రముగను నుండును. యౌవన మద మెక్కఁగనే అవి యెఱ్ఱనివగును. పరివర్తన శీలుర యొక్కయు, స్థిరులు కానట్టియు వారి మాటలు నేమని నమ్మవలయును. ఇట్లనుకొని వారు ముందుకుఁ బోయిరి. ముందునకుఁ బోఁగానే వారు తెల్లని పూలతో నిండియుండిన మల్లికాలతను గాంచి, దానితో నిట్లనిరి:- ''మల్లికా! నీవు సర్వములకును నాశ్రయ మొసంగెదవు. భ్రమరములును నీకడకువచ్చి సుఖించుచుండును. ఇదిగో చూడుము, మేము

నిరాశ్రయులమై తిరుగుచున్నాము. మాపైఁ గృపను జూడుము. మాకు నంద నందనుని జాడను జెప్పుము."

మల్లిక వలన సమాధానము రాకపోఁగా నప్పుడు వారు చంపకము వద్దకుఁబోయి యిట్లనిరి:- "చంపా! నీవు మాకు దప్పక శ్రీకృష్ణుని జాడను జెప్పఁగలవు, ఏలననఁగా నీకు గృష్ణవర్ణమనిన గిట్టదు. అందువలన భ్రమరములు నీకడకు రావు, నీవు పక్షపాతము నొనర్పవు కదా! పీతచంపక వర్ణమువలె వృషభాను కుమారియగు రాధ శరీరముండును. ఆమె చీర నీలిచంపకమువలె నుండును. శ్యామసుందరుఁడామె నొంటరిగా దీసికొని మమ్ములను మోసగించి వనములో నెచ్చటికిఁబోయినాఁడో తెలియదు. నీ పుష్పములను దన ప్రియురాలినిఁ బ్రసన్న నొనర్చుటకుఁ గోసియుండినచో మాకుఁ జెప్పుము. మా కా మార్గమును జూపించుఁడు."

చంపకమును బ్రత్యుత్తర మీయకుండిన జాజిలత కడకుఁ బోయి యిట్లనెను:- "సోదరీ! జాజీ! మన యిద్దరి జాతి ఒక్కటే, నీవును స్త్రీ జాతియే, మేమును స్త్రీ జాతికిఁ జెందినవారమే మన కిద్దఱకును భేదమేమనఁగా నీవు వికసించి యున్నావు, మేము వాడిపోయితిమి. మదన మోహనుఁడు మాకు లభించినచో మేమును వికసించెదము. ఒక్కసారి అతఁడు మమ్ములను కౌఁగిలించుకొనినచో మే మానంద

పడెదము. ప్రియతముని ప్రేమాలింగనమునఁ గలుగు సుఖ మీ ప్రపంచమున నింక నే యితర సుఖములవలనను గలుగదు. మీరు వికసించియుండుటచే శ్యామసుందరుఁ డీ వైపునుండి పోవుచు నిన్ను స్పర్శించి యుండవచ్చు నను కొనుచున్నాము. ఏలననఁగాఁ బ్రియుని సుఖద కరస్పర్శను బొందిన శరీరము రోమాంచితమగును. దానిమీఁదఁ గంపము కలుగును. రోమములు నిక్కఁబొడుచును, హృద యమున నానందతరంగములు లేచును. నీలో మేమీ లక్షణముల నన్నిటినిఁ గాంచుచున్నాము. అవశ్యము తన ప్రేయసికి శృంగార మొనర్చుటకై నిన్నుఁ బుష్పములను యాచించియుండవచ్చును. నీవు సహర్షముగ నంగీకరించి నీ యంగముచే నాతని కోమల హస్తములను స్పర్శించి యుండవచ్చును.

జాజి లత యేమియును జెప్పకపోఁగా వారు యూథికా లతా సమీపమునకుఁ బోయి యిట్లనిరి:- "యూథికా! ప్రపంచములో నొక్కనిఁ బ్రేమించు నిద్దరు స్త్రీలు పరస్ప రము హృదయపూర్వకముగఁ గలిసికొనరు. కాని మేము నీలో దీనికి విపరీత భావమును గాంచుచున్నాము. మీ లత లకు విడదీయవలయునన్నను విడఁదీయఁజాల నంతగఁ గలిసి కొని యుండును. మధ్యలోఁ దెగిపోయినను బెనవేసికొనియే

యుండును. నీ వాసన ఉత్కటమునుగాదు, తీక్ష్ణమునుగాదు, మధురాతి మధురమగు మంద మంద సుగంధము. నీ హారములు ప్రియుల కత్యంత ప్రియములు. సాధారణముగ నీవు సదా పుష్పించియుందువు. నీలో మే మెన్నడును జూడలేదు సదా పచ్చగ నుందువు. నీ లత సుందరముగను, సఘనముగను, శీతలముగను, సుఖదముగనుండును. తన సఖలతోఁ గూడి శ్యామసుందరుఁడు నీక్రింద విశ్రాంతినిఁ దీసికొన లేదుకదా !''

యూథికయును మౌనము వహింపఁగా గోపికలు కరుణాభరిత వాక్కులతో సమస్త స్త్రీ పురుష వాచక వృక్ష, లతా, గుల్మాదులను సంబోధించుచు నిట్లనిరి:- ''ఓ యమునా తటవర్తులగు తరువరులారా ! పరోపకారము కొఱకు జీవించు పాదపములారా ! వాత శీతాతప వర్షముల నుండి రక్షించు వృక్షములారా ! మే మబలలము. నిరాశ్రితులము. ప్రియతమునిచేఁ బరిత్యజింపఁబడిన వారము. మీలో నెవరైన మా మీఁదఁ గృపను జూపుఁడు. దయఁ జూపుఁడు. అనుగ్రహింపుఁడు. మే మందఱమును జేతనాహీనులమైతిమి. మీలో నెవరైన మా శ్యామసుందరు నొక్కసారి చూపుఁడు. మమ్ము క్షణకాల మాతనితోఁ గలుపుఁడు. కాకున్న నాతఁ డే మార్గమునఁ బోయెనో ఆ మార్గమును మాకు జెప్పుము.''

సూతుఁ డిట్లనెను:- "మునులారా! లతావృక్షాదుల వలన భగవానుని జాడ యేమియును దెలియకపోఁగా గోపికలు నిరాశను జెందిరి. అప్పుడు వారు పృథివి నడుగ నారంభించిరి. వారు ధరణిని సంబోధించుచు నిట్లనిరి:- "ఓ వసుంధరా! నీవు సమస్త ధనములను ధరించెదవు. అందువలన నీకు వసుంధర యను పేరువచ్చినది. మా హృదయధనుని చరణములను నీవు నీ వక్షః స్థలమున ధరించెదవు. అందువలనఁ దృణరూపమున నీకు రోమాంచమైనది. నీవు పాతాళమునకుఁ బోయినపు డీ శ్యామసుందరుఁడే వరాహ రూపమును ధరించి, నిన్నుఁ దనమీఁదఁ గూర్చుండఁ బెట్టుకొని తెచ్చినాఁడు. అప్పుడు నీవు భయభీతవై ఆతనిని గాఢాలింగనము గావించుకొంటివి. ప్రియాలింగనమున నెంతటి ప్రమోదమున్నదో నీకుఁ దెలియును. వామనావతారమున నాతఁడే నీ శరీరము నొక్క పాదముచేతనే అణఁచి పెట్టినాఁడు. నీ వాతని ప్రియవు. నీ కఠిన వక్షఃస్థలమం దాతఁడు నిరావరణముగఁ దన యరుణ చరణములను నిస్సంకోచముగఁ బెట్టినాఁడు. నీవు వానినిఁ గృపణుఁడు ధనమును దాచుకొనునట్లు దాచుకొందువు. ఆతని చరణ కమలముల పావన పరాగముచే నీవు ధన్యవైతివి. మమ్ములను గూడ ధన్యల నొనర్పుము. మాకును ప్రియుని

జాడను దెలుపుము. ఆతఁడొంటరిగ లేఁడు. తన ప్రియురాలిని వెంటఁబెట్టుకొని పోయినాఁడు.''

పృథివి వలన నే విధమగు సమాధానమును బొందక వారటు నిటు జూడ నారంభించిరి. ఇంతలోఁ దమ ముందుగా బిత్తరి చూపులతో నుండిన హరిణములు తమ పతితోఁ గలిసి వచ్చుచుండుటను గాంచిరి. ఆ హరిణములను గాంచి వారిట్లనిరి:- ''సోదరీమణులారా! స్త్రీ జన్మనెత్తి మీరే కృతార్థులైతిరి. మీ రెల్లప్పుడును మీపతి వెంటనంటి పోవు చున్నారు. మీ పతి మిమ్ముల నెన్నడును, విడువఁడు. మాపతియగు శ్యామసుందరుఁడు మమ్ములను వీడి పోయి నాఁడు. మీ నేత్రములనుండి అనురాగ ముట్టిపడుచున్నది. దీనిఁబట్టి మీరు ప్రియాసహితముగ నీ దిక్కుగాఁబోయిన శ్యామసుందరుని మీరు గాంచినట్లున్నది. ఆతని ప్రాణప్రియ యొక్క కమల నయనములు మీ నయనములకు సరిపోలి యున్నవి. ఆతఁడీ దిక్కుకు వచ్చినాఁడనుటలో మా కా వంతయును సందేహము లేదు. ఏలననఁగాఁ దన ప్రాణప్రియ యొక్క అంగసంగముచే నామె కుచ కుంకుమ రంజితమగు కుందకళికా మాలాగంధము మనోహరముగ నిచ్చటికి వచ్చు చున్నది. ఈ గంధము తప్పక కులపతియగు కృష్ణుని కంఠ మాలదై యుండవలయును. మీరు మామీఁద దయచే వారి జాడను జెప్పవలయును.

ఇది విని శౌనకుఁ డిట్లనెను:- "సూతా! ఈ కృష్ణుని ప్రాణప్రియ యెవరు? ఈ గోపికలు మాటి మాటికి ఆమె నామమును నింత సంకేతముగ నేలఁ జెప్పుచున్నారు!"

సూతుఁ డిట్లనెను:- "శ్రీకృష్ణుని ప్రాణప్రియ రాధికాదేవి. శ్రీకృష్ణున కీమె ఆహ్లాదినీశక్తి, శ్రీకృష్ణుని సమస్తాహ్లాదమును, రాస, విలాసాది సర్వసుఖముల కీమెయే కారణము. శ్రీకృష్ణుఁడీమె సంకేతముచే నాట్యమొనర్చును. వ్యాసభగవానుఁడు శ్రీ మద్భాగవతమందు ఈమె నామ మును స్పష్టముగఁ జేర్కొనలేదు."

శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! ఈ రాధికాదేవి యెవరు? ఎవని పుత్రిక శ్రీకృష్ణునితో నీమెకు గల సంబంధ మేమి? ఇంతవఱకు నీ వీమెనుగూర్చి చెప్పనేలేదు. వ్యాస భగవానుఁడు శ్రీ మద్భాగవతమం దీమె నామమును స్పష్ట ముగ నేలఁ జెప్పలేదు. దయతో ముందుగా మా యీ ప్రశ్నలకుఁ బ్రత్యుత్తర మొసఁగి తర్వాత కథను జెప్పుము."

ఇది విని సూతుఁడు గంభీరుఁడై యిట్లనెను:- "స్వామీ! రాధా తత్త్వ మతి గంభీరమైనది. దీనిని శుక సనకాదులను, శేష, శారద, నారద బ్రహ్మాదులును జేయఁ జాలరు. ఇవన్నియును జాల రహస్యమయములగు విషయ ములు. అందఱకును జెప్పఁదగినవి కావు. శాస్త్రకారులు

మిక్కిలి కౌశలముగను; బరోక్షముగను, నీ విషయములను వర్ణించిరి. నేను యథామతిగను యథాశక్తిగను నత్యంత సంక్షేపముగ మీ ప్రశ్నలకు సమాధాన మొసంగెదను. మీరు దత్త చిత్తులరై శ్రవణ మొనర్పుడు.

---

# రాధ — రాస
## శ్రీ రాధ
(౯౭౫)

శ్లో॥ అప్యేణ పత్న్యుపగతః ప్రియయేహ గాత్రై
స్తన్వన్దృశాం సఖి సునిర్వృతి మచ్యుతోవః।
కాంతాంగ సంగ కుచ కుంకుమ రంజితాయాః
కుందస్రజః కులపతేరిహ వాతి గంధః॥

(శ్రీ) భాగ. ౧౦ స్కం. ౩౦ అ. ౧౧ శ్లో॥

క॥ తరుణీ కుచ కుంకుమ యుత
హరి కంధర దామ గంధ మడరెడుఁ జూడ్కుల్
హరిఁ గనిన పగిదిఁ దనరెడి
హరిణీ హరిజాడఁ బుణ్యమయ్యెడిఁ జెపుమా॥

(శ్రీ) మదాంధ్ర భాగవతము.

ప్రేమ మార్గమున నతి రహస్య విషయములు సంకేతముచేఁ జెప్పఁబడును. దేవతలును నోక్షప్రియులుగనుందురు. పైఁగాఁ బ్రేమ హృదయమునకు సంబంధించిన వస్తువు, మన మెవరినైనఁ బ్రేమించునప్పుడది అణఁగియో లేక కప్పఁబడియో యున్నంతవఱకు కన్నులతోడను, సైగలతోడను మాత్రమే జరుగుచుండును. అప్పుడే దానిలో నధిక స్వారస్యముండును. వాక్కులతో వ్యక్తమొనర్చ దానిలో నుండి స్వారస్యము బోవును. ప్రేమ చెప్పఁదగిన వస్తువు అనుభవమునకు సంబంధించినది. ప్రేమ నెవరును జెప్పరు. ఎవరినైన నీ ధనమెంత యని యడిగినచో, నాతఁడును తన ధనము నంతను జెప్పను. ఏదో విధముగఁ బొట్టఁబోసికొనుచున్నామనును, ఎవ్వఁడును దన తుచ్ఛ ధనమును గూర్చియే చెప్పఁడే. అట్టియెడల నేను ఫలాని వారినిఁ బ్రేమించుచున్నానని ప్రేమనుగూర్చి యెవఁడు చెప్పఁగలఁడు? లోకుల నడకను గాంచి ఊహించుచుందురు. ఒక్కొక్కప్పు డూహలు నిజమగుచుండును, కొందఱు మిథ్యానుమానముల లోనే పడిపోవుచుందురు. ఏలననఁగా ననుమాన మనుమానమే కాఁగలదు. బహుమూల్యములగు వస్తువుల నెవరును జెప్పరు. దానికంటెఁ దక్కువ మూల్యముగల వస్తువులను జూపి దీనికంటె బహుమూల్యమగు వస్తువున్నదని సంకేతముగఁ జెప్పుదురు. అది యే వస్తువో అది కేవలము

సంకేతమాత్రమే. రాస విలాసము లీలలలోఁ బ్రధానమైన వాఁడు శ్రీకృష్ణచంద్రుఁడు, శ్రీకృష్ణచంద్రుఁడు రాసను రచించినాఁడనుట సర్వత్ర ప్రసిద్ధమైనది. ప్రసిద్ధి శ్రీకృష్ణ చంద్రునిదే. కాని ఆతఁడే కాకిగా రమణమొనర్పఁగలఁడా? రాసేశ్వరి లేక రాసయెట్లు జరుగఁగలదు? బయటకుఁ బోయినచో నీతఁడెవని కుమారుఁడని అడుగుచుందురు. అందఱును దమ తండ్రిపేరును చెప్పుచుందురు. ఎచ్చట వ్రాసినను దండ్రిపేరును వ్రాయుదురు. తండ్రిపేరు నందఱు నెఱుఁగుదురు. కాని ఒంటరిగాఁ దండ్రి కొడుకును గనఁ గలఁడా? పుత్రోత్పత్తికి దల్లి దండ్రు లిద్దఱును అవసరము. తండ్రికంటెను దల్లి కధిక గౌరవముకలదు. కాని తల్లి పేరు గుప్తముగ నుండును. ఆమె నే కొందఱో యెఱుంగుదురు. వ్రాయువారు తండ్రిపేరునే వ్రాయుచుందురు; కాని నామము నందఱు నూహించెదరు.

సూతుఁ డిట్లనెను:- "మునులారా మీరు నన్ను రాధికాదేవి విషయమునఁ బ్రశ్నించితిరి. వ్యాస భగవానుఁడు సమస్త భాగవతమునందు రాధాదేవిని గూర్చి స్పష్టముగఁ జెప్పలేదు. కేవలము సంకేతముగ వర్ణించియుండెను, మా గురుదేవుఁడగు శుకదేవుఁడును నెచ్చటను రాధికాదేవిని గురించి యుల్లేఖించలేదు.

శౌనకుఁ డిట్లడిగెను:- "అయితే సూతా! ఇదియే మాశంక ఏ తల్లి సంకేతమున శ్యామసుందరుఁడు నటించునో ఏ యమను నీవు రాజేశ్వరి యనుచున్నావో అట్టి ఆమె నామమును వ్యాసుఁడు స్పష్టముగ నేల నుల్లేఖింపలేదు?"

సూతుఁ డిట్లడిగెను:- "స్వామీ! నే నీ విషయమును జాలసార్లు చెప్పియున్నాను. ప్రేమలో భావగోపన మెంతగా నుండునో అందులో రసమంతగా వృద్ధియగును. 'కాచిత్' అనియే వ్యాసుఁడు సంకేత మొనర్చినాఁడు. ఆ యా కథనములకు వేలు వేలు ప్రణాళికలుండును. వ్యాసుఁడు శ్రీ రాధికా విషయమునే కాదు. లలితా, విశాఖాది సఖుల నామముల నెత్తనే లేదు. వర్ణనమంతయును 'నొకర్తుక'యని మాత్రమే చేసినాఁడు. ప్రియా, ప్రేయసీ, గోపి మొదలగు నామములను బలికియే రాధా విషయ ముల్లేఖించినాఁడు."

శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! ప్రియా, ప్రేయసీ యనిన రాధ యని యేల భావింపవలయును? ప్రియా, ప్రేయసీ ఇంకొక గోపిక అయియుండవచ్చును."

సూతుఁ డిట్లనెను:- "స్వామీ! ఇంకెవరైన నెట్లు కాఁగలరు? పంకజ శబ్దమున కర్థము బురదలోనుండి పుట్టినదని. బురదలోనుండి జలగయును బుట్టును, వానపామును బుట్టును. వీనినిఁ బంకజమునరు. ఏది యే యుద్దేశ్యములో

వ్యవహరింపఁబడునో అది అట్లర్థమగును, శ్రీ రాధికోపనిషత్తులో రాధికకు సర్వప్రధానమైన నామములు ఇరువదేడు చెప్పఁబడినవి. వానిలో నామె కొకనామము 'గోపి' యనియును గలదు.

శ్లో॥ వృషభాను సుతా గోపీ మూల ప్రకృతీశ్వరీ
గాంధర్వా రాధికా రంభా రుక్మిణీ పరమేశ్వరీ॥

—రాధికోపనిషత్.

ఇది కాక రాధికా దివ్య సహస్ర నామములలోఁ ప్రేయసీ' ప్రేమకామినీ, అను నామములు రాధ కొఱకై వాడఁబడినవి, ఈ నామము లేభాగవతమందు వాడఁబడినవి.

శ్లో॥ ప్రేమకలా పరాభద్రా ప్రేయసీ ప్రేమకామినీ।
ప్రభావతీ చ ప్రేమాంగీ పరా చ పరదేవతా॥

—శ్రీ రాధా దివ్య సహస్రనామ స్తోత్రము.

ఇదిగాక వ్యాసభగవానుఁడు కేవలము భాగవతమునే కాదు రచించినది. ఇంకనూ బదునేడు పురాణములు రచింపఁబడినవి. ఉపపురాణములును నాతనిచే రచింపఁబడినవే. సాధారణముగ నీ పురాణము లన్నిటియందును రాధికా చరిత్రము విస్తారముగ నున్నది. గర్గసంహిత, బ్రహ్మవైవర్త పురాణము, పద్మపురాణము, స్కంధ

పురాణము, ఇంకను నితర సమస్త చిన్న పురాణములందును గొన్నిచోట్ల సంక్షేపముగను, గొన్నిచోట్ల విస్తారముగను శ్రీ రాధికా చరిత్ర వర్ణనము కలదు. శ్రీమద్భాగవత మందా ధనము నీవిధముగఁ దాచఁబడినది. చదువుట, అందఱును జదువవచ్చును, కాని దాని గూఢ రహస్యమును నెవనో జ్ఞానులును భగవద్భక్తులును మాత్రమే తెలిసికొన వలెను. ఇతర పురాణములలో స్పష్టముగ వర్ణనముకలదు. కాని యిచ్చట బీజక రూపమున దాచియుంచినాఁడు. ఆ బీజకము నందఱును జదివెదరు కాని దాని రహస్యమును దెలిసికొనఁజాలక ఆ సుఖమునకు వంచితులగుచుందురు. ఏ కొందరో అనన్యోపాసకులు దానిని బయటపెట్టి దాని రహస్యమును చెప్పినప్పుడు దాని రసాస్వాదన మొనరింప వచ్చును.

శౌనకుఁ డిట్లడిగెను:- "గూఢ బీజకమన నేమి? సూతా! ఈ విషయమును స్పష్టముగఁ చెప్పవలయును."

సూతుఁ డిట్లనెను:- "స్వామీ! వ్యాపారులవద్ద ముఖ్యముగ మూఁడు ప్రధానమగు పుస్తకములుండును. ఒకటి ఖాతాపుస్తకము, రెండవది ఆవర్జా పుస్తకము, మూఁడవది బీజకము. ఖాతా పుస్తకములో నిత్యమును వచ్చు ఆదాయ వ్యయములు వ్రాయఁబడియుండును.

ఆవర్జాలో నెవరెవరి కెంతియిచ్చినది,ఎంత వచ్చినది ప్రత్యేక ముగ ఖాతాలుండును. ఎవరి లెక్కనైనఁ దీయఁదలంచినచో ఖాతా పుస్తకమునంతను దిరుగవేయవలసిన పనిలేదు. ఆవర్జాను జూచుకొనినఁ జాలును. మూఁడవది బీజకము. అనఁగా నే వ్యక్తియొక్క లెక్క యే పుటలో నుండునో ఒక అక్షరముండును. ఆ యక్షరమునకు సంబంధించిన వ్యక్తి లెక్క ఫలాని పుటలోనుండునని తెలిసికొనవచ్చును. ఈ విషయములో నేనొక దృష్టాంతము నొసంగి స్పష్ట మొనర్చెదను.

ఒక చాలగొప్ప కోటీశ్వరుఁడు భగవద్భక్తుఁడగు శెట్టియుండెడువాఁడు. అతఁడు పది పదునైదు లక్షలు విలువ కల సువర్ణ ముద్రలను బిందెలలోఁ బెట్టి నేలలోఁ బూడ్చెను. ఒక రాగిరేకుమీఁద దాని బీజకమును జెక్కించెను. వానిలో ముద్రలను నింపునపుడు తన పుత్ర పౌత్రులతో నిట్లనెను:- నేను గొంత ధనమును భూమిలోఁ బూడ్చితిని, దాని బీజక మిది. మీకు చాల అవసరమైనపుడును, భగవానుని పూజ బాగుగా జరుగనపుడును దానినిఁ ద్రవ్వవలయును.'' ఇట్లు చెప్పి శెట్టి పరలోకమునకుఁ బోయెను. అతని పుత్రుఁడు మిక్కిలి ధనికుఁడు. అందువలన నాతఁడా బీజకము వైపు దృష్టి నుంచలేదు, మందిరమున నెచ్చటనో బిందెలు

పూడ్చఁ బడినవని ఆతనికిఁ దెలియును. కాలాంతరమున వారు నిర్ధనులైరి. ఇప్పుడు వారి దేవాలయమందును విధ్యుక్తముగఁ బూజ జరుగుట లేదు. అప్పు డాతనికా బీజకము జ్ఞాపకమునకు వచ్చెను. తామ్ర పత్రముపై లిఖింపఁబడిన నా బీజకమును దీసెను. దానిలో నిట్లు వ్రాయఁబడినది - నాలుగు సువర్ణ కలశములు - దేవాలయపు శిఖరము, రామ నవమీ, సరిగా మధ్యాహ్న కాలమందు - పండ్రెండు గంటలకు ఇది యా బీజకము. దీని నాతఁడు చదివెను. దేవాలయ బురుజుమీఁద నచ్చటచ్చట నిటుకలను దీయించి వెదికించెను. నాలుగు బంగారు బిందె లెచ్చటను దొఱక లేదు. దేవాలయమునఁ ద్రవ్వించెను. అచ్చటను దొఱక లేదు. ఆతఁడు మిక్కిలి నిరాశను జెందెను. గ్రామములోని వారందఱును జదివిరి. కాని వారికిని దాని అర్థము తెలియ లేదు. శెట్టిగారియొక్క పౌత్రులును బుత్రులును నిరాశను జెందిరి. తమ తండ్రి యెచ్చటనో ధనమును బాతిపెట్టి యుండునను విశ్వాసమాతనికి గలదు. కాని ఆతఁడు మనము తెలిసికొనఁ జాలనట్లుగఁ బెట్టినాఁడు. పాపము వారు దుఃఖముతోఁ గాలమును గడుపుచుండిరి.

దైవ వశమున నొక మహాత్ముఁడటు వచ్చెను. దేవాలయముయొక్క యీ దుర్వ్యవస్థనుగని ఆతఁ డిట్లడిగెను:-

"అయ్యా! ఇది యెవరి మందిరము?"

జను లిట్లనిరి:- "ఇది ఫలాని శెట్టిగారి మందిరము. ఆతని వంశజులు నిర్ధనులైరి. వారు పూజను జేయింప లేకుండిరి."

మహాత్ముఁడు శెట్టిగారియొక్క పుత్రపౌత్రులను బిలి పించి యిట్లడిగెను:- "మీ రేల బాగుగాఁ బూజింప లేకున్నారు ?"

వారిట్లనిరి:- "స్వామీ! ఏమి చెప్పఁగలము. మా పొట్టయే నిండుటలేదు. బంగారుకు బట్టుకొనిన మట్టి యగు చున్నది. కాలము మారినది. మా పూర్వులు కొంత ధన మును పాతిపెట్టిరి. దాని బీజకము మావద్ద నున్నది. కాని ధన మెచ్చట నున్నదో మాకు జాడ చిక్కలేదు."

మహాత్ముఁ డిట్లనెను:- "మంచిది, ఆ బీజకము నిటు దీసికొనిరమ్ము."

మహాత్ముఁ డడుగఁగా నా బీజకము నింటిలోనుండి వారు తెచ్చిరి. మహాత్ముఁడు దానినిఁ జదివి దానిలోని రహస్యమును గ్రహించెను. ఆతఁ డిట్లనెను:- "మీకీ ధనము నుండి నాల్గవ వంతును దీసి భగవత్సేవలో వినియోగించినచో నేను మీ కా రహస్యమును జెప్పెదను."

వారిలోఁ బెద్దవాఁ డిట్లనెను:- "నాల్గవవంతు కాదు స్వామీ! దీనినంతను భగవంతునకు వినియోగింప

వచ్చును. నేలలోఁ బడియుండుటకంటె భగవత్సేవకు వినియోగపడుట ఉత్తమము కదా! మేము మా ప్రారబ్ధమును మే మనుభవించెదము. మా ప్రారబ్ధమున ధనమే యుండినచో మాకింత ధనమేల నాశనమగును ?''

గ్రామములోని పెద్దలును నచ్చటకుఁ జేరిరి. లభించిన ధనములో సగమును దీసికొని యీ శెట్టి వ్యాపారమును జేసికొనునట్లును, మిగిలిన సగమును భగవంతున కర్పించునట్లును నిశ్చయమయ్యెను.

ఈ నిశ్చయము కాఁగానే మహాత్ముఁ డిట్లనెను:- నే నిప్పుడే చెప్పను. ఆఱు నెలలు మీరందఱును గలిసి భగవానునిఁ బ్రేమపూర్వకముగ నారాధింపుఁడు. ఆఱు నెలలైన తరువాత నేను వచ్చి, దానినిఁ జెప్పెదను.''

మహాత్ముఁడు సౌమ్యుఁడు తేజస్వి, సత్యవాది, అందఱును విశ్వసించిరి. మహాత్ముఁడు వెడలిపోయెను. అందఱును నిదే యుత్సాహముతో నాఱు మాసములు ప్రతీక్షించిరి. మహాత్ముఁడు వచ్చిన నెల ఆశ్వీజ మాసము. ఆఱు నెలలైన తరువాతఁ జైత్రమున నాతఁడు మఱల వచ్చెను. ఈ వృత్తాంతము చాల దూరము వఱకును వ్యాపించెను. మహాత్ముని దర్శించుటకును, ఈ ధనముయొక్క విచిత్రమును జూచుటకును జాలమంది సమావేశమైరి. శ్రీరామనవమికి

మందిరమున గొప్ప ఉత్సవము జరిగెను. గడియారమునఁ బం|డెండు కొట్టఁగనే మహాత్ముఁడు బయటకువచ్చెను. మందిర విమానపు నీడ యెచ్చటఁ బడినదో అచ్చట నొక స్వస్తిక్ చిహ్నమును గీసెను. మహాత్ముడిట్లనెను:- "ఇచ్చట |దవ్వుఁడు" వెంటనే |తవ్విరి. |తవ్వఁగానచ్చట సువర్ణ ము|ద్రలతో నిండిన నాలుగు బిందెలు లభించెను. అందఱ ఆనందమునకు మేఱ లేకుండెను. అందఱును మహాత్ముని సిద్ధ పురుషుఁడనియు నంతర్యామి యనియుఁ జెప్పకొన నారంభించిరి.

మహాత్ముఁ డిట్లనెను:- "నేను సిద్ధుఁడను గాను, అంతర్యామినిగాను, నేను |కొత్త విషయము నేమియును జెప్పలేదు. ఈ బీజకములో నేమున్నదో దానినిఁ |బసంగాను సారముగ వ్యాఖ్యానించితిని. దీనిమీఁద |వాయఁబడినది - నాలుగు సువర్ణ కలశములు. మందిర విమానము, రామ నవమి సరిగా మధ్యాహ్నకాలమునఁ బం|డెండు గంటలకు."

నాలుగు సువర్ణ కలశములనుటచే నాలుగు సువర్ణ కలశములలో ధనమున్నదనుట స్పష్టము. మందిర విమాన మనుటచే మందిర విమానమున నీ నాల్గు బిందెలను వెదుక రాదు. దీని యర్థ మేమనఁగా మందిర విమాన చ్ఛాయ యెచ్చట బడునో, అది |శ్రీరామనవమి కావలయును,

సరిగా మధ్యాహ్నము పండ్రెండు గంటలు కావలయును, అచ్చటఁ ద్రవ్వినచో నచ్చట ధనము దొఱకుననుట నర్థము కలదు. అట్లు చేయఁగా సరిగా మందిర విమానము శ్రీరామ నవమినాఁడు పండ్రెండు గంటలకుఁ బడినచోట స్వస్తికము కనఁబడినది. ధనమును పూడ్చి పెట్టినది మీ పూర్వజులే. బీజకమందు దానిని గూర్చి వ్రాయఁబడియున్నది. కాని గుప్తముగ నున్నది. నేను గురుకృపచే దానినిఁ దెలిసికొని మీకుఁ జెప్పితిని. ఇందులో నేను క్రొత్త విషయమును జెప్పిన దేదియును లేదు.'' ఇట్లు చెప్పి మహాత్ముఁడు వెడలి పోయెను. శ్రేష్ఠిగారి పుత్రులు సగభాగమును భగవత్సేవకు వ్యయమొనర్చిరి. సగము ద్రవ్యముతో వ్యాపార మొనర్చు కొనిరి. అంత వారిది వఱకు వలెనే ధనవంతులైరి.

సూతుఁ డిట్లనెను:- ''మునులారా! సమస్త వేద పురాణములు వ్యాసమహర్షి ధనము అందువలననే సమస్త జ్ఞానమును వ్యాసోచ్ఛిష్టమని చెప్పఁబడినది. శ్రీమద్భాగ వతము సమస్త శాస్త్రములకును బీజకము. సమస్త పురాణ శాస్త్ర జ్ఞానమును సంపాదింపని వారును, అట్టి జ్ఞానులతో సాంగత్య మొనర్పనివారును దీని యథార్థ రహస్యమును దెలిసికొనఁజాలరు. దీనిలోఁ జాల విషయము లత్యంత గుప్త రూపమునఁ జెప్పఁబడినవి. వానిలో రాధా తత్త్వమొకటి.

ఎచ్చటను రాధికాదేవి పేరెత్తకయే సమస్త రహస్యమయ లీలలను సంకేత మొనర్పఁ బడినది.''

అంత శౌనకుఁ డిట్లనెను:- ''సూతా! మీ తండ్రి యగు లోమహర్షణుఁడు వ్యాసదేవుని కృపచే సమస్త పురాణములను బఠించినాఁడు. పైతృక ధనమువలె నది సమస్త జ్ఞానులవలనను, ఋషులవలనను సంకర్షణావ తారుఁడగు బలరాముని కృపచేతను నీకు ప్రాప్తించినది. కృపతో నీవు ఇతర పురాణముల ఆధారముచేత మాకు శ్రీరాధా తత్త్వమును విస్తారముగఁ జెప్పవలయును.''

ఇది విని సవ్యాచు సూతుఁ డిట్లనెను:- ''స్వామీ! శ్రీ రాధా తత్త్వమునుగూర్చి పూర్ణముగ నెవరు వర్ణింపఁ గలరు? శ్రీకృష్ణుని చరిత్రమును దెలిసికొనుటయైనను సంభ వమే, శ్రీకృష్ణునిఁ బొందుట యైనను సంభవమే కాని రాధా చరిత్రమును సమగ్రముగ శ్రీకృష్ణుఁడైనను దెలిసి కొనఁ జాలఁడు. సమస్త వేద పురాణములందును శ్రీ రాధా తత్త్వ వర్ణనము కలదు. వ్రజమండలి రసిక భక్తులు రాధా కృష్ణ కేళి, నికుంజ విహారములకు సంబంధించిన విషయము లనంతములు. ఇతర విషయములలో నింత సాహిత్య ముండదు. ఈ రహస్యమయ సరస లీలలు సరస భావలో వర్ణింపఁ బడినవి. వానిని వినుట కందఱకును నధికారము

లేదు. నేను యథామతిగ, యథాశక్తిగ నత్యంత సంక్షేప మునఁ బురాణములయొక్కయు, సాధు సజ్జనుల వాక్కు లందలి సారాతిసార భాగములను మాత్రము చెప్పెదను. మీరందఱును దత్త చిత్తులరై శ్రవణ మొనర్పుఁడు.

మునులారా! రమణము ఏకాకిగా జరుగదు. అస మాన శీలురకును జరుగదు. కావున భగవానునకుఁ క్రీడింప వలయునను గోరిక కలిగినప్పు డొక్కఁడు రెండుగ నగును. ఏలనఁగా శక్తి లేక యెప్పుడును నే విధమగు కార్యమును జరుగదు. శక్తిహీనుని శవమందురు. శక్తి సహితుఁడగు శివుఁడే శివుఁడు, ఎవఁడెట్టివాఁడగునో వాని శక్తియు నట్లే యుండును. ఏనుఁగు నందును జీమయందును జీవాత్మ ఒక్క టిగా నున్నప్పటికిని, ఏనుఁగు శరీరమున కనురూపముగ దాని శక్తి యుండును. చీమకు వేఱు విధముగ నుండును. భగవంతుని శక్తినే రాధ యనిరి. ఆమెను రాధయనుము, దుర్గయనుము, లక్ష్మి యనుము, సరస్వతి యనుము, సావిత్రి యనుము అంతయు నొక్కటే. భిన్న భిన్న రూపములందు భగవానుని భిన్న భిన్న శక్తులుండును. కొందఱామెను ప్రకృతి యను పేరఁ బిలుచుచుందురు. కొందఱు మాయ యందురు. వేఱు వేఱు లీలలందు వేఱు వేఱు నామరూపములు కలుగును. సాధారణముగ శక్తిమంతుఁ డెట్లుండునో

శక్తియు నట్లే యుండును. భగవానుని రూపము జగన్మో హానమైనపు డాతని శక్తియును జగన్మోహిని యగును. భగవానుఁడు రాసేశ్వరుఁడైనచో నాతని శక్తి రాసేశ్వరి యగును. భగవాను డచింత్య లీలామూర్తి. అట్లే రాధికా దేవి మహిమయు నచింత్యమైనది. భగవానుఁ డానంద స్వరూపుఁడు ఆమెయును నానందవర్షమును గురిపించును. ఇదే విధముగఁ బ్రపంచమునఁగల లీలయంతయును రాధికా లీలావిలాసమే, ఆమె శ్రీకృష్ణునకు భిన్నమైనది కాదు. కేవలము రసాస్వాదన మొనర్పుట కిద్దఱయ్యు నొక్కటిగనే యుందురు. ఒక కథ కలదు. గోలోకమునఁ గృష్ణునకు రాస మొనర్చుటకు సంకల్పము కలుగఁగా నాతని యిచ్ఛయే మూర్తీభవించి ఆతని వామ భాగమునఁ బ్రకటమయ్యెను. రాసలో నుత్పన్నమై తనకు శక్తిమంతునియొక్క సేవా నిమిత్తము ఆరంభ కార్యము నొసంగుటకై పుష్పములను గోయుటకై ఆమె ధావన గమనము లొనర్చుటచే నామెకు రాధయను పేరు వచ్చెను. లేక శ్రీకృష్ణుఁ డీమె నారా ధించుచుండును. ఈమె శ్రీకృష్ణు నారాధించుచుండును. ఈ కారణము వలనను నీమె రాధయని పిలువఁబడు చున్నది, రాధ యన్నను, రాధికా యన్నను, రాస యన్నను నొక్కటే. ఈమె ప్రకటమైనది రాస విలాసము కొఱకే. కావున నీమె రాసేశ్వరి యైనది. ఈమె క్రీడకొఱకై పుట్టినది

కావున నీమె క్రీడాప్రియ, నిత్యనూతనములగు లీలల నీమె తన శక్తిమంతునితోఁగూడి రచించుచుండును. ప్రధాన శక్తిమంతునియొక్క ప్రధాన శక్తి ద్వారముననే సమస్త శక్తుల వికాసము జరుగును. శ్రీ రాధికాదేవి రోమకూపము నుండి - అల్పశక్తి చేతనే - ఇతర గోపికలసంఖ్యాకము లుగ నుద్భవించిరి. వీరందఱును లీలలోఁ బ్రాదుర్భావ తిరో భావములను జెందుచుందురు. వాస్తవమున శక్తికిని, శక్తి మంతునకును భేదములేదు. నిత్యులు, శాశ్వతులు, వారి కావిర్భావమును లేదు, తిరోభావమును లేదు, ఉత్పత్తియును వినాశనమును లేదు, హ్రాసమును లేదు. ఉల్లాసమును లేదు, కణ కణ జలము వలనఁ జిన్న చిన్న జలరాశి యేర్పడునని అందఱకును దెలియును. గుంట, బావి, చెఱువు, నది వీని యన్నిటి యందును జలముండును. అన్నిటి చేతను దప్పిక తీరును, అన్నియును జీవములకు జీవము. కాని యీ జల మంతయును జలరాశియగు మహాసముద్రమునుండి వచ్చును. చివర కేదో మార్గమున వచ్చుటకే చేరును. అదే విధము గాఁ బ్రపంచమున మనకు గనఁబడు నానందరసము, ప్రేమ ఇది అంతయును శ్రీ రాధాకృష్ణ మహాసాగరములోని కొన్ని కణములకు సంబంధించినదే. ఆ దివ్యానందము దివ్య లోకమున నిరంతర ముప్పొంగుచుండును. అద్దానికి ఆద్యం తావసానములు లేవు. ఇట్టే అది తరంగాయుతమగును.

దివ్యలోకమున నిరంతరము రాసవిలాసము చేయు
గాఁ జేయఁగా రాధాదేవి మనస్సునందొక పుత్రునిఁ గనవలె
నను గోరిక కలిగెను. సమస్త కోరికలచేఁ బరిపూర్ణయగు
రాధికాదేవికి కోరిక యేల గలిగినది? నీవు 'ఏల' అను
ప్రశ్నను వేయకుము. క్రీడ కేవల మానందము కొఱకే
జరుగును. దీనికేమియు నన్యోద్దేశ్యముండదు. క్రీడలలోనే
యీ యిచ్ఛ కలిగినది. కోరిక కలుగఁగానే పుత్రుఁడు
కలిగెను. పరమ సుందరికి పుత్రుఁడు పరమసుందరుఁడుగఁ
బుట్టెను. ఒక దినమున నాతఁ డావులించెను. ఆతని కడు
పున బంచభూతములును,ఆకాశమును, పాతాళమును, వన,
పర్వత, వృక్ష, మహత్తత్వ అహంకార, ప్రకృతి, బురుషు
లందఱును గనఁబడిరి. ఆతని ముఖమున నీ గందర గోళ
మంతయును గనఁబడుటచే సుకుమారియగు రాధికాదేవికిఁ
జెడ్డగఁ నోఁచెను. ఎట్టి విరాట్ బాలకుఁడు కలిగినాఁడు!
ఆమె నార జలమునందాతని నుంచెను. ఆతఁడే విరాట్పు
రుషుఁడయ్యెను. ఆతని వలన సమస్త బ్రహ్మాండము లుత్పన్న
మయ్యెను. శ్రీకృష్ణు డిట్లు శాపమొసంగెను:- "ఇఁక నీకు
కొడుకు కలుగకుండునుగాక! నీవనపత్య మయ్యెదవు. అప్పటి
నుండి రాధికకు గృశోదరి యను పేరు వచ్చెను. ఆమె పొట్ట
యెన్నటికినిఁ బెరుగదు.

ఒక దినమున రాధికాదేవి శ్రీకృష్ణుని యెడల నలిగెను. "అలుగ నెందులకయ్యా?" మరల నెందులకను ప్రశ్నయే. అలుగుటయును నొకలీలయే. ప్రేమ కోపమున మిక్కిలి ఆనందము కలుగును. శ్రీకృష్ణుఁ డామె పాదమును బట్టుకొని బ్రతిమలాడెను. వినలేదు. విననేలేదు. అప్పుడు సుదాముఁడను గోపకుఁడిట్లు వచ్చిచెప్పెను:- "నీవేల నిట్లలిగెదవు? అయినదేమో అయినది. ఇప్పుడలుకను మానుము." నేఁడామె యింకొక లీల నొనర్పవలసియుండెను. సుదామున కిట్లు శాపమొసంగెను:- "నీవు భరతఖండమునకుఁబోయి అసురుఁడవు కమ్ము." తిరిగి ఆతఁడును నిట్లు శపించెను:- "నీవు భూమిమీఁద గోప కన్యవు కమ్ము." అప్పుడా రాధికాదేవి వృషభాను గోపకునకుఁ గీర్తి దేవియందు ప్రకటమయ్యెను.

శ్రీకృష్ణుఁ డవతరించుటకొక సంవత్సరము పదునైదు దినములు ముందుగా శ్రావణ శుక్లాష్టమీ దినమున గోకులమునకు సమీపమున రావలమునందు ప్రాదుర్భావమును జెందెను. రాధ లేకున్నచో శ్రీకృష్ణునిలో సగభాగము లేనే లేదు. దేవర్షియగు నారదుఁడు శ్రీకృష్ణుఁడు జన్మించినపుడు భగవద్దర్శన మొనర్ప వచ్చినపు డాతఁడిట్లనెను:- "వ్రజమందు గోలోక విహారి జన్మించినపుడు. అతని శక్తి గోలోక

విహారిణియు నవశ్య మేగోపకుని యింటిలోనో జన్మించి యుండవలయును. అని యనుకొని ఆతఁడు వృషభానుని భవనముసకుఁబోయెను. అచ్చట గోలోక విహారిణి యని రాధికాదేవిని స్తుతించెను. అప్పుడామె నిత్య కిశోరీ రూప మున దర్శనమొసంగెను. ఆమె పదునాల్గు వత్సరముల దివ్య సుకుమార అలౌకిక శోభాయుక్తయగు సుందరీదేవి యయ్యెను. దీనినిఁబట్టి ఆమె జన్మించుటయును, శిశు క్రీడ నొనర్చుటయును, కేవలము లోకులు సమ్ముఖమున యవనికా మాత్రమేనని గ్రహింపవలయును. వీరికి పెరుగుటయును లేదు, తరుగుటయును లేదు. వీరిద్దరును నిత్య కిశోరావస్థలో నుందురు. నిరంతరమును రాసవిలాసమందు మగ్నులై యుండుట వీరి పని సృష్టి, స్థితి, సంహారకార్యములను త్రిమూర్తులు నిర్వహించుచుందురు. అసుర సంహారాదులు విష్ణుని కార్యము శ్రీకృష్ణున కేకైక కార్యము తన శక్తితోఁ గూడి నిరంతరమును క్రీడ నొనరించుటయే. ఒక్కొక్కప్పు డా దివ్యలోకమున జరుగు లీల యీ మర్త్యలోకమునను జరుగుచుండును. ఆలోకమే ఉన్నదున్నట్లుగ నీలోకమునఁ బ్రకటమగును. ఆ ప్రకట లీలయును రెండు విధములుగ నుండును బాహ్యము - ఆంతరికమని, బాహ్యలీలలోను మూఁడు భేదములు కలవు. గోష్ఠలీల; వనలీల; కుంజలీల, ఆంతరికలీల, నికుంజలీల, దానిలోనికి సఖులందఱకును

ప్రవేశము లేదు. దానిలో అత్యంతాంతరంగిక సఖులు మాత్రమే పాల్గొనెదరు. మిగిలిన గోష్ఠ వనలీలలలో మహా భాగ్యశాలురగు గోపకులకును, గోపికలకును ప్రవేశము కలదు. అది జగత్తున కానంద వృద్ధినిఁ జేయును. వర్ణన మెచ్చట నున్నను బాహ్యలీలలను గూర్చియే యుండును. ఆంతరిక లీలలను గూర్చిన వర్ణనలు కూడ అల్పముగనో అధికముగనో ఉండును గాని అది గూఢముగఁ జెప్పఁబడును.

బ్రహ్మ వైవర్త పురాణమున నిట్లున్నది - నందుఁ డొక దినమున వనమునకు శ్యామసుందరునిఁ దీసికొని పోయెను. ఆ సమయమున రాధికా దేవి ఆతని సమీపమునకు వచ్చెను. ఆమె యీతనికి నిత్య శక్తియని నందుఁడు దివ్య దృష్టిచేఁ దెలిసికొనెను. అందువలన బాలకృష్ణుని రాధా దేవి కెత్తుకొనఁ నొసంగెను. ఆమె ఆతని గైకొని వనములోనికిఁ బోయెను. అప్పుడు భగవానుఁడు బాలరూపమును ద్యజించి నిత్యకిశోర రూపమును ధరించెను. బ్రహ్మ వచ్చి యిద్దరకును వైదిక విధిచే వివాహ మొనర్చెను. మరల భగవానుఁడు బాలకుఁడయ్యెను. మరల రాధా దేవి ఆతని నందున కొసంగెను. దీనివలన మనము నిర్ణయించుకొన వలసిన దేమనఁగా వీరిద్దరును నిత్య కిశోరులనియును, ఒకరి కొకరు

ప్రాణమనియే. వీరిద్ద రెన్నటికిని విడిపోరు. కాని కొంత కాలమునకు వీరిద్దరు నీ విషయమును మఱచిపోయిరి. 'సర్వశక్తిమంతులయ్యును నేల మఱచినారు ?'' తమ శక్తిచేతనే మఱచిరి. మఱచుటయును నాతని శక్తియే. ●దియును బ్రయోజన పడవలయును గదా! అతఁడు యోగమాయను మధ్యలో నిలువఁ బెట్టుకొనినాఁడు. ఏ లీల నొనర్చినను యోగమాయ నాశ్రయించియే చేయుచుండును. ఈ విధముగ శ్రీ నంద నందనుఁడును, ఆనంద కందుఁడునగు శ్రీకృష్ణచంద్రుఁడు నంద భవనమునందు బెరుగుచుండెను. వృషభాను నందినియు, సర్వేశ్వరియునగు శ్రీ రాధికాదేవి వృషభాను భవనమును బ్రకాశింపఁజేయుచు నందఱకును నానందము నొసఁగుచుండెను. ఈ విధముగ నామె అయిదారేండ్ల దయ్యెను. శ్యామసుందరుఁడు నాలుగైదేండ్ల వాఁడయ్యెను.

# ప్రథమ సమాగమము

శ్రీకృష్ణుఁడు గొప్ప పోకిరి. నవనీతమును దొంగిలించి తినుచుండును. గోపికలను మోసగించును. ఈ విషయము

వ్రజమందు సర్వత్ర వ్యాపించెను. రాధాదేవియు నీ సంగతుల నన్నిటిని వినుచుండెను. కారణ మేమియో గాని శ్రీకృష్ణుని నామమును వినఁగానే, ఆమె శరీరమునఁ బులకరించెడిది. ఆ నామ మామెకు మిక్కిలి ప్రియముగ నుండెడిది. శ్రీకృష్ణుని గుఱించిన చర్చ యెచ్చట వచ్చినను, ఆతని మీఁద లోభమును జెందిన నామె కర్ణములు మధులోలుపములగు భ్రమరములవలె నిక్కబొడుచుకొనును. 'కృష్ణ కృష్ణ' అను నామమెంత సుందరమైనది, ఎంత మధుమయమైనది, ఎంతటి శ్రుతి ప్రియమైనది! ఎంతటి సుఖదాయమైనది. ఒక్కొక్కప్పుడామె కదంబముపైనుండి వెలువడిన మధురమగు వేణు నాదమును వినుచుండును. వయస్సువచ్చిన గోపికలది శ్రీ నంద నందనుఁడూదుచుండిన వేణునాదమని పలుకుచుందురు!''

శ్రీ రాధాదేవియొక్క హర్షమునకు మేఱలేకుండెను. ఆహా! ఎవనినామ మింతటి సుందర మధుమయ నామమో ఆతఁ డింతటి సుందర వేణునాదమును గూడ వాయించునా?'' ఈ విధముగ నామె ప్రేమ వంశీధ్వనిని వినఁగానే ఇంక నధిక మయ్యెడిది. స్వాభావిక ప్రేమలో నవగుణములు కనఁబడవు. ప్రేమను గనుఁగొనుటకు స్థూలమగు గుర్తు యిదియే. ఎచ్చట నవగుణములు కనఁబడునో అచ్చట

ప్రేమ అభావమని గ్రహింపవలయును. ఇదే కాదు. ప్రేమలో నవగుణములును గుణములుగనే తోఁచును. గుణముల సంగతియేమి? ఒకానొక కృష్ణ భక్తుఁడు రామ భక్తునితో నిట్లనెను:- "నీవు శ్రీకృష్ణోపాసన మేలఁజేయవు? శ్రీకృష్ణుఁడు షోడశ కళాపరిపూర్ణావతారుఁడు. శ్రీరామ చంద్రుడు ద్వాదశకళా పరిపూర్ణావతారుఁడు." ఇది విని ఆ సాధువు ఉలికిపడి యిట్లనెను:- "ఏమంటివి? శ్రీరామ చంద్రుఁడు ద్వాదశ కళాపరిపూర్ణావతారమా? నేనింత వఱకు కౌసల్యాకిశోరుఁడును, దశరథ నందనుఁడనుకొని ఆతని భక్తినిఁ జేయుచున్నాను. ఇప్పుడు నీ నోట నాతఁడు అవతారమని వినఁగానే నాభక్తి యింకను నభివృద్ధినిఁ జెందినది. సారాంశ మేమనఁగా మదనమోహనుఁడు మనో హార మురళీ గానమొనర్పు చున్నాఁడని రాధిక కాతని యందాకర్షణము కలుగలేదు. ఆతని యెడల స్వాభావిక ముగ సహజప్రేమ కలిగినది. నామ శ్రవణముచే నది వృద్ధిఁ బొందినది. మురళీధ్వనిచే నది పరాకాష్ఠ నందుకొనినది.

ఒక దినమున యమునా తీరమునకు రాధాదేవి వచ్చెను. చిన్నదియు, అమాయకపు నైఖరి కలదియు, గౌర వర్ణము కలదియు, అతి సుందరియు, అర్ధస్ఫుటిత కళికా సదృశయు, నీలి చీరెను ధరించి, సిగ్గుపడుచుఁ దన శరీర

మును సంకోచింపఁజేసి కొనునట్లుగనుండి చాల అందముగ నుండెను. దైవవశమున నామె ఒంటరిగనే యుండెను. ఇంతలోనే శ్యామసుందరుఁ డచ్చటికి వచ్చెను. అయిదు సంవత్సరముల బాలకుఁడు పచ్చని పట్టు బట్టను గట్టుకొని, నడుమునకుఁ గట్టువైచుకొని, శిఖ పింఛమాళిధ్యై, చేత మురళిని ధరించి వృషభాను కుమారిక యెదుట నిలువఁ బడెను. రెండు రెండు కన్నులు కలిసి నాలుగయ్యెను. ఇద్దరును శరీరములను మఱచిరి. శ్యామసుందరుఁ డిట్లడిగెను:– "పిల్లా! నీవెచ్చట నివసించెదవు ?"

"నేను వృషభాను పురము (బర్సానా) నివసించెదను." అని వీణా వినిందిత స్వరమున రాధా దేవి యనెను.

"నే నిదివఱకు నిన్నెప్పుడును జూడలేదు. మీ తండ్రి పేరేమి ?" అని శ్యామసుందరుఁ డనెను.

సిగ్గుపడుచుఁ జకిత చకిత దృష్టులతో మదనమోహన ముఖారవింద మధువును దన కన్నులతోఁ బాన మొనర్చుచు వృషభాను కుమారి ఆతనితో నిట్లనెను:– "నేను నా తండ్రి పేరును జెప్పను. ఆతఁ డచ్చటి రాజు, ఎన్ను, సూర్యుల మీఁద నాకని నామము నను"

ఆశ్చర్యమును ప్రకటించుచు శ్రీకృష్ణు డిట్లనెను:- "ఓహో! నీవు వృషభాను కుమారివా? నీపేరు రాధ, రాధ కాదూ?"

ఒక అపరిచితుఁడు, ఆకర్షకుఁడగు నొకచిన్న వాని నోట తన నామమును వినఁగానే ఆమె హృదయమందు ఒక విధమగు చక్కిలిగింత కలిగెను. సంభ్రమముతో నామె యిట్లనెను:- "నీ వెవరవు? నాపేరు నీకెట్లు తెలిసినది,"

శ్యామసుందరుని అంతఃకరణ ముప్పొంగుటయే కాదు. ఆతని రోమ రోమములం దానంద ముప్పొంగుచుండెను. ముఖ మండలమున మోద కారణమున వికసితమగుచుండెను. తన మందహాస కిరణములను నాతని కపోలములయందుఁ బడిన కర్ణ కుండలము కాంతులలోఁ గలుపుచు మదన మోహనుఁ డిట్లనెను:- "నీరూపఖ్యాతి సమస్త వ్రజమండలమున వ్యాపించినది. నీనామము నెఱుఁగని అభాగ్యుఁ డెవఁడుండును? నాపేరు కృష్ణుఁడు. నేను నందరాజ కుమారుఁడను"

రాధాదేవియొక్క హృదయ మానందమున నుప్పొంగుచుండెను. ఆమె ఒకచేతితో నాలిని గట్టిగా నదుముకొనుచుండెను. తాఁ నంతరంగిక భావములను దాచుకొనుటకు సతతము ప్రయత్నించుచుండెను. ఆమె ఆలోచింపకయే

తనకుఁ దానే యిట్లనెను:- ‘‘ఓహో! నేను వినియున్నాను శ్యామసుందరుఁడు గొప్ప చోరుఁడని’’

నవ్వి శ్యామసుందరుఁ డిట్లనెను:- ‘‘నేను నీదేమి దొంగిలించితిని? నీవు గొప్ప యింటిదానవయ్యును నిట్టి చెడ్డ వాక్యములను నీ నోటఁ బలుకుచున్నావా? నన్ను దొంగ అనుచున్నావా?’’

అమాయకురాలును, సుకుమారియునగు రాజకుమారి భయపడెను. ఆమెకు తాను జేసిన పొరపాటునకుఁ బశ్చాత్తాపము కలిగెను:- ‘‘అయ్యో! నా నోటినుండి యిట్లు వెలువడినదేమి? ఈతఁడు చోరుఁడే. ప్రథమ దృష్టిలోనే నా మనస్సును హరించినాఁడు. కాని అప్రియసత్యమును బ్రకటింపరాదు.’’ ఆమె యేమియును మాటలాడఁ జాలక పోయెను. ‘‘నేను వెళ్ళెద’’నని ఆమె యనెను.

శ్యామసుందరుఁడు తికమకపడెను. ఇప్పుడు రసభంగ మయ్యెను. ఆతఁడు మమత్వమునంతను గ్రుమ్మరించుచు నిట్లనెను:- ‘‘ఏలఁబోవుచున్నావు? కొంచెము సేపుండుము. అన్యథాభావించితివా? నేను నవ్వులాటలకు పలికితిని. నిజమే, అందఱును నన్ను నవనీతచోరుఁడు, నవనీత చోరుఁడందురు. నే నేమియును దొంగిలింపకున్నను, ఎవరో యిట్టి మాటను

నీకుఁ జెప్పి అనిపించినట్లున్నావు. పోవుదము పద, కొంచెము సేపు యమునాతీరమునఁ గలిసి ఆడుకొందము.''

రాధికాదేవి మనస్సులో నిట్లనుకొనెను:- ''ఈ నంద కుమారుఁ డెంత ఆకర్షకమో అంత పోఁకిరి. ఎంత ప్రేమతో మాటలాడుచున్నాఁడు? ఆతని వాక్కులలో నెంతటి మోహకత కలదు?'' కాని ఆమె లజ్జావశమున శ్యాముని మాటలకుఁ బ్రత్యుత్తర మీయఁజాలకపోయెను. ఆమె యిట్లనెను:- ''మా అమ్మ కోపపడును. కావున నిప్పటికి నన్నుఁ బోనిమ్ము. మఱల నింకొకసారి వచ్చెదను.''

కృష్ణుఁ డిటు నటుఁ జూచి ఆమె నీలి పట్టుచీరెను బట్టుకొని యిట్లనెను:- ''నామీఁద ఒట్టు బెట్టుకొనుము మఱల వచ్చెదనని.''

రాధికాదేవి చీరెను విడిపించుకొనుటకుఁ బ్రయత్నమొనర్పలేదు. పెద్దవియు విశాలములునగు దన కాటుక కన్నులతో శంకిత దృష్టితో నిటు నటుఁజూచి యిట్లనెను:- ''వదలిపెట్టుము. వదలి పెట్టుము. నేను తప్పక వచ్చెదను.''

''సరిగా నిదే సమయమునకు రేపు వచ్చెదవా?'' అని శ్రీకృష్ణుఁడు పట్టుదలతో నడిగెను.

శంకిత చిత్తముతో రాధాదేవి యిట్లనెను:- ''రేపటి సంగతి నిప్పుడు చెప్పఁజాలను. నేను నీవలెఁ బిల్లవాఁడను

గాను, ఆడు పిల్లను తల్లి నడిగి, యెవరినైన వెంటఁబెట్టుకొని, యేదో నెపమునఁ రావలసియుండును.''

శ్యామసుందరుఁ డిట్లనెను: ''మీ మందయును, మా మందయును దగ్గఱ దగ్గఱగనే యున్నవి. మీ అమ్మతో నావులను పాలు పిండింపఁబోవుచున్నాననని చెప్పిరమ్ము.''

శీఘ్రముగఁ గిశోరి యిట్లనెను:- ''ఇప్పుడు నన్ను వదలి పెట్టుము. నీవు వీని నన్నిటిని నేర్పవలదు. నేనప్పుడు నాకు నేనే యేకోయుక్తి నాలోచించుకొందును.''

కృష్ణుఁడుఁ ఆమె నీలి చీరను లాగెను. ఆడు సర్పమువలె నామె జడ వ్రేలాడుచుండెను. ఆమె కుపితయై యిట్లనెను:- ''నీవు చాల పోఁకిరివే. ఇట్లు నీవు సరసము లాడినచో నేనింక రాను'' ఆతఁడు వెంటనే పొరపాటునఁ దన పీతాంబరమును నామెకుఁ గప్పెను. ఆమె ఆతనితో మాటలాడుచున్నను ఆమెకు శరీరముకాని, మనస్సుగాని స్వాధీనమున లేదు. అది నీలిపైఁటయో, పీతాంబరమో ఆమెకు గుర్తు లేదు. ఇచ్చట శ్రీకృష్ణుఁడును బుద్ధిపూర్వక ముగ నిల్లు చేయలేదు. రాధిక గబ గబ గోష్ఠము వైపునకుఁ బరువిడెను. శ్యామసుందరుఁడు కొల్లఁగొట్టబడిన వ్యాపారి వలె నట్టే నిలుచుండి ఆమె శోభను గాంచుచుండెను. ఆమె పూర్తిగాఁ గనఁబడకుండపోఁగానే సమస్తమును గోల్పడిన

వ్యాపారివలెఁ దిరిగి యింటికి వచ్చెను. రా.గానే తల్లి యిట్లనెను:- "ఓరీ! కృష్ణా నీవేదో ఆడపిల్ల పైఁటను గప్పు కొని వచ్చినావేమిరా? ఓరీ! పిచ్చివాఁడా! ఇప్పుడు నీవు పిల్లవాఁడ వాడపిల్లవైనావు!"

సూతుఁ డిట్లనెను:- "మునులారా! పురుషుని మనస్సున స్త్రీ చింతనము కలిగినప్పు డాత.డు తదాకార ముగ స్త్రీ రూపమును జెందును. ఇదే విధముగ స్త్రీ పురు షునిఁ జింతించినపుడామె పురుషరూపమును జెందును. దేవతలు కాక దేవపూజనము జరుగదు. మానవుఁడు దేనినిఁ జింతించునో ఆతఁ డా రూపమును జెందును. అందువలన రాధ శ్రీకృష్ణ చింతన మొనర్చుచు నాతని భావముల ననుక రించుటకుఁ బ్రారంభించెను. తన శరీరముమీఁద రాధ యొక్క పైఁటను గాంచఁగానే తల్లి యెదుటఁ గృష్ణుఁడు తికమకపడెను. ఆతఁడు మాటలను ద్రిప్పుచు నిట్లనెను:- "అమ్మా! నేఁడొక గొప్ప సంఘటనము జరిగినదమ్మా"

తల్లి ఆశ్చర్యముతో నిట్లనెను:- "ఏ సంఘటనము జరిగినదిరా నాయనా?"

ఆతఁడమాయకపు వైఖరినిఁ బ్రదర్శించుచు నిట్లనెను:- "మన పోట్ల ఆవు లేదూ, అది పొడువ వెంటఁబడినదే. అది ఒక పిల్ల పైఁట గుడ్డను గొమ్ములకుఁ దగిలించుకొని పరు

గత్తినదే. ఆ పిల్ల యేడ్వనారంభింపఁగా నేను నా పీతాంబర మును గప్పినానే. గోవునుండి తీసుకొని నేనీ పైఁటను దెచ్చి నానమ్మా! పోవుటను భయములేదు, నే నామె నెఱుఁగు దును. రేపే నే నామెపైఁట నిచ్చివచ్చెదను. నా పీతాంబర మును దెచ్చుకొనెదను.''

తల్లి యిట్లనెను:- ''మంచిపనిఁ జేసినావురా నాయనా! ఇప్పుడాడుపిల్ల కప్పుకొనెడు పైఁటను నీవేమి చేసెదవు తెచ్చి! మనవద్ద పీతాంబరములకుఁ గొదువలేదు. నీకుఁ గ్రొత్తదాని నీయఁగలను'' అని పలికి తల్లి యింకొక పీతాంబ రము నొసంగెను. శ్యామసుందరుఁడా పైఁటను ధనమును గృపణుఁడు దాచుకొనునట్లు దాచి సురక్షితమొనర్చెను.

ఈ విధముగనే ఆలస్యమగుటచే భయపడుచుఁ గీర్తి కిశోరియగు రాధ యింటిలోపలకు అడుగు పెట్టఁగానే, ఆలస్య మగుటచేఁ గోపమును జెందిన తల్లి కసరి యిట్లనెను:- ''ఏమి రాధా! నీవు బాగుగా స్వతంత్రురాలవైనావు. లోక లజ్జను విడిచివైచితివి. గొప్పయింటి పిల్ల యిట్లు ఒంటరిగాఁ దిరుగవలయునా? ఎవరైన నేమందురు? నావద్ద దాస దాసీ జనము లెవరును లేరు. నీవెచ్చటికి వెడలియుంటివి? ఎంత సేపైనది? ఇంతవఱకు కన్నము తినలేదు కదా!'' ఈ విధముగ నెన్నో మాటలు చాలసేపటి వఱకు తల్లి వాగుచుండెను.

రాధికా శిరస్సునఁ బీతపటమును జూడఁగనే ఆమె యింకను గ్రుద్ధ యయ్యెను. కసర నారంభించెను.

ఆ సమయమునఁ బెద్ద పెద్ద నేత్రములతో నశ్రువులను గార్చుచుఁ గోపముతో రాధిక యిట్లనెను:- "అమ్మా! నీవు నామాట విన లేదుకదా! నీవట్లే అఱచుచుంటివి. నాకేమి యును దెలియుట లేదు. నేను కారాగృహములో వలె నింటిలో బంధింపఁబడి యుండవలయునన్నమాట? ఇంతకు ముందే లలితతో నేను గోష్ఠము కడకు చూడఁబోయితిని. గోవులను జూచితిని. ఆవులను బాలు పిదికిన వారెవరును లేరు, పేడ తీసినవారును లేరు. గోవులక్రింద రొచ్చు రొచ్చుగ నున్నది. అచ్చటనుండి నేను యమునా తీరమునకుఁ బోయితిని. అచ్చటఁ జాలమంది గోపికలుండిరి. కొందఱు స్నానమాడుచుండిరి. కొందఱు నీరును దీసికొని పోవుచుండిరి. నేనును స్నానమాడితిని. స్నానమాడి నేను నా లంగాను ధరించుచుండఁగా నచ్చటికొక నల్లత్రాచు వచ్చెను. రాఁగానే అది నాదగ్గఱనుండిన నొక గోపికను దటుక్కునఁ గఱచెను. నేను భయపడి పరువిడితిని. కొంచెములోఁ దప్పినది. లేకున్న నది నన్నుఁగూడ కాటు వేసెడిదే. ఆగందరగోళమున నాపైఁట యమునలోఁ గొట్టుకొని పోయినది. ఆ గోపిక మూర్ఛితయై క్రిందఁబడినది."

తల్లియొక్క కోపమంతయును కర్పూరమువలె నెగిరి పోయెను. ఆమె యిట్లనెను:- "అమ్మా! తల్లీ! భగవానుఁడు నిన్ను రక్షించినాఁడే, ఆ గోపిక మరణించినదా? లేక బ్రదికియే యున్నదా?"

లోలోన నానందమును జెందుచు రాధ యిట్లనెను:- "వినవే అమ్మా! ఆ సమయమున నొక నల్లని పిల్లవాఁడచ్చటికి వచ్చినాఁడమ్మా! ఆతని నే నెఱుఁగను. ఆతఁడు నాయనగారి పేరును బలికి నాకు పైఁట లేకపోవుటచేఁ దన పీతాంబరమును ధరింప నొసంగినాఁడు. నేను దీసికొనలేదు; కాని అందఱు నిట్లనిరి:- "తీసికొనుమమ్మా! తీసికొనుమమ్మా! ఏమియును ఫరవాలేదు. ఈతఁడు నందకుమారుఁడు." అమ్మా! ఆ పిల్లవాఁడు చాల మాయలవాఁడు, మంత్రగాఁడు. ఆతఁడా గోపిక చెవిలో నేదో మంత్రము నూదెను. ఊదఁగానే లేచి నిలుచుండి నవ్వ నారంభించినది. నేను నారాయణుని కృపచేఁ దప్పించుకొని వచ్చితిని."

ఇది విని తల్లి రాధాదేవినిఁ బట్టుకొని గట్టిగఁ గౌఁగిలించుకొనెను. వడిలోఁ గూర్చుండఁబెట్టుకొని, ముద్దిడుకొని, శిరస్సునఁ జేతితో నిముఱుచు నిట్లనెను:- 'భగవానుఁడు చాల కృపఁ జూపినాఁడమ్మా! అమ్మా! నీ వచ్చటికిఁ బోయినావో నని నేను జాల భయపడితినే."

తల్లి తన కనుకూలముగ నుండుటను గాంచి రాధ యిట్లనెను:- "అమ్మా! ఆ నల్లపిల్లవాఁడెవరమ్మా! ఆతఁడు మాటి మాటికిని మాయింటికి ఆడుకొనరావలెను, మా యింటికి ఆడుకొన రావలయునని మాటి మాటికిని అడిగి నాఁడు. నే నేమియు ననలేదు."

తల్లి యిట్లనెను:- "వత్సా! ఆతఁడు నందరాజ కుమారుఁడు. ఆతనిపేరు కృష్ణుఁడు. ఆతఁడు చాల పోఁకిరి. యశోదారాణి నాకు వదినయే. అచ్చటికిఁబోయిన నేమి యును ఫరవాలేదు. అది మన యిల్లే. ఇప్పుడీ పీతాంబర మును నీవు పైఁట వేసికొంటివి. రేపాక క్రొత్తదాని నాతని కిచ్చిరమ్ము."

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఇచ్చటినుండి యే శ్రీకృష్ణప్రేమ ఆరంభమగును. అదియునుగాక యీ యిద్ద రికిని సనాతనప్రేమ కలదు. దాని కారంభమును లేదు, అంతమును లేదు; కాని లౌకిక దృష్టితో దీనిని బూర్వాను రాగమందురు. మునులారా! ఇప్పుడిఁక రెండు వైపులను బ్రతిదినమును గలియవలయునను నుత్కంఠచ్ఛ యుండెను. ఇద్దరును నిరంతరము కలియుటకును సమయ మెప్పుడా యని వెదుకుకొనుచుండిరి. ఎప్పు డవకాశము చిక్కినను నేదో నెపమునఁ గలియుచుండిరి. ఒక్కొక్కప్పుడు శ్రీకృష్ణుఁ

డనేక రూపములను ధరించి రాధాదేవియొక్క అంతః పుర మునకుఁ బోవుచుండెడువాఁడు. ఒక్కొక్కప్పుడు రాధయును ననేక రూపములను ధరించుచు శ్రీకృష్ణుని సంభ్రమమునఁ బడవేయుచుండును. స్నేహము వృద్ధియగుచుండెను. అది మాన రూపమును ధరించి, అదియే ప్రణయ రూపమునఁ బరిణతిఁ జెందెను. రాగ, అనురాగ, భావ, మహాభావములు ప్రేమకు క్రమ సోపానములు. రాధ శ్రీకృష్ణునకుఁ ప్రాణేశ్వరి, హృదయేశ్వరి. ఆమె లేక శ్రీకృష్ణుఁ డుండఁ జాలఁడు."



# నిరస్తసామ్యాతిశయ శ్రీరాధ

(౯౭౬)

శ్లో॥ నమో నమస్తేఽస్త్వృషభాయ సాత్వతామ్
విదూర కాష్ఠాయ ముహుః కుయోగినామ్।
నిరస్త సామ్యాతిశయేన రాధసా
స్వధామని బ్రహ్మణి రంస్యతే నమః॥

శ్రీ భాగ. ౨ స్కం. ౪ అ. ౧౪ శ్లో.

వ॥ మఱియు సజ్జన దురిత సంహారకుండును, దుర్జన నివారకుండును, సర్వరూపకుండును, పరమహంసాశ్రమ ప్రవర్తమాన మునిజన హృదయ కమల కర్ణికా మధ్య ప్రదీపకుండును, సాత్వత శ్రేష్ఠుండును, నిఖిల కల్యాణగుణ గరిష్ఠుండును బరమ భక్తి యుక్త సులభుండును భక్తిహీనజన దుర్లభుండును నిరతిశయ నిరుపమ నిరవధిక ప్రకారుండును నిజస్వరూప బ్రహ్మ విహారుండును నయిన యప్పరమేశ్వరునకు నమస్కరించెద.''

శ్రీమదాంధ్ర భాగవతము.

చరాచర విశ్వమున కేకైక స్వామియు, నెవని భ్రుకుటీవిలాసముచే నీప్రపంచమంతయును నేర్పడినదో ఆతనికి స్వకీయమేమి, పరకీయమేమి ? ఆతని కేదియును లేదు. అంతయును దనదే. స్వకీయమే, తన స్వధామమున నుండి ఆతఁడు క్రీడించుచుండును. రసమును వర్షించును. సుఖమును గలిగించుచుండును. తానే తరళమై రసరూపమును బొందును. దాని నాస్వాదించును. తన ప్రతిబింబముతోఁ గ్రీడించుటకుఁ దన ముఖము నలంకరించుకొనును. తన ముఖశ్రీనిఁ జూచుకొనును. దర్పణమున బ్రతిబింబించు నలంకారము చేసికొనినఁ దన రూపమును గాంచి ప్రీతినిఁ జెందును. ఆతనికిఁ బరకీయయును లేదు. స్వకీయయును లేదు. ఉభయభావ

రహితుఁడైన నాతఁడు సచ్చిదానంద రసరూపానందమునకు నియమము. నిఖిల గుణగణార్ణవుఁడు. భావరస సింధువు క్రీడా నిమిత్తమై ఆతఁడు సృజించుకొనిన శక్తులన్నియును స్వకీయములే. ధర్మావిరుద్ధ కామమునందు స్వకీయభావము సర్వశ్రేష్ఠమైనది. ధర్మ విరుద్ధకామమునందు బరకీయ భావ మత్యంతాకర్షకమును, బరమ సుఖకరముగను నెన్నఁబడు చున్నది. భగవానుని క్రీడలు ధర్మాధర్మములకు బరమై యుండును. అవి విరుద్ధ రసరూపానంద వర్షిణిగను, విమల ప్రేమ ప్రవాహినిగను నుండును. లౌకిక భావములతో వానికిఁ బోల్కి లేదు. ఉపమ లేదు. అయినను వాని వర్ణన మును లౌకిక భాషలో నొనర్పవలయును. కావున లౌకికో దాహరణము లీయఁబడుచున్నవి.

ప్రేమ యెంత రహస్యముగ నత్యంత ప్రతీసంతరము రహస్యమయ భావముతో నాస్వాదింపఁబడునో అది అంతటి ఆకర్షకముగను, చిత్తోల్లాసకారకముగనుండుట మనములోక ములోఁ గాంచుచున్నాము. ఎన్ని విఘ్నముల తరువాత సమాగమము జరుగునో అంతగా స్వారస్యము దానిలోఁ బెరుగును. తన గృహిణి తనదేకదా! ఆమెను బొందుటకుఁ బ్రయత్న మక్కఱలేదు. వీలులేకపోవుట యనునదియును లేదు; కాని పరకీయను బ్రేమించుటలో నెంతో ప్రతీక్షింప

వలసియుండును. నిరంతరము చిత్తములో నెంతో ఉత్కంఠత యుండును. ఈ యనుభవమును జారుడే పొందఁగలఁడు. 'పరకీయ భావములో నత్యంతాకర్షణము కలదు. కేవల మేతావన్మాత్రము చూపుటకై కొందఱు వైష్ణవులు రాధ ప్రేమలోఁ బరకీయభావమును గల్పించెదరు. ఈ విషయ మున నొక దృష్టాంతము కలదు. ఒక భగవద్భక్తుఁడుండెడు వాఁడు. ఆతని భార్య సతీసాధ్వి, పతిపరాయణ, ఒక దిన మున నామె యమునకు నీరు తెచ్చుటకుఁబోయెను. దైవ వశ మున నదే సమయమునకామె పతియును నేదో కార్య వశ మున యమునకుఁ బోవలసి వచ్చెను. నేఁడామె విచిత్ర శృంగారమును జేసికొనెను. దూరమున నుండి చూచుటచే నాతఁడామెను గుర్తింపఁ జాలకపోయెను. ఆతని మనస్సునం దత్యంత రూప లావణ్యవతియగు యువతినిఁ జూడవలయు నను నుత్కంఠేచ్ఛ కలిగెను. ఆతఁడామెను జూచుటకు శీఘ్రముగ ముందునకుఁ బోయెను. ముందునకుఁబోయి చూడఁగా నామె తన ధర్మపత్నియే. ఇది చూచి ఆతఁడు మిక్కిలి లజ్జితుఁడయ్యెను. ఆతఁడు తల వంచుకొని వెడలి పోయెను.

ఇప్పుడు మన మిచ్చట నీ భారము మీఁద విచారింప వలయును. ఉత్కంఠ పరకీయ మీఁదనే అధికముగ

నుండును. ఆ ఉత్కంఠ ధర్మపూర్వకమా అధర్మ పూర్వకమా అనునది మన ప్రాకృత జీవుల కే. అట్లుండవలయును. ప్రకృతికిఁ బరమైన లీలలోఁ బ్రేమధర్మ మొక విలక్షణ ధర్మము. పరకీయ భావముతో శ్రీ రాధాకృష్ణ కేళికా రసాస్వాదన మొనర్చువారి కైకైక భావము అత్యుత్కంఠా పూర్వకమగు నానందానుభూతియే. వ్యాసభగవానుసకును నింకొక అత్యుత్తమమగు నుదాహరణము కథాశ్రవణ మొనర్చువారల కిచ్చుటకు, దొఱకకపోఁగా నాతఁడును నిట్లే యనినాఁడు "స్త్రీయా విటానామివ సాధు వార్తా" జారులకు స్త్రీలకు సంబంధించిన విషయము లెట్లత్యంత రస వత్తరముగను, నాకర్షకముగను నుండునో అట్లే భగవద్భక్తులకు భగవల్లీలలు నిత్య నూతనములుగఁ గనఁబడును. ఇచ్చటఁ బరకీయవలస నత్యంతోత్కంఠతయుఁ దన్మయతతోఁ గూడిన రతిసుఖానుభూతి కలదు. అట్లుగాక శ్రీహరి చరాచర విశ్వమునకు స్వామియైనపు డాయనకుఁ బరులెవ రుండఁగలరు?

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఇప్పుడు రాధ యెడలఁ గృష్ణునకును గృష్ణుని యెడల రాధకును నిత్యనూతన మగు ననురాగము వృద్ధినిఁ బొందుచుండెను. ఈ ప్రేమ ప్రవాహము నిత్యమును వృద్ధినిఁ జెందుచుండును గాని

యెన్నడును తగ్గుట అనునది లేదు. ఎంతవఱకు పెరుగునో దానికి హద్దులేదు. ఆసీమ అనంతము, అపారము, అజ్ఞేయము. పెరుగుచునే యుండును. అట్లే పెరుగుచుండును. పెరిగిపోవుటయే దీని వ్యాపారము."

పట్టు పీతాంబరమును దీసికొని అమాయిక యగు రాధ చకిత చకిత దృష్టులతో నటు నిటుఁ జూచుచు నంద భవన ద్వారమున నిలువఁబడెను. ఇప్పుడామె దశ విచిత్రముగనుండెను. లోపలికి వెళ్లుటకు సంకోచము ఒకచెంప ఆపుచుండెను. చిత్తము లోపలికి బొమ్మని బలవంతమొనర్చుచుండెను. ఆ సమయమున శ్యామసుందరుఁడు తన తల్లితోఁ బ్రేమ కలహము నొనర్చుచుండెను. ఏదో విషయమున మారాము పెట్టుచుండెను. ఆతని మధుమయ వచనములు బయటకు వినిపించుచుండెను. ఆతఁడు వృషభాను కుమారి పాదముల చప్పుడు చేయక వినెను, లోభముచెందిన కర్ణములాతని మీఁదఁ దన్మయమగుటచే నిక్కబొడుచుకొని యుండెను. వెంటనే ఆమె ముఖమునుండి యిట్లు వెలువడెను:- "శ్యామసుందరా! ఇదిగో నీ పీతాంబరము."

శ్యామసుందరుఁడు నేఁడు ప్రాతఃకాలమునుండి హెచ్చరికతోడనే యుండెను. ఎందులకో చాలసార్లు లోపలికిని బయటకును దిరుగుచుండెను. ఒక అద్భుత పరమ స్రుత

మధుర శబ్దమును విని, సమస్తమును మఱచి ద్వారముకడకు పరుగెత్తుకొని వచ్చెను. అకాత్తుగా నాతనిఁగాంచి రాధ భయపడెను. ఆమె యిట్లనెను:- "ఇదిగో, నీ పీతాంబరము. నిన్న పొరపాటున వెళ్ళియుంటిని."

శ్యామసుందరుఁడు పీతాంబర వర్ణముగ నేయున్న నామె కోమలకరమును బట్టుకొని యిట్లనెను:- "ఇది నా పీతాంబరముకాదు."

అత్యంత లజ్జతో సుకుమారియగు గీర్తి కుమారి యిట్లనెను:- "అమ్మ పాతది తీసికొనిపోవు టెందులకు? క్రొత్తది తీసికొనిపోయి యిచ్చిరమ్మన్నది."

సంభ్రమముతో శ్యామసుందరుఁ డిట్లనెను:- "నీవు నిన్నటి విషయము మీ అమ్మతోఁ జెప్పినావా యేమి?"

వివశతాస్వరమున రాధాదేవి యిట్లనెను:- "నే నేమి చేయఁగలను? నిన్న పొరపాటున నీ పీతాంబరమును నా వెంట వచ్చినది. ఆమె అడుగఁగా నేను సత్యము చెప్పవలసి వచ్చినది. అబద్ధమెట్లు చెప్పఁగలను?"

శ్యామసుందరు డిట్లనెను:- "అయితే, నీవును మా అమ్మ దగ్గఱకుబొమ్ము, నీకును మాయమ్మ నూతన పైఁట నొసంగును."

పట్టుదలతో రాధ యిట్లనెను:- "లేదు, నేను లోపలికిరాను. నాకు చాల సిగ్గగుచున్నది. నన్నిప్పుడు పోనిమ్ము." ఇట్లు పలికి ఆ పీతాంబరమును కృష్ణునిపై విసరి పరువిడెను. శ్యామసుందరుఁ డామెను వెంటాడి పట్టుకొని బలవంతము చేయుచు నిట్లనెను:- "అట్లుకాదు, నామీఁద ఒట్టు. నీవు మా అమ్మ దగ్గఱకు రావలసినదే." పరవశయై హరిణము వలె రాధ నిలువఁబడెను. సంకోచముచే నామె అరుణకపోల మింకను నెఱ్ఱనయ్యెను. ఆమె లోపలికినిఁ బోఁజాలకుండెను, శ్యాముని వదలుటకు చిత్త మంగీకరించుట లేదు. చివరకు శ్యామసుందరుని ఆజ్ఞను దిరస్కరింపఁ జాలక పోయెను. శ్యాముఁడామె చేతినిఁ బట్టుకొని బలవంతముగ లోనికిఁ దీసికొనిపోయెను. ఆమె ఛాయవలె వివశయై లోపలికి పోయెను."

శ్యామసుందరుఁడు శీఘ్రముగ నిట్లనెను:- "అమ్మా! ఈమెయే ఆ పిల్ల. ఈమెయే నా పీతాంబరమును దీసికొని పోయినది. నేఁ డీమెతల్లి నా పాతపీతాంబరమునకు బదులుగఁ గ్రొత్తదియు, నందమైనదియు, సుందరమైనదియు, రత్నములు కూర్చిన పీతాంబరమును బంపినది. చూడు మెంత సుందరముగ నున్నదో" ఇట్లు పలికి శ్యామసుందరుని పీతాంబరమును దల్లి వడిలోనికి విసరివైచెను. తల్లి పీతాంబ

రమును జూడనైనం జూడలేదు. ఆమె దృష్టి పీతాంబరమును దెచ్చిన మేలిమి బంగారువలె మెఱయుచుండిన రాధికా ముఖారవిందమునందు లగ్నమయ్యెను. ఆమె రాధ సౌందర్యమును గాంచి మంత్రముగ్ధమై పోయెను. తల్లి వ్యంగ్య స్వరమున నిట్లనెను:- "అమ్మా! దీనినింబట్టి మీ అమ్మ రాణియనియు, నామెకు జాల ధన సంపత్తి కలదనియు, కాని భిక్షమెత్తుకొనువారి కీయవలయును. మీ అమ్మ వస్త్రమును బంపందలంచినచో నొక బండెడో, రెండు బండ్లో పంపిన బాగుండును. ఒక్క పీతాంబరము వలన మా కేమగును."

రాధికాదేవి తల్లిమాటలం కేమియును బ్రత్యుత్తర మీయలేదు. ఆమె సిగ్గుపడుచు భూమివైపునకు మెదలకుండం జూచుచు నిలుచుండెను! మధ్య మధ్య క్రీగంటితో యశోద చూడనట్లుగ నతి కౌశలముతోం జూచుచుండెను. పిల్ల మిక్కిలి సిగ్గుపడుచున్నదని యశోద తెలిసికొని యశోద లేచి ఆమెను బట్టుకొని గట్టిగం గాంగిలించుకొనెను. ముద్దు పెట్టుకొని తనవడిలోం గూర్చుండం బెట్టుకొని యిట్లనెను:- "మీ అమ్మ నాకొఱ కేమియును బంపలేదే మమ్మా!"

రాధాదేవి యశోద వడిలోం దలను వంచుకొని కూర్చుండెను. ఆమె తన విశాలములగు ఎఱ్ఱని చేతులతో

నామె గడ్డముఎత్తి యిట్లనెను:- "అమ్మా! నీ పేరే మమ్మా?"

రాధిక కంపిత స్వరమున సంకోచముతో మెల్లగ 'రాధ' అనెను.

'రాధా' 'రాధా' ఎంతమంచి పేరైయున్నది. ఎంతటి అమాయకపు పిల్ల" యశోద యీ మాటను దనకుఁదానే అనెను. ఆమె హృదయ ముప్పొంగుచుండెను. ఆమె యేదియో మాటలాడవలెననుకొనుచుండెను, కాని యేమి మాటలాడును? ఇవన్నియును నాలోచించుట కామెకు అవకాశము లేకుండెను. ఆలోచింపకయే నోట యేమివచ్చినదో దానిననెను:- "కీర్తిదేవి పిల్లవాని కొఱకు నూతన పీతాంబరమును బంపినది. దానినిఁ ద్రిప్పి పంపుట అపశకునము. ఇంటికి వచ్చిన లక్ష్మినిఁ ద్రిప్పిపంపుట ఉచితముకాదు." మరల లోలోపల నిట్లాలోచించుకొనెను:- "ఈమె నా కోడలైనచో నా జీవితములో నన్నియును సార్థకము కాఁగలవు. ఎంత విలక్షణమగు నందమైనపిల్ల. అమాయకపు పిల్ల." అంత రాధతో నిట్లనెను:- "మీ అమ్మ గొప్ప ఆట బొమ్మ! కాదమ్మా! ఆమె రాణి, కాని అమ్మా! చూచి నావా? ఆమె నీకుఁ దలనైన దువ్వి జడను వేయలేదు. రమ్మిటు తల్లీ! నీకు జడవైచెదను."

యశోదచే జడను వేయించుకొనుట రాధ కిష్టము లేదు: కాని యేమిచేయఁగలదు? పిల్లల కేమియును నభ్యంతరము చెప్పుట కధికారము లేదు. వారు అవుననవచ్చును లేక యేడ్వఁగలరు. ఆమె అవును కాదు అనకమునుపే యశోద ఆమె మేలి ముసుఁగును దొలిగించి జడను విప్పి; నూనెను, దువ్వెనను దెచ్చెను. ఆమె రాధను దన వడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని జడ వేయుచుండెను. ఆమె నూదును ముత్యములతో నలంకరించెను. ఫాలమున సుందరమగు నెఱ్ఱబొట్టును బెట్టెను. బహుమూల్యములగు వస్త్రాభూషణములను ధరింపఁజేసి, చేతులను జోడించుకొని భగవానునిట్లు ప్రార్థించెను:- "కీర్తికుమారి మా కృష్ణునకు భార్య కావలయును" ఇంతలోనే యింకఁగొందఱు గోపికలు వచ్చిరి. యశోద యిట్టి ప్రార్థనమును జేయుటను గాంచి వారందఱును నవ్వి యిట్లనిరి:- "నందరాణీ! నీవు సారెలను బంచను లేదు, విందులను జేయను లేదు. ఊరక శుష్కమగు మ్రొక్కులు మ్రొక్కకొనుచున్నావు. సంబంధమును గుదుర్చుకొనుచున్నావు."

నవ్వి యశోద యిట్లనెను:- "అక్కలారా! సంబంధము నెచ్చటఁ గుదుర్చుకొంటిని. మా కట్టి భాగ్యమెక్కడిది? పిల్లకాదు, లక్ష్మి ఈమె మా కోడలగుచో మా కృష్ణుని

భాగ్యము పండును. మా యీ నల్లని వానికిఁ బిల్ల నెవ రిచ్చెదరు ?''

వారిలో నొకకర్తృక యిట్లనెను:- ''కోడలు కొంచెము పెద్దది''

వారిలో నొక ధూర్త గోపిక యిట్లనెను:- ''బాగు న్నది. పెద్దకోడలుండిన అదృష్టము. ఈ కృష్ణుఁడు మిక్కిలి ధూర్తుఁడు. కోడలు పెద్దదైనచో నీతనిఁ జెవులు మెలివేయఁ గలదు.''

ఇది విని అందఱును బక పక నవ్విరి. శ్యామసుంద రుఁడు తన కేమియును దెలియని వానివలె నిలుచుండెను. రాధా దేవి యశోద వడిలో వివశయై కూర్చుండియుండెను.

రాధికా దేవి యిట్లనెను:- ''అమ్మ మిక్కిలి కోపపడఁ గలదు. ఆమె నన్నుఁ బీతాంబరమును ద్వరగా యిచ్చి రమ్మని పంపినది.''

యశోద బాలికయొక్క వివశత్వమును జాల సేపటి నుండి గమనించుచుండెను. ఆమె యిట్లనెను:- ''అమ్మా! నీవన్నము తిని పొమ్ము.''

సంపూర్ణ సాహసముతో వృషభాను కుమారి యిట్లనెను:- ''వద్దమ్మా! నే నేమియును దినను.''

పిల్ల యేమియును దినదని యశోద గ్రహించి ఆమెను బలవంతము చేయలేదు. ఆమెకు వడినిండ లడ్లు, నువ్వుల ఉండలు, మరమరాలు పెట్టెను. నిండు వడితోడను, నిండు హృదయముతోడను లేచి ఆమె పోవ నారంభించెను. యశోద యిట్లనెను:- "మరల రావలయునమ్మా! రోజును రావలయును దీనిని గూడ నీఇల్లుగా భావింపవలయును. నీవింతగా సిగ్గు పడెద వెందులకు నీ తల్లియగు కీర్తిరాణి యెట్టిదియో నన్ను నట్లే భావింపవలయును. మీ తల్లి నాకు వదినె మీతండ్రి నాకు అన్న కాని మీ అమ్మ ముసలిదైనది. ఏమమ్మా! మరల వచ్చెదవా? చెప్పుము."

అంగీకార సూచకముగఁ దలనూపి రాధ శీఘ్రముగఁ బోయెను. ఇప్పుడు కృష్ణుఁడేమి చేయవలయునో ఇంకను స్థిర మొనర్చుకొనలేదు. అప్పుడు యశోద ఇట్లనెను:- "కృష్ణా! పిల్లకు దారినిఁ జూపించిరమ్ము, దారి తప్పకుండఁచూడుము."

గ్రుడ్డివానికి రెండు కన్నులును వచ్చినట్లుండెను కృష్ణునకు. శ్యామసుందరుఁ డామె వెనువెంటనే పోయెను. వారిద్దరు నేమి మాటలాడుకొనిరో భగవంతునకుఁ దెలియ వలయును; కాని శ్యామసుందరుఁ డామెను ఆమె యింటి వఱకును బంపివచ్చెను. ఇప్పు డీ సమాగమ మొక మిద్దర హృదయములందును నుత్పన్నమయ్యెను. ఇద్దరకును నెనిమిది

జాములును నొక్కటేసని. రాధికాదేవి యెనిమిది జాము లును, అఱువది గడియలును కృష్ణునితోఁ గలియుటెట్లనియే చింతించుచుండును. రాధికాదర్శన మెట్లగుననియే సదా శ్యామసుందరుఁడు యుక్తుల నాలోచించుచుండును. వీరిద్దర వలన నెన్ని యగణిత లీలలు జరిగినదియు నది అపారమగు ననురాగ గాథ; ఎందఱో కవు లనేక విధములగు వర్ణనము లొనర్చియున్నారు, కాని అవన్నియును నసంపూర్ణములే, అల్పములే. మహా సాగరము నందలి అల్పబిందు మాత్రములే.''

---

# సంకేతము

ప్రేమ మార్గమున సంకేతమునకు గొప్ప మహాత్వ మున్నది. ప్రేమ భాష సంకేత లిపియందే వ్రాయఁబడునని చెప్పవలయును. సంకేతము ఇద్దఱు ప్రేమ మధ్యలో నను వాహకుని పనిఁ జేయును. అందువలన సంకేత పటము నంద గ్రామ బర్సానా (వృషభాను పురముః కు) మధ్యను గలదు. సంకేతము సైగలతోడను, కన్నులతోడనుఁ మాటలతోడను జరుగును. సైగలతోజరుగు సంకేతము స్వీకృతి, అస్వీకృతి రూపమున నుండును. కన్నులతో జరుగు సంకేతము అను

రాగకోపములతోఁ గూడియుండును. మాటలతో జరుగు సంకేతము, పోవుట, ఆగుట విషయములో నుండును. సంకేత శాస్త్రము గొప్ప గహనమైన శాస్త్రము. దాని వర్ణనములందు ఇది చదువఁదగినది, అనుభవ గమ్యమగు వస్తువు, ఈ మూఁటికిని వేలు వేలు ఉదాహరణముల నొసంగి, యీ విషయమును సమాప్తి గావింపవలయును. శ్యామసుందరుఁడు గోపకులతోఁ గూర్చుండి యున్నప్పుడు గోపికలు పెరుగు నమ్మఁబోయిరి. కృష్ణుఁ డందఱవద్దను బెరుగును బన్నుగఁ దీసికొనెడువాఁడు. అతఁడు తన యనురాగమును నందఱ ముందుఁ బ్రకటింపఁగూడదు. భావగోపనము ప్రేమ కాచ్ఛాదనము. శరీరమును వస్త్ర భూషణాదులచేఁ గప్పిన శోభగా నుండునో, అట్లే ప్రేమనుగూడ గోపన మొనర్చుట చేతనే వృద్ధిఁ బొందును. నిర్లజ్జవలన నశ్లీలత కలుగును. అందఱతోఁగలిసి రాధికయును బెరుగు నమ్మఁబోయెడిది. ఆమె పలికెడిదే కాదు. కృష్ణునివైపు చూడనే చూడదు. కృష్ణుఁడును నామె సఖితో మాటలాడెడువాఁడు. ఆ మాటల కేమియు నర్థముండదు. మాటలాడుట ఒకరితో మాటలాడును, వేరొకరి కర్థమగును. శ్యాముఁడు మాటలలో దగ్గఱ నిలుచుండిన రాధికతో సైగలతో మరలఁ దిరిగిరమ్మని చెప్పెను. దానితో విషయము సమాప్తమయ్యెను.

నేత్ర సంకేతమున రెండు రెండు నేత్రములు నాలుగు కాఁగాఁ జాల సంభాషణము జరుగును. దాని వ్యాఖ్య అసంభవము.

మాటలతో సంకేతమొక విచిత్ర పద్ధతిగ నుండును. అందఱు సమ్ముఖమునఁ గృష్ణుఁడు రేపు మధ్యాహ్నమున వంశీవటము కడకు రావలయునని సంకేతము కావింపఁబడును. నయనములతో రాధిక దాని కంగీకారమును సూచించెను. తెల్లవారులు వారిద్దఱకును నిద్రలేదు. ఎప్పుడు తెల్లవారునా అని అనుకొనుచుండును. కాని కలియుట సహజము లోక లజ్జను, సమాజ బంధనమును, ఇంటివారు చుట్టుకొని యుండుట వీని నన్నిటినిఁ జూచుకొనవలయును. లోకములో నుండి లోక వ్యవహారమును గూడ బహిరంగముగ నవహేళన మొనర్పరాదు.

రాధిక నేఁడు ప్రాతః కాలమున నుదయముననే లేచినది. తన ముత్యాలహారమును దీసికొని తన లంగాలో దాచుకొనెను. మాటి మాటికిని అంగణములోనికివచ్చి మరలఁగోపలకుఁ బోవును. ఇచ్చట వెదకును, అచ్చట వెదుకును. పక్క క్రిందఁ జూచును, మంచలఁ బఱచును. పక్కను గదిలించును.

తల్లి యిట్లనును:- "అమ్మాయీ! ఏమి వెదుకు చున్నావే?" ముఖమునఁ గపట భావమును ధరించుచు భయముచే నేమియును మాటలాడకుండును. కంఠము శూన్యముగ నుండుటనుగాంచి తల్లి యిట్లడుగును:- "నీ ముత్యాల హారమెచ్చటికిఁ బోయినదే? నిన్న సాయంకాలము నీవు ధరించుటను నేను జూడలేదే. భయముచేఁ జెప్పెడిది కాదు. "నిజము చెప్పవే, ఎవరికైననిచ్చి వచ్చితివా? లేక పాఱవైచితివా?"

రాధిక యేడ్పుముఖమును బెట్టుకొని - యిట్లనును:- "అమ్మా! నే నెవ్వరికి నీయలేదమ్మా!"

"ఈయక పోయినచో నెక్కడికిఁ బోయినది?" తల్లి కోపముతో గద్దించి అడిగెను.

రాధాదేవి కపట చింతా ముద్రను బెట్టుకొని కొంచెము సేపాలోచించుకొని యిట్లనెను:- "నిన్న నేను యమునానదికిఁ బోయితిని. అచ్చట నందఱును స్నానమొనర్చిరి. నేనును స్నానమొనర్చితిని. అప్పుడును నాకు గుర్తు కలదు. ఆ హారము నామెడలో నప్పుడున్నది. ఒక గోపిక తదేక దృష్టితోఁ జూచుచుండెను. అచ్చట నందఱు నుండిరి. అమ్మా! నీవు లలితా విశాఖలను నావెంటఁ బంపినచో నేను దానిని వెదకి తేఁగలను."

బహుమూల్య హారము కాఁబట్టి లలితావిశాఖలను వెంటనే ఆమె వెంటనే పంపెను:- "అమ్మా! అమ్మా! నేను కొంచెమాలస్యముగ వచ్చినను జింతింపకుము." అని పలికి వారు సంకేతము కడకుఁబోయిరి. నందభవనము ముందుగనే పోయిరి. "నందభవనము ముందుగా సంకేత మార్గ మెచ్చటిది? ఇది చుట్టు త్రోవ" ప్రేమమార్గము చుట్టు త్రోవగనే యుండును. దీని కెచ్చటను నిశ్చితమార్గము లేదు. దీనిలోఁ బ్రేమ మార్గము ననుసరింపఁడు. మార్గమే ప్రేమి ననుసరింపవలయును.

ఇచ్చట శ్యామసుందరుఁడు నేఁడు ప్రాతః కాలము నుండియే వ్యగ్రుఁడై యుండెను. ఎందులకో ఆతఁడు లోపలకు బైటకుఁ దిరుగుచుండెను. తల్లి వెంటనే వంటఁజేసెను. బలరామునిఁ బిలిచి యిట్లనెను:- "అన్నయ్యా! రమ్ము. నారాయణ భోగమైనది. ప్రసాదమును దినెదము."

బలరాముఁ డిట్లనెను:- "కృష్ణా! నాకీవేళ నింకను నాఁకలి వేయుట లేదు ముందు కృష్ణుఁడు తినినఁ తర్వాత నేను దినెదను."

కృష్ణున కందులో నిబ్బంది యేమి కలదు? ఆతఁడు గోప బాలురతో భోజనమును జేయఁ గూర్చుండెను. తల్లి

యిట్లనెను:- "కృష్ణా! భోజనమున కింతటి తొందఱ యేమయ్యా? మెల్లఁగాఁ గూర్చుండి తినుము."

ఇంతలోనే నందభవన ద్వారమున వృషభాను కుమారి, తన సఖియగు లలితను సంబోధించుచు నిట్లనెను:- "లలితా! కొంచెమాఁగవే. ఖదిర వనమునకు నేనును బోవలయును." ఈ శబ్దములను లలితతోఁ బలుకుచుండినను ఇందులో సంకేత నామము లేకున్నను, లోపల భోజనము చేయుచుండిన కృష్ణుని చెవులు బయటనే యుండెను. ఈ వీణా విసందిత వచనములను వినునప్పటికిని కృష్ణుఁడు తినుటను మఱచెను. నోటిలోఁ బెట్టుకొనిన ముద్ద నోటిలోనే యుండెను. చేతులు కడుగుకొని ఆచమనము చేయకయే పరువిడెను.

తల్లి యిట్లడిగెను:- "కృష్ణా! ఎచ్చటికిఁ బోవుచున్నావురా నాయనా? అన్నమును పూర్తిగాఁ దినవేమి? ఈ ఆతురత యెందులకురా?"

అత్యంత వ్యగ్రతను బ్రకటించుచు నంద నందనుఁ డిట్లనెను:- "అమ్మమ్మా! ఒక గొప్ప పని జ్ఞాపకమునకు వచ్చినదే"

తల్లి ప్రేమతో నిట్లనెను:- "వినరా, ఏమిపని, పనులను దరువాతఁ జేయవచ్చునులే, ముందుగా నన్నమును దినుము."

ఆతఁడు కోపముతో నిట్లనెను:- "నీకు అన్నము పట్టినది ఇప్పటికే చాల ఆలస్యమైనది. ఇంతకు ముందుగనే మన ఆవులు కట్టు వదిలించుకొని చేనిలోఁబడినవట. అవి పరువిడునప్పుడు గంతులు వేయును. నేను బోకుండిన వా రావులన్నిటినిఁ గొట్టెదరు."

ఇట్లు పలికి ఆతఁడు కఱ్ఱను, వేణువును జంకలో నిఱికించుకొని పరువిడెను. తల్లి యశోద వంటయింటినుండి లేచి నిలుచుండి యిట్లనెను:- "ఓరీ! వినుము. ఆవు లెచ్చటికినిఁ బోవులే, నీ వన్నమును దిని పొమ్ము."

దీని వినఁగిన గోపకులందఱును నవ్వు నాపుకొని యిట్లనిరి:- "అమ్మా! నీ వతనిఁ బోనిమ్ము. ఈతని యావు పోట్లది. ఈతఁడు పోక పోయినచో నది యెచ్చటికైనను బాఱిపోఁగలదు."

ఆ గోపకుల నందఱను గనుచుఁ గృష్ణుఁడు పరువిడి పరువిడి, అతి శీఘ్రముగ రాధతోఁ గలిసికొనెను. ఇది మాటల సంకేతము. మాటను జెప్పుట ఒకటి చెప్పుట యింకెవరితోడనో, అర్థమును జేసికొనునది ఇంకొకరు. దీని కింకొక ఉదాహరణమును గూడ జైకొనుఁడు."

యమునా తటమునఁ జాలగుంపు కలదు. స్త్రీలును, పురుషులును, బాలకులును, బాలికలును, యువతులును,

యువకులును, పెద్దలును జిన్నలును అందఱును గలరు. వృష భాను కుమారియును స్నానమొనర్చి పోవుచుండెను. ఇటు గోపకులతో నంద నందనుఁడును వచ్చుచుండెను. కులవతి యగు రాజకుమారి అందఱయెదుట కన్నులెత్తి చూడదు. ఆమె పోవుచు నిట్లు పిలిచెను:- "ఓసీ లలితా! ముందు పోయెదవేమే? సాయంకాలమునఁ దప్పక రావలయును." అచ్చట లలితయును లేదు, విశాఖయును లేదు. శూన్యమున నీ శబ్దముల నింకొకరి నుద్దేశించి పలికెను.

ఇచ్చట శ్యామసుందరుఁడు గ్రహించి యిట్లనెను:- "ఓసీ! మనసు గాని నీవు అనసన్నుడవైతివా? సాయంకాలమున నేనుతప్పక నీయింటికి వచ్చెదను." స్త్రీలును, బురుషులును, వృద్ధులును, బెద్దవారును నందఱును వినుచుండిరి. ఈతఁడు మన సఖునితోఁ జెప్పుచున్నాఁడా చెప్పుటలేదా యనునది విచారించుట కెవరి కవసరమున్నది? తెలిసికొనఁగల గోప బాలురు తెలిసికొని నవ్వి యిట్లనిరి:- "కృష్ణా! మన సుఖుఁ డివ్వేళ నిచ్చటికి రానే రాలేదు. సరే, మన సుఖుఁ డున్నాఁడులే." విది విని శ్యామసుందరుఁడు క్రుద్ధుఁడై యిట్లనెను:- "మీరందఱును ధూర్తులురా! పో పొండు" అందఱు నిండ్లకు వచ్చిరి. సాయంకాలమున నియత సమయ మునకు వృషభాను భవనమున నిద్దరకును సమాగమము జరిగెను.

ఈ విధముగ నాఱువైపులను బ్రతి దినమును సవాను రాగము వృద్ధిఁ బొందుచుండెను. ప్రేమను దాచుదమన్నను దాగదు. మనోభావము లెవరును జెప్పకయే వాయుమండలమున వ్యాపించును. గోపకులలోను, గోపికలలోను మెదలకుండ గుసగుసలు బయలుదేరెను. వృషభానులకును, యశోదా, కీర్తిరాణికిని నిరువైపుల ననురాగము వృద్ధిపొందుచున్న సంగతి తెలియక పోలేదు. వృషభానువకు నందుఁడు తనకు వియ్యాంకుఁడు కావలయుననియు, యశోదకు రాధ నాకుఁ గోడలు కావలయుననియు హృదయ పూర్వకముగఁ గోరుకొనుచుండిరి. ఇద్దరకును గట్నములు కానుకల విషయముకూడ ప్రయత్నము జరుగుచుండెను. పండ్లు పసుపునకు ముందు పంపఁబడు సారెలు మొదలగు నవియుఁ బంపఁబడెను. వృషభానుఁడు నందుని కంటెఁ గొంచె మెక్కువ ధనవంతుఁడని తోఁచుచున్నది. సాక్షాత్తు లక్ష్మియే ఆతనికిఁ బుత్రికగాఁ బుట్టఁగా నాతనికంటె ధనవంతు లింకెవరుండఁ గలరు? అష్ట సిద్ధులును, నవ నిధులును నిరంతరము చేతులను జోడించుకొని ఆమె సేవలోనుండును. ఎవరైన నిద్దరు కలిసి వారి కార్యములను వారు చక్కఁబెట్టుకొనుచుండిన దానినిఁ జెడఁగొట్టువారును నుందురు. ఒకానొకరు కీర్తిరాణితో నిట్లనెను:- "నందునింట వేపుకు సెనగలైనను

లేవే, అట్టివాని కుమారునకు మీ కుమార్తె నేల నీయఁ వలఁచుచున్నారు ?''

ఇంకేమున్నది ? కీర్తిరాణి యెదురుతిరిగెను. ఆమె వరుని, వరుని యింటిని జూచెను. ఇంతవఱకును సందఱును వరుని దోషములను జెప్పుచుండిరి. ఆతని రంగు నల్లనిది. దొంగతనములును జేయుచుండును. మూఁడుచోట్ల వంకరలు కలవు.'' అయినను రాజకుమారుఁడు. ఎట్టి వంకరవాఁడో, సరియైనవాఁడో అయినను విల్లు మంచిదైనచోఁ గొంచెము బాగుగనే యుండును. ఇప్పుడా విషయమునను సందేహ ముండినదని తెలియఁగానే ఆమె పట్టుపట్టెను. వృషభానునితో నామె యిట్లనెను:- ''నేను నా పిల్లనిట్టి బీదవారల కీయను.''

వృషభానుఁ డిట్లనెను:- ''ఈ విషయమును నీకెవరు చెప్పినారు ? నందరాజు మఱి గోపకులందఱకును రాజు. నాలుగు పైసలుండుటచేతనే యెవఁడును ధనవంతుఁడుకాఁడు ఆతని వంశ మెంతటికీర్తి కలది !'' కాని స్త్రీ హఠము ముందు బ్రహ్మదేవుఁడైనను నోడిపోవలసినదే. కీర్తిదేవి అంగీకరింపలేదు. ఒప్పుకొనకపోఁగా వృషభానుఁ డిట్లనెను : ''సరేకాని, వారు మనకంటె నధిక ధనవంతులు కాదని నీకు విశ్వాసమెట్లు కలిగినది?''

కీర్తిరాణి యిట్లనెను:- "చూడుఁడు నావద్ద యీ యైదు ముత్యములు బహుమూల్యములైనవి కలవు. ఇట్టి విలువగల ముత్యములు వారివద్ద రెండుండినచో నేను నా పిల్లను వారి పిల్లవానికిచ్చెదను. లేకున్నచో నింకొక వరుని వెదకి కొందును."

వృషభానుఁ డిట్లనెను:- 'మంచిది నీవేదైన పండుగకు వానిని బంపుము. అప్పుడిట్టి ముత్యములనే పిల్లకు కూడ పంపవలయునని కబురంపుము." కీర్తిరాణి దీని నంగీకరించెను. ఒక పండుగ కా ముత్యములను బంపి, మరల తిరుగుసారె కట్టిముత్యములనే పంపుఁడని కబురంపెను.

నందుఁడీ సమాచారమును వినఁగానే చాల భయపడెను. ఆతఁడట్టి ముత్యములను జూడనైనఁ జూడలేదు. మాల సంగతి నట్లుంచి, ఆతనికట్టి దొక్కటైనను లేదు. యశోదయును జాల చింతలో మునిఁగెను. ఇంతలోనే శ్యామసుందరుఁడు వచ్చి, తల్లి చింతగానుండుటనుగాంచి; ఆమెను గాఁగిలించుకొని యిట్లనెను:- "అమ్మా! అమ్మా! నీ వెందులకు దుఃఖితురాలవై యున్నావు?"

నిరాశా స్వరమునఁ దల్లి యిట్లనెను:- "నాయనా! ఏమి చెప్పుదునురా? ఏనోవిధముగ నాకు వృషభానుసుత కోడలగునను నాశతో నుంటిని. ఇప్పుడు చూడఁగాఁ చేతిలో

నుండి ఆకోడలు జారిపోవుచున్నది. కులమువారిలో నవ మాసము సంభవించుచున్నదనుటది వేఱు విషయము.''

సంభ్రమముతో శ్యామసుందరుఁడిట్లనెను:-'ఏమమ్మా! ఏమమ్మా! ఏమి ఆవిషయము? ఏమి జరిగినది?'

యశోద యిట్లనెను:- 'నాయనా! ఏమైన దేమిటి? నీ యత్తవారింటినుండి యీ ముత్యములు వచ్చినవి. ఇట్టి ముత్యాల హారమును పిల్లకొఱకు పంపుమని కబురంపినది కీర్తిరాణి, ఇట్టి ముత్యములు మనవద్ద నొక్కటైనను లేదు.'

శ్యామసుందరుడు సరళముగ నిట్లనెను:- 'అమ్మా! ఇందులోఁ జింతించుట కేమున్నదమ్మా! వీనినిఁ బొలములో నాటుము. చాల రాఁగలవు.'

ఇది విని శుష్కహాస మొనర్చుచుఁ దల్లి యిట్లనెను:- 'ఓరీ! నీవు వెఱ్ఱివాఁడవేమిరా నాయనా! కృష్ణా! ఇవి గజ ముక్తావళులు. ఏనుఁగుల కుంభస్థలమునఁ బుట్టును. పొలము లోఁబెట్టిన నివి మొలవవు.'

శ్యామసుందరుఁ డిట్లనెను:- 'అమ్మా! బృందావన భూమి యందొక విచిత్ర ప్రభావము కలదు. ఇచ్చట నెచ్చ టను లేని వింతయేమనఁగా నెచ్చటను బుట్టనివి యిచ్చటఁ బుట్టును. నీకు తెలియదమ్మా! నీకు వంట జేసికొనుటయును అంట్లు తోముకొనుటతోనే సరిపోవుచున్నది. నీకు తెలిసి

కొనుట కవకాశమును లేదు. చూడుము నేనిప్పుడే నాటెదను' అని చెప్పి ఆ యైదు ముత్యములను దీసికొనెను. నందునకుఁ గోపము వచ్చెను. ఈతఁ డెక్కడైనఁ బారవేయునేమో, అపకీర్తి కలుగునేమో అని ఆతనికి భయము. కాని కృష్ణుఁ డా ముత్యముల నైదును దీసికొని వెడలి పోయెను. ఆతఁడు యమునా తీరమునకుఁ బోయెను. కుతూహల వశమున నందుఁడును, జాలమంది యితర గోపకులును వెంటఁబోయిరి. పోయి భగవానుఁడు ఖేలనమున నిసుకను ద్రవ్వి దానిలో నా ముత్యములను బాతెను. యమునలో నుండి తెచ్చి నీరు పోసెను. అందఱకును నాశ్చర్యము కలిగెను. దానిలోనుండి అంకురములు బయలుదేరి, నిముషములోఁ దీగ అల్లుకొనెను. వానికి పెద్ద పెద్ద ఫలములుపుట్టి, పక్వమై పగిలెను. వానిలో వానికంటెఁ బెద్ద పెద్ద ముత్యములు బయలుదేరెను. వాని నన్నిటిని శ్యామసుందరుఁడు మరలఁ జాల గుంటలను దీసి నాటెను. వానినుండి మరల నంకురములు జనించెను. మరలఁ దీఁగ లల్లుకొనెను. మరల ముత్యములు పండెను. అంత నాతఁడు నందునితో నిట్లనెను: 'బాబా! ఇప్పుడు బండ్లను దెప్పింపుఁడు. పది పదునైదు బండ్లమీఁద వృషభానుని కడకుఁపంపి యిట్లు చెప్పి పంపవలయును:- 'ఇప్పుడు మాకు చేలయందు ముత్యములు పండుచున్నవి మీ కెన్ని కావలయునో చెప్పి పంపుఁడు.'

నంద మహారాజు హర్షితుఁడై బండ్లమీఁద నింపి ముత్యములను వృషభానుని కడకు బంపెను. ముత్యముల బండ్లను గాంచఁగనే కీర్తిరాణి కత్యంతవిస్మయము కలిగెను. ఇంక నామెకు శంకించుటకు వీలులేకుండెను. రాధికాదేవికిని, శ్రీకృష్ణునకును యథాసమయమునఁ బాణిగ్రహణ మొనర్చెను.

కొందఱు శ్యామసుందరుఁడును, రాధాదేవియును బాణిగ్రహణ మొనర్చుకొనిరి, కాని ఛద్మరూపమున జరిగె ననుచుందురు. ఒకానొక గోపకుఁడు ఘోర తపస్సుచేసి రాధికాదేవి తనకు భార్యకావలయునని కోరుకొనెనఁట.' భగవానుఁడిట్లు వరము నొసంగెను:- 'సరే,ఆమె నీభార్యయే కాఁగలదు. కాని నీ పత్నియయ్యు నామె నాకు సంబంధించి నదే కాఁగలదు.'

బ్రహ్మ మోహసమయమున శ్యామసుందరుఁడు గోప గోవత్సముల రూపమున నొక సంవత్సరముండెను. వ్రజము లోని గోపబాలురును, గోవత్సములును బ్రహ్మలోకమందు మాయచే నచేతనులై పడియుండిరి. ఆ సమయమున భగ వానుఁడొక గోపరూపమును ధరించి, ఆ రూపమున రాధను బాణిగ్రహణ మొనర్చెనఁట బాహ్యదృష్టితో లోకులకుఁ జూపించుటకై అతఁడా గోపరూపమును ధరించినాఁడు; కాని

వాస్తవమున నాతఁడు శ్యామసుందరుఁడే. తన వస్తువు కాని దాని నెవఁడు గ్రహింపఁగలఁడు? ఈ విషయము రాధకును దెలియును, శ్రీ కృష్ణునకును దెలియును. బలరామునకును దెలియును. ఇంక నితరు లెవరికిని నీవిషయము. తెలియదు అందువలనఁ గొందఱు పైకిఁ బరకీయ భావమును గల్పించు చుందురు. ఇది కేవల మైకాంతిక రసాస్వాదన భావ మాత్రమే. అంతరమున స్వకీయయే. స్వకీయ కానిది ప్రేమ యెక్కడనుండి వచ్చును?

ఏమైనఁగానిందు రాధా కృష్ణుల అద్భుతప్రేమ అలౌకికము. ప్రేమ సమస్యగనైనది. ఇప్పటి విషయ మట్లుంచుఁడు. ఆ రోజులలోనే కొందఱొక విధముగను, మఱికొందఱు మఱియొక విధముగను జెప్పుకొనిరి కొందఱు రాధా చరిత్రమును శంకించెదరు. కొందఱు ఆమె పాతి వ్రత్యమున గోష మెన్నెదరు. అందువలన శ్రీ రాధికా దేవియును దాను బతివ్రతా పరీక్షయును నిచ్చినట్లు చెప్పె దరు.

శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! శ్రీ రాధాదేవి సర్వేశ్వరి నిఖిల విశ్వ బ్రహ్మాండమున కధీశ్వరి. ఆమెను బరీక్షింపఁగల వారెవరు?"

అంత నవ్వి సూతుడిట్లనెను:- స్వామీ! ప్రపంచమున శరీరధారణ మొనర్చిన తరువాత నాతడు సర్వేశ్వరుడు కానిండు సర్వేశ్వరి కానిండు, జీవుడుకానిం డీశ్వరుడు కానిండు అందఱును బరీక్ష యీయవలసినదే. భగవానుడు ఉత్తీర్ణుడే. జీవుడు త్తీర్ణుడయ్యెనా ఆతడు దాటిపోయిన వాడే అనుత్తీర్ణుడయ్యెనా మధ్య వ్రేలాడుచుండును. సర్వేశ్వరిని బరీక్షించుటకు సర్వేశ్వరునికిదప్ప యింకెవరి కధికారము కలదు? సర్వేశ్వరుడే సర్వేశ్వరిని బతివ్రతా పరీక్ష నొనర్చెను.

శౌనకు డిట్లడిగెను:- "సూతా! సర్వేశ్వరుడు సర్వేశ్వరిని నెట్లు పరీక్షించినాడు? ఏల బరీక్షించి నాడు? ఈ ప్రసంగమును దయతో మాకు జెప్పవలయును"

సూతు డిట్లనెను:- మంచిది. వినుడు స్వామీ! నేనీ ప్రసంగమును మీకు జెప్పెదను. ప్రపంచమున మానవులకు బరచర్చలో బరనిందలో నున్నంత రుచి, మాధుర్యము, శక్తి యింకే నట్టి మధుర పదార్థములందు నుండదు. మనకేమియును నంటు సంటు, ఇచ్చి పుచ్చుకొనుసంబంధము లేకున్నను మనము వారిని గూర్చి గంటలకొలది చర్చించు కొందుము. వారి విషయము వీరివిషయము ఏదో వినుచుండ వలయును. వారి విషయము గోరంతను గొండంతలుగ

జేయుదురు. దీనింబట్టి మానవునకుఁ బరచర్చ అత్యంత
ప్రియముగ నుండునని తోఁచుచున్నది. మనబోటి అల్పులమే
పరచర్చ, పరనిందఁ జేయుదమనుమాట కాదు, పెద్ద వారికిని
నీరోగము కలదు. ఒక మహాత్ముఁడింకొక మహాత్ముని విష
యము చెప్పుచున్నప్పుడా వినుచున్న మహాత్ముఁడు వెంటనే
మేమందఱ మాతని విషయము నంతను నెఱుఁగుదుము.
నేఁటి కాతఁడు మహాత్ముఁడైనాఁడులే. ఇదివఱలో నటు
వంటి వాఁడు, ఇటువంటివాఁడు అనుచుందురు. దీనినిఁబట్టి
పరచర్చ లేకున్న మానవున కన్నము అరుగదని తోఁచుచున్నది.
ఎవఁడు పరచర్చా రహితుఁడో, ఎన్నడును నితరుల దోష
గుణములను జింతింపరో, వారు మానవులు కారు, మాధ
వులు. నరరూపమున నున్న నారాయణులు.

[illegible] స్త్రీల [illegible]
కముగ నుండును. స్త్రీల కజీర్ణరోగ మొకటి యుండును. ఉట్టి
వారికి జలము నొసంగినను జీర్ణము కాదు. అట్లే స్త్రీల
హృదయమున నే మాటయును బచనము కాదు. ఈ విషయ
మున ధర్మరాజు శాపముకూడ కలదు. అందువలన స్త్రీల
కెవరిమీదనైనను గొంచె మను మానము కలిగెనా వారవ
శ్యము గుసగుసలాడి వ్యాపింపఁ జేయుదురు. వ్రజమందీ రోజు
లలో నొక్కటియే చర్చ. అది రాధామాధవులకు సంబం

ధించినది. కొందఱు అనుకూలముగనుఁ గొందఱు ప్రతికూల ముగను మాటలాడుచుండిరి. కాని నేఁడు రాధాదేవి అందఱ సమాలోచనమునకుఁ గేంద్రమైనది. కొందఱు ఆమెను బరకీయ యనియు, స్వకీయయని కొందఱును ననుచుండిరి. స్వకీయ పరకీయ భేదము సనాతనమైనది. సదా ఉండును.

కుక్కలు మొఱఁగిన నేనుఁగులు బెదురునా? అవి గ్రామములోనికి రాకుండునా? కుక్కలు గజమును జూచి మొఱఁగినను దాని నుపేక్షించును. తన విషయమున నెవరే మనుకొన్నను వృషభానునందిని లక్ష్య పెట్టెడిదియే కాదు. అయినను విషయము హద్దులు మీరెను. ఇప్పుడు శ్యామ సుందరునకుఁ జింత కలిగెను. ఆతఁడందఱ సమ్ముఖమున రాధికాదేవి నిర్దోషియని ఋజువు చేయఁదలచెను. సమస్త మును దనకు సమర్పించి, కీర్త్యపకీర్తుల చింత బెట్టుకొనక ఒక్క శ్యామసుందరుఁడే తన కాశ్రయమని భావించి సర్వాత్మ భావముచే నాతని నాశ్రయించుటయే ఆమెకుఁ దెలియును.

చాలమంది స్త్రీలు రాధికా చరిత్రము మీఁద దోష ముల నెన్నుచుండిరి; కాని వానిలో నిద్దరు ప్రధానమైనవారు. ఒకతె ముసలది, ఒకతె యువతి. వారిద్దరును సదా పర పురుషుని వైపు చూడనే చూడరు. కాని చూచుట మాత్ర

మంతగాఁ బాపముకాదు. పాపము మనస్సుతోఁ జేసిన లభించుననను సదాచార మిథ్యాభిమానమును నప్పుడప్పుడు సాధనలో గొప్ప విఘ్నమగును, ఆ యభిమానము నశింప నంతవఱకు మానవుని బుద్ధి నిలువఁబడదు. వారిద్దరకును వారి పాతివ్రత్యము మీఁద వారికి గర్వము కలదు. ఈ అహంకారమునఁబడి మిగిలిన వారినందఱను అసతులుగ భావించుచుండిరి. పై రాధా మాధవుల సంఘటనమును గాంచి నిందించెడివారు. ఎవరు ఇతరుల చెడ్డతనమును గాంచెదరో వారిహృదయములలోఁ జెడ్డతనమునిండియుండును చెడ్డ యెవరికిఁ గావలయును? ప్రపంచమున నెల్లప్పుడును మంచి చెడ్డలుండును. ఉండఁగలవు. పచారి దుకాణమున విషము నుండును, రసాయనము నుండును. విషమువైపు దృష్టి నిడక త్రిఫలాది ద్రవ్యము లావశ్యకమైనప్పుడు వాని విషయమునఁ జర్చ చేయుదుము.

సరియే, ఒక దినమున శ్రీకృష్ణుఁడను జబ్బుచేసెను. రోగము తీవ్రమైన దగుటచేఁ దల్లి దండ్రులును భయపడిరి. గోప గోపీజనములు గోవిందుని చుట్టునుచేరి యేడువ నారంభించిరి. నుతములు, యంత్రములు, రక్షరేకలు, దిగతుడుపులు, సొగ వేయుటలు, మూలికలను చేయుటయు మొదలగు నుపచారము లన్నియును జేయఁబడినవి; కాని

దేని వలనను లాభము కలుగలేదు. యశోదాదేవి ధైర్యము సడలి పోయెను. ఆమె బిగ్గరగ నేడ్వ నారంభించెను. ఇంతలోనే సుందరుఁడగు నొక వైద్యుఁడొక చేతిలో జోలె యును, ఇంకొక చేతిలో దండమును బట్టుకొని అచ్చటికి వచ్చెను. జోలెను, దండమును నచ్చటనుంచి ఆతఁ డిట్లనెను:- "నేను మధురా పురమునుండి వచ్చుచున్నాను. నందకుమారుఁడు కొంచెమస్వస్థుఁడుగ నున్నాఁడని విని యున్నాను. నే నిప్పుడే ఆతనికి నయము చేసెదను."

యశోద కిప్పుడెవరో అమృతమును జల్లినట్లుండెను. ఆమె యిట్లనెను:- "వైద్యరాజా! మా పిల్లవానికి నీవు నయము చేయుము. నీవేమి యడిగినను ఇచ్చుటకు సిద్ధముగ నున్నాను. నా సర్వస్వమును నీకు సమర్పించుచున్నాను."

వైద్యుఁడు గంభీరముగ నిట్లనెను:- "నేనెవరియింట చికిత్స చేయుదునో నేను వారియింట జలమునైనను త్రాగను. ఇది మాగురు్వాజ్ఞ. నేను రోగినుండి యేమైనను దీసికొనినచో నా విద్య విఫలమై పోవును. నేను నిశ్శుల్కముగఁ జికిత్సను జేయుదును."

యశోద వ్యగ్రతతో నిట్లనెను:- "నీ యిష్టము వచ్చినట్లు చేయుము. మా పిల్లవానికి బాగుచేయుము. నీకేమి వస్తువులు కావలయును?"

వైద్యుఁడిట్లనెను:- 'నాకేమియు నక్కఱ లేదు. ఒక కుండెడు యమునా జలము కావలయును.''

యశోద యిట్లనెను:- ''మీకెం జలము కావలసి యుండిన నంత జలమును నేను దెచ్చెదను.''

వైద్యుఁడు గంభీరముగ నిట్లనెను:- ''నీవు తెచ్చిన పనికిరాదు. నీవుకాక యింకెవరైనఁ బతివ్రతయగు స్త్రీ తీసి కొని రావలయును. ఆమెకుఁ దన పాతివ్రత్యమునందు పూర్ణ విశ్వాస ముండవలయును. ఎవరైనఁ బతివ్రత కానిది జల మును దెచ్చెనా శ్యామసుందరునకు నయము కాదు.''

అందఱ హృదయములును గొట్టుకొన నారంభించెను. మనస్సుతోనైనను నెన్నడును బరపురుషునిఁ జింతింపని స్త్రీ సర్వత్ర దొఱకదు. అందఱును భయపడిరి. యశోద యిట్లనెను:- ''ఈ జలము పతివ్రత తెచ్చిన దనుటకు గుర్తు యేమి యున్నది? ప్రతివారును దమను దాము పతివ్రతల మనుకొనుచుందురు.''

సవ్వి వైద్యరాజిట్లనెను:- ''ఎవరి మనస్సుతో వారు పతివ్రతలమనుకొను చుండుటవలనఁ బని జరుగదు. పతి వ్రతకు ఒక పరీక్షకలదు. ఆ పరీక్షలో నుత్తీర్ణులై యెవరు కలశముతో యమునా జలమును దెచ్చెదరో వారే పతి వ్రతలు. ఎవరు నీరునింపి తీసికొనిరాఁజాలరో వారసతులు.''

యశోద యిట్లనెను:- "ఇప్పుడు నీవు అడ్డంకి పెట్టుచున్నావు. దానినిఁగూడ చెప్పుము. దాని కేమి చేయవలయును."

వైద్యరాజిట్లనెను:- "దాని కేమియును లేదు. ఒక పచ్చికుండను దెప్పింపుడు."

వెంటనే పచ్చి మట్టికుండ వచ్చెను. వైద్యరాజు తన సంచినుంచి ఒక బంగారు చీలను దీసెను. దానితో దానికి నూఱు చిద్రము లొనర్చెను. ఒక కత్తెరనుదీసెను. దానితో శ్యామసుందరుని పొడుగుగను, నుంగరములు తిరిగియు, నల్లగానుండిన కురులను నొక కుచ్చును గత్తిరించెను. అందులోనుండి ఒక్కొక్క వెంట్రుకను దీసి ఒక పొడుగాటి దారముగ నిర్మాణ మొనర్చెను. దానిని యమునకీ యొడ్డున నుండి ఆ యొడ్డునకు నటు నిటు బంధించి యిట్లనెను:- ఈ కుండను దీసికొనిపోయి, యీ వెంట్రుక మీఁదుగా నడచి యీ యొడ్డునుంచి ఆ యొడ్డునకుఁ బోయి, యమునా జలమును నింపుకొని రావలయును. అందులో నొక్క బిందువైనను గ్రిందపడరాదు, అట్లెవరు చేయఁగలవారో ఆమెయే పతివ్రత. అట్టి యామె తెచ్చి జలముచే శ్యామసుందరుఁడు చక్కఁబడఁగలఁడు."

ఇది వినఁగానే సమస్త స్త్రీలకును సాహసము సడలి పోయెను. ఇప్పుడందఱును గలిసి ఆ యిద్దరను బ్రోత్సహించిరి. వారికిని వారి సతీత్వమునందు గట్టి గర్వము కలదు. ఇద్దఱును నొకరి తరువాత నొకరు కుండను దీసికొని పోయిరి కాని కాలు పెట్టఁగానే తంతువు తెగిపోయెను. ఇద్దరును రెండు సార్లు తలక్రిందులుగఁ బడిపోయిరి. యమునలోఁ బడిన వీరినిఁ గాంచఁగనే యిఁక మిగిలిన వారికిని సాహసము సడలెను. ఇప్పుడింకెవరును గుండ నెత్తుటకు సాహసింప కుండిరి. ఎవ్వరును గుండను గైకొనుటకు సాహసింపక పోఁగా యశోద యేడ్చుచు నిట్లనెను:- "వైద్యరాజా ! నీకు మా పిల్లవానికి నయముచేయ నిష్టము లేకుండిన స్పష్టముగఁ జెప్పుము. ఇట్టి యసంభవములు పలుకనేల ?"

వైద్యుఁడు గంభీరుఁడై యిట్లనెను:- "అమ్మా ప్రపంచమున నసంభవమనునది లేదు. సతీసాధ్వి యేమైనఁ జేయఁగలదు."

యశోద యిట్లనెను:- "అయితే, నీవే చెప్పుము, ఇట్టి సతి యెవరున్నారో?"

వైద్యుఁడిట్లనెను:- "నేనేమి యెఱుఁగుదును. నాకు జ్యోతిషము కూడ తెలియును. నీవడిగినచో గణించి అట్టి పేరును జెప్పెదను."

అందఱి మనస్సులలోను కుతూహలము జనించెను. అందఱును పట్టుదలతో నిట్లనిరి:- "పేరును జెప్పుము, పేరును జెప్పుము"

వైద్యరాజు కొంచెము సేపటి వఱకు మేషము, వృషభము, మిథునము, సింహము, కన్యా అని లెక్క వేయుచుఁ జివర కిట్లనెను:- "ఇచ్చట నెవరైన రాధ యనువారు కలరా?"

యశోద యిట్లనెను:- "అవును. ఉన్నది. అయ్యో! ఆమెకు కృష్ణుని రోగము విషయము తెలియదేమో! లేకున్న నామె అందఱికంటె ముందు వచ్చెడిదే." వెంటనే పరుగెత్తుకొనిపోయి ఒక సఖి రాధికాదేవినిఁ బిలుచుకొని వచ్చెను. వైద్యుఁడామెను దూరమున నుండియే చూచి, ఆమె నభ్యర్థించి యిట్లనెను:- "చూడుము, ఈ కడవ నావలి యొడ్డుననుండి నీరు ముంచుకొని, కేశ తంతువుమీఁద నడిచి తేవలెను."

"దీని వలన నేమగును వైద్యరాజా?" అని వీణా వినిందిత స్వరమున వృషభానుకుమారి రాధిక యనెను.

వైద్యరాజిట్లనెను:- "దీని వలన శ్యామసుందరునకు నయము కాఁగలదు."

"సరే శ్యామసుందరునకు నేను దెచ్చిన జలములో నయమగునా?" అని ఆమె ఘటమును దీసికొనెను. స్త్రీ పురుషులలోఁ గోలాహలము వ్యాపించెను. అందఱు హృదయములు కొట్టుకొన నారంభించెను. కొందఱు స్త్రీలు లోలోన నవ్వుకొను చుండిరి. కొందఱు పరిణామము కొఱకు అత్యంత ముత్కంఠితలై యుండిరి. వృషభాను కుమారియగు రాధ గంభీర భావముతో సరళముగ శత ఛిద్రఘటమును జేతఁ బట్టుకొని యమునా తటమునకు వచ్చెను. వెను వెనుక అపారమగు గుంపు ఉండెను. ఆమె శ్రీకృష్ణుని వెంట్రుకలచే నేర్పడిన కేశతంతువునకు నమస్కార మొనర్చెను. అంత నామె సరళముగ దాని మీఁదుగాఁబోయి, నీటిని ముంచుకొని మరల దానిపైఁగా సరళముగ వచ్చెను. ఈ యద్భుత ఘటనముచే నందఱ హృదయములందును నానందము వెల్లివిరిసెను. అందఱును నామెకు జయ జయ ధ్వనులొనర్చిరి. దేవతలామెపైఁ బుష్ప వర్షమును గురిపించిరి. జలమును దీసికొని వచ్చి ఆమె సరళ బాలికవలె శ్యామసుందరుని సమీపమున నిలుచుండెను.

వైద్యుఁడిట్లనెను:- "నీవే శ్యామసుందరుని మీఁద మూఁడు పుడిసెళ్ల జలమును జల్లుము. మూఁడు సార్లాతని శిరస్సున నూఁచుము. ఇప్పుడే వెంటనే యీతని రోగము

పారిపోఁగలదు. ఏ యభ్యంతరమును లేకయే సరళముగ రాధికాదేవి మూఁడు పుడిసెళ్ల జలమును శ్యామసుందరుని మీఁదఁజల్లెను. మూఁడుసార్లాతని శిరస్సున నూదెను. వెంటనే శ్యామసుందరుని రోగము పోయెను. వైద్యరాజు తన జోలెను దండమును దీసికొని యెచ్చటనుండి వచ్చెనో అచ్చటికే పోయెను. ఆ దినమునుండి వ్రజమున నొక్కతియే పతివ్రత కలదు. ఆమె శ్రీ రాధికాదేవి యను ప్రతీతి ప్రబలెను.

సూతుఁడిట్లనెను:- "మునులారా! నేను శ్రీమతి యగు రాధికా జీవన చరిత్రమును మీకుఁ జెప్పుటలేదు. ఆమె అపార చరిత్రమును నెవరు చెప్పఁగలరు. నేనామె యొక్క మహా మహిమ సముద్రమునుండి ఒక్క బిందువును దీసికొని మీకు ఉదాహరణార్థము చెప్పుచున్నాను. ఆమె శ్యామసుందరునకుఁ ప్రధానశక్తి, శ్యామసుందరుఁ డీమె తోడనే క్రీడించుచుండును; రాస విలాస మొనర్చుచుండును. ఆమెయే రాసకుఁ బ్రధాన రాజేశ్వరి. రాస సమయమున గోపికలకుఁ దమయైశ్వర్య విషయమున గర్వింపఁగా, వారి మనస్సులలో మాన ముదయించినది. అప్పుడు రాసేశ్వరుఁ డాతని రాసేశ్వరియగు రాధను వెంటఁ బెట్టుకొని అంతర్థానమును జెందెను. అందువలన గోపికలు లతా, వృక్ష, ఖగ,

మృగాదులను, ఇతర చరాచర జీవులను బ్రియా సమేతముగఁ దమ ప్రేష్ఠునిఁ గూర్చి యిట్లడిగెను. వారిట్లనిరి:- "ప్రియా సంగమున శ్యామసుందరుఁ డిటు వెడలుటను మీరు చూచితిరా?"

శౌనకుఁడిట్లనెను:- "సూతా ! తరువాత నేమైనది ? ఇప్పుడు నీవు మాకు మహారాసలీలను గూర్చి చెప్పుచుంటివి. దానినిఁగూర్చి చెప్పుము."

సూతుఁడిట్లనెను:- "మంచిది. స్వామీ! ఇప్పుడు నేను రాసలీలా ప్రసంగమును గూర్చి చెప్పెదను. మీ రందఱును సమాహిత చిత్తులరై శ్రవణ మొనర్పుఁడు."

# ప్రియా సంగమునఁ బ్రియతముఁ డెక్కడ?

౯౨౨

శ్లో॥ బాహుం ప్రియాంస ఉపధాయ గృహీత పద్మో
రామానుజస్తులసికాలికులైర్మదాంధైః ।

అన్వీయమాన ఇహ వస్తరవః ప్రణామమ్,
కిం వాభినందతి చరన్ప్రణయావలోకైః॥
శ్రీభాగ. ౧౦ సం. ౧౨ శ్లో॥

వ. ఓ తరువులారా! శ్రీ కృష్ణుఁడొక కరమును దన ప్రియా భుజముపై వైచుకొని, రెండవ చేతితోఁ గ్రీడాకమల మును ద్రిప్పుచుండ, నాతని వెనుక తులసీ గంధలోభ ముచే మదమత్త భృంగంబులు జనుచుండ నిచ్చటఁ దిరుగుచుండు నెడ మీరు వందన మొనర్ప నాతఁడు తన ప్రణయ కటాక్షములచే నభినందించెనా యేమి?

జీవుఁడు భగవంతుని నుండి యెప్పుడు విడివడినాఁడో తెలియదు. జీవుఁడెచ్చట విడివడును. స్వామియే దాగు కొనును. అతని నన్వేషించుటయే జీవున కేకైక వ్యాపా రము. ఆతఁడు తన ప్రభువు నన్వేషించు చుండును. నిరంతర మన్వేషించు చుండును. దేనిని సమ్ముఖముగఁ గాంచునో దానివలన నాశను జెందును. స్వామి జాడ దానివలనఁ దెలియవచ్చునని ఆశించును. కాని దేని నాశించుచున్నామో అదియును దిరుగుచున్నది. అదియును నాతని నన్వేషించు చున్నది. అది ముందునకుఁ బోవుచుండును. ఎనుబది నాల్గు లక్షలలో దిరుగుచుండును. ఈ చక్రములో ద్వారము దొఱికెనా బయటఁబడును. లేకున్న మరలఁ దిరుగును.

వీనికి శాంతిలేదు. సుఖములేదు. విశ్రామములేదు. అవసానము లేదు, పోవుచునే యుండును. అన్వేషించుచునే యుండును. ఈతని ప్రయత్నముచేఁ బ్రియుఁడు లభించునా? ఓయీ, యీతని ప్రయత్నముచే నేమి దొఱకును. ఆతఁడు ముందుగనే ప్రకటమగును. "ఓయీ ప్రకటమై యుండవలసి యుండిన మొదటనే దాగుకొను టెందులకు? ఇంత ప్రపంచము నేలఁ బెంచినాఁడు ?" ఖేలనము కొఱకు, లీలకొఱకు యోగ మాయ నాశ్రయించి బాల వినోదమొనర్చు చున్నాఁడు. దాగుడుమూత లాడుచున్నాఁడు. ఆటలో నాతని కానందము కలదు. అందువలన నిచ్ఛించును. ప్రజలు కావలయునను కొనఁగానే కలిగిరి. వంశీధ్వనిని వినఁగానే సమస్త సంభారములు ప్రోగగును. మరల ఖేలన మారంభ మగును. దొంగ దాగుకొనును. ఇతర ఆటగాండ్రు వానిని వెదుకు కొందురు. వారు వెదకి వెదకి వేసారినపుడు ఆతఁడు లభించును. ఆతఁడే మిగులును. మఱల నూతన క్రీడ ఆరంభ మగును. ఈ విధముగ ననంత క్రీడలు అనంత కాలము నుండియు వచ్చుచున్నవి. అనంతకాలము వఱకును జరుగుచునే యుండును. దీనికి ఆది మధ్యాంతములును . నవసానమును లేదు. అటులనే జరుగుచుండెను. ఈ గుణ ప్రవాహము సతతము ప్రవహించుచునే యుండును. దీనిలో రసాస్వాదన మొనర్చుటయే పరమ పురుషార్థము.

సూతుఁడిట్లనెను:- "మునులారా! గోపికలు శ్రీకృష్ణాన్వేషణ వ్యాపారమందు జడచేతన భేద భావమును సర్వథా మఱచిరి. వారు వృక్షములను సంబోధించుచు మాటిమాటి కిట్లనుచుండిరి:- "ఓ తరువర గణములారా! పరోపకారమే మీకు మహావ్రతము. మీరు నిరంతరమును నందఱకును నుపకార మొనర్చుచుందురు. మీకు క్షౌరమును జేయించు కొను వ్రతమును గైకొనలేదు. శిశిరఋతువు మీ ఆకులను రాల్చి వేయును. మీరు మాటలాడరు. ఎవ్వరైన మీ శరీరమును దెగఁగొట్టినచో వారికి మీరు ప్రతీకార మొనర్పరు. మీరు సైగనైనఁ జేయని మౌనవ్రత ధారణ మొనర్చినారు. కాని మౌనవ్రతులును నొక్కొక్కప్పుడు మౌనవ్రతమును భంగము చేయుదురు. మాకు రాధాకాంతుని జాడను దెల్పుఁడు. ఆతఁడు మేఘమునలె నల్లనివాఁడు. ఆతని భుజము మీఁద మెఱయుచుండు బీతాంబర ముండును. ఆతఁడు తప్పక తన ప్రియురాలి భుజముమీఁదఁ జేయి వైచుకొనిపోయి యుండవచ్చును. మేఘముతో సౌదామిని పెనవైచుకొనినట్లు ప్రియురాలితో నాతఁడు పెనవైచుకొని యుండవచ్చును. కాని ఆతఁడు గర్జించియుండఁడు. రస వర్షమును గుఱిపించుచుండ వచ్చును. ఘనశ్యాముని అమృత రసబిందువులలోఁ గొన్ని తప్పక మీ మీఁదఁబడి యుండ

వచ్చునని భావించు చున్నాము. ఆ బిందువులు పడకున్న నింతటి ప్రసన్నత యెచ్చటినుండి రాఁగలదు. మీరు వంగి, యూగి ఆతని పాదములను ముద్దు పెట్టుకొని యుండవచ్చును. అప్పుడవశ్య మాతఁడు మీ కభినందనము లొనర్చి యుండ వచ్చును. ఏలననఁగా నాతఁడు కృతజ్ఞుఁడు. సభ్రముఁడు, గుణ గ్రాహి. ఆతఁడు మాయపరాధముల యెడలఁ గోపమును జెందినాఁడు. దోషము మాదియే. ఆతనిది కాదు. ఆతఁడు నిర్దోషి, సముఁడు, వ్యాపకుఁడు, బృహత్, పరిపూర్ణుఁడు, సర్వగతుఁడు.

ఎదుటఁ బుష్పించిన లతలను గాంచి యిట్లనిరి:- "ఈ పురుష వృక్షములను శ్యామసుందరుఁ డుపేక్షించి యుండవచ్చును. ఏలననఁగాఁ బురుషజాతి కఠోరముగ నుండును, కాని యీ లతలు తేలికగ వంగునట్టివి. కొంచెము గాలి సోకెనా ఊగుచుండును. కొంచెము రసము కురిసెనా పుట్టించును. పిలువకయే వృక్షములతోఁ గలియును. వానినిఁ జుట్టుకొనును. చుట్టుకొనినఁ దెగనైనఁ దెగును గాని వదలవు. ఇవి అనురాగవతులు వీనిసదుగ వలయును. ఇవి అష్టకాలములైనను, వీని కామన లన్నియును బూర్ణములే. ఇవి యెనిమిది జాములును దమ ప్రాణపతుల ప్రేమాలింగన సుఖమును బొందుచుండును. అయినను వీని శరీరములు

రోమాంచితములైనవి. దీనినిఁ బట్టి వీనికి భగవంతుని అరుణారుణ సుకోమలస్పర్శ తప్పక అయియుండ వచ్చునని తోఁచుచున్నది. శ్యామసుందరుఁడు తన స్నేహమయియగు సఖిని నలంకరించుటకై వీనిని సుమనముల యాచించి యుండవచ్చును. ఇవి ఉదారతా పూర్వకముగఁదమ శాఖారూపములగు భుజములను జాపియుండ వచ్చును? అప్పుడవి నవ్వి యిట్లని యుండనచ్చును:- "వ్రజవల్లభా! నీకు వీనిలో నచ్చినవాటిని నీ గోరులతోఁ గోసికొని పొమ్ము" అప్పుడనురాగ భరిత హృదయముతో హరి వీని శాఖలను వంచి, వానినుండి పుష్పములను గోసియుండ వచ్చును. తొందఱలో స్వతః ఆ శాఖలెగిరి ఆతని కపోలమును దాకి యుండ వచ్చును. ఏలనఁగాఁ బ్రియతముని కమనీయ కపోల సుఖద స్పర్శ లేక యింతటి ప్రఫుల్లత రాఁజాలదు. ఆహా! దీని సౌభాగ్య మెంతటిది! ఏ ప్రేమాలింగనము కొఱకు లక్ష్మీదేవి కమల వనమునకుఁ బోయి, యేకాంత వాసమొనర్చి యెట్టి ఘోర తపస్సొనర్చుచుండెనో; ఎవని యాలింగనము కొఱకు తే లక్ష్మీదేవి వృక్షమై వర్షమును, హిమమును, ఆతపమును సహించుచు దుష్కర తపము నొనరించుచుండునో: ఆ యాలింగనమును నీ లతలు తమ పుష్పములవలన ననాయాసముగఁ బొందినవి. ప్రియునిఁ

ప్రసన్ను నొనర్చు కొనుటకు ముందు ప్రియుని ప్రియులను ప్రసన్నుల నొనర్చు కొనవలయుననుసామెతను సార్థకము చేసెనా యను నట్లు తోఁచుచున్నది. ప్రియుని ప్రియులను ప్రసన్నుల నొనర్చు కొనినచోఁ బ్రియుఁడు తప్పక ప్రసన్నుఁడు కాఁగలడు. శ్యామ సుందరుఁడు తన చేతులతోఁ దన ప్రియురాలి కేశముల నలంకరించుటకు వినియోగింపఁ బడిన నా పుష్పములే ధన్యములు. అయ్యో! అభాగినుల మగు మేము లతాపతోదుల కంటెను హీనలమై పోయితిమే? మేము బలలము గాక బృందావన మందలి కుంజములందలి లతలమై యుండినచో శ్యామ సుందరుఁడు తన శ్యామల కరములతో మా పుష్పములను గోసిఁ మా పట్టమైన శాల ఛాయయందు తన ప్రియతోఁగూడి క్రీడించెడు వాఁడే. తన ప్రణయ కటాక్షములతో మా వైపునకుఁ జూచి, తన ప్రియురాలినిఁ బ్రసన్న మొనర్చుకొనుటకై మా శోభను జూపించుచు మా గుణ గానము నొనర్చెడు వాఁడే.

అయ్యో! ఈ సుందర మానవ శరీరమున నేమి లాభము. శ్యామ సుందరుని సాక్షాత్కారము లేక పోయినచో శ్యామ సుందరుని చరణ స్పర్శచేఁ గఠోరములగుఁ గఠోరములగు బృందావన శిలలును మృదులములై పోవును. శ్యామ సుందర చరణ స్పర్శచే నింక నే వస్తువులైనను

గిశోరములై యుండఁజాలవు. బృదావన మందలి రాలిన యెండుటాకుల గృహ విహీనములై, గాలి యెటు వీచిన నటుఁ గొట్టుకొని పోవుచున్నను నవి మాకన్నను భాగ్యశాలినులు. ఇవి ఒకప్పుడు కాకున్న నింకొకప్పుడైనను శ్రీకృష్ణ చర ణారవింద స్పర్శను జెందును. తిరుగుట యనునది యీ యెండుటాకులకే సార్థకమైనది. మేము సరసులమైనను దిరుగుచున్నాము. కాని మాకు శ్యామ సుందరుని సాక్షా త్కారము కాలేదు. ఏమి చేయుదుము, ఎచ్చటికిఁబోఁ గలము ? ఎవరినడుగుదుము. మాకు కృష్ణుని జాడను జెప్పఁ గలవా రెవరు ? మమ్ముల నాయనతోఁ గలుపు వా రెవరు ? మాకు శ్యామ సుందరుఁడు లభించుట కేమి చేయవలయునో, ఏ సాధనము చేత, ఏ యుక్తిచేత నాతడు మా హృద యహారము కాఁగలఁడు. ఆతఁడు మమ్ముల నెట్లు స్వీకరింపఁ గలఁడు. ఎప్పుడాతఁడు మమ్ములను హృదయముతోఁ గౌఁగి లించుకొనఁ గలడు ? ఆతఁడెప్పుడు మమ్ముల నంకమునఁ గూర్చుండఁ బెట్టుకొనఁ గలడు ?''

సూతుఁడిట్లనెను :- ''మునులారా ! ఈ విధముగ శ్రీ కృష్ణ విరహ వ్యాకులురై వ్రజాంగనలు విరహ వేదనలో విహ్వాలలై ఒక వనము నుండి యింకొక వనమునకుఁ దిరుగ నారంభించిరి. శ్రీకృష్ణ చంద్రుని, ఆనందకందుని నన్వే షించు చుండిరి. వెదకి వెదకి వారు తన్మయులైరి. అంత శ్రీ కృష్ణుని వివిధ లీలలు ననుకరింప నారంభించిరి.

# శ్రీకృష్ణ లీలానుకరణము .

శ్లో॥ ఇత్యున్మత్త వచో గోప్యః కృష్ణాన్వేషణ కాతరాః।
లీలా భగవతస్తాస్తా హ్యనుచక్రు స్తదాత్మి కాః॥
(శ్రీభాగ. ౧౦ స్కం. ౩౦ అ. ౧౪ శ్లో॥

వ. అనుచు మదనోన్మాద చిత్తలై తదాత్మ కత్వంబునఁ
గృష్ణలీలల ననుకరించుచు.

శ్రీ మదాంధ్ర భాగవతము

ఎవఁడు నిరంతర మెవరినిఁ జింతించు చుండునో వారట్లే యగుచుండుటను లోకములోఁ జూచుచున్నాము. విచార ప్రభావము మనస్సుపైన నెక్కుడుగఁ బడుచుండును. మానవుఁడెట్లు సంకల్పము లొనర్చునో అట్లే యగును. ఈ ప్రపంచమే సంకల్పముల కధీనమై యున్నది. మన చావిరములే ఆకృతి నిర్మాణము కావించును. గోడమీఁదను, పాషాణ శిల మీఁదను, కాగితము మీఁదను జిత్రకారుఁడెట్టి ఆకృతిని సంకల్పించునో అట్టి యాకృతిని నిర్మించును. అందు కనియే వేదములలో మాటి మాటికి నిట్లు చెప్పంబడినది. మన సంకల్పములు శివములు కావలెను. సుందరములు కావలయును. కల్యాణ ప్రదములు కావలయును. ఒక ఘటనము కలదు. ఒకానొక స్త్రీ తన పతిని మిక్కిలి

ప్రేమించెడిది. యువావస్థలో నామె భర్త యెచ్చటకో పర దేశమునకుఁ బోయెను. అతఁడు త్వరగా వచ్చెదనని చెప్పి పోయెను. దైవ యోగమునఁ బరదేశమునకుఁ బోయి, అచ్చట మరణించెను. ఇచ్చట నాతని భార్య నిరంతర మాతనిఁ బ్రతీక్షించుచు బిచ్చిదయ్యెను. ఆ పిచ్చిలో నామె తాను యువతి ననియు, తన భర్త యిప్పుడే రాఁగలఁడనియు సంకల్పము కలుగు చుండెను. పిచ్చిలోనే ఆమెకు డెబ్బది యెనుబది యేండ్ల వయస్సు కలిగిన దయ్యెను; కాని ఆమె కొక్క వెండ్రుక యైనను నల్ల బడలేదు. ఏల ననఁగా నామె సర్వదా తాను యువతి ననుకొను చుండెను. భావ ములు ముఖాకృతి మీఁద వ్యక్తమగు చుండును. చాల మంది ముఖాకృతినిఁ గాంచియే మానవుల అంతః కరణ భావములను దెలిసికొను చుందురు.

సూతుఁడిట్లనెను:- "మునులారా! శ్రీకృష్ణ చింతన మొనర్చుచు నా వ్రజాంగనలు కృష్ణమయులైరి. ఇప్పుడు వారు తమకు దామే శ్రీకృష్ణ లీలల ననుకరించుచుండిరి. వారంతరంగ ప్రేరణచే శ్రీకృష్ణ లీలాభినయము నొనర్ప సాగిరి. ఒక గోపిక బాలకృష్ణుఁడయ్యెను. ఇంకొకర్తుక పూత నయై వచ్చెను. ఆమె ఆమె స్తనములను బాన మొనర్ప నారంభించెను. అప్పుడామె విషానుభవమును జెంది తటు

క్కన నేలపైఁబడి పోయెను. ఒక ర్తుక శకటాసురుఁ డయ్యెను. ఇంకొక గోపిక శ్రీకృష్ణుఁడై ఆమెక్రిందఁబరుండి, ఆమెను గాలితోఁదన్ని క్రిందఁబడ వైచెను.

ఒక గోపిక తన లంగాను విస్తరింపఁజేసి తృణావర్తుననుకరించెను. ఇంకొక ర్తుక కృష్ణుఁడు కాఁగా, ఆ కృష్ణుని లేవనెత్తుకొనెను. అంతఁ గృష్ణుఁడు ఆటలోఁ జంపినట్లు నటించెను. ఒక ర్తుక యిట్లనెను:- "నేను గృష్ణుఁడను." ఇంకొక యామె తాను బలరాముఁడననెను. వారిద్దరును వేణుగానము చేయుట ననుకరించిరి. కొంద ఱావులగుచుండిరి. కొందఱు దూడలైరి. దూడలైన గోపికలలో నొక గోపిక వత్సాసురుఁ డయ్యెను. ఆమె ఒక గోపికను బడవైచెను అప్పుడు కృష్ణుఁడైన గోపిక వత్సాసురుఁడైన గోపికను బడవైచెను. అందఱును గలసి యిట్లనిరి:- "ధన్యుఁడవయ్యా! మంచి పనిని జేసినావు. వీఁడెవరో దుష్టాసురుఁడు. వీఁడు దూడలలోఁ గలసినాఁడు. నీవు వీనినిఁజంపి మంచి పనిఁ జేసినావు."

ఒక గోపిక మురళీధరుఁడై మురళిని వాయించెను. చాలమంది గోపికలు గోవులై గడ్డి మేయుచున్నట్లభినయించిరి. అవి దూరముగఁ బోవుటను గాంచి శ్రీకృష్ణుఁడైన యామె వేణువు నూదెను. వేణునాదమును విని,

అంబాయని యఱచుచు గోవులైన గోపికలు పరుగెత్తుకొని వచ్చి, శ్రీకృష్ణుఁడైన గోపికను జుట్టుకొనిరి. ఈ విధముగ వియోగము నందును లీలా కరణమును ద్వారా వారు సంయోగ సుఖము ననుభవించిరి.

ఒకర్తుక శ్రీకృష్ణుని నడక ననుకరించెను. తన శరీరమును గొంచెము వంకరగ నొనర్చి మంద మంద గతిచే వేణువు నూదుచు బోవుచు నిట్లనెను :- "నేను కృష్ణుఁడను, నా లలితగతి నవలోకింపుఁడు. నేను రాధా రమణుఁడను. నన్నే కొందఱు గోపీజనవల్లభు డందురు."

అంత నందఱును గలసి గోవర్ధన ధారణలీల ననుకరించిరి. ఒకర్తుక ఇంద్రయాగము నొనర్ప నుద్యుక్తులైరి. ఒకతె శ్రీకృష్ణుఁడై ఆతని యజ్ఞకారణము నడిగెను. చెప్పఁగా నింద్రయాగ మొనర్పక గిరి గోవర్ధన యజ్ఞము చేయుఁడని కృష్ణుఁడైన గోపిక చెప్పెను. అప్పుడందఱును గోవర్ధన యాగమును జేయసాగిరి. దేవేంద్రుఁడు వారిపై వడగండ్ల వానను గురిపించెను. అప్పుడు వ్రజవాసులైన వ్రజాంగనలు భయ విహ్వలులై వ్రజరాజైన వనితను బ్రార్థించిరి. అప్పుడు వ్రజవల్లభయైన వ్రజాంగనలు చేతుల నెత్తి యిట్లనిరి :- "ఓయీ! వ్రజవాసులారా! మీరు వాయువునకును, వర్షమునకును భయభీతులు కాఁబోకుఁడు. ఇంద్రుఁడు

మిమ్ముల నెవ రేమియును జేయఁజాలరు. దుష్టశిక్షణ జేయు వాఁడనగు నేను మీ సమ్ముఖమున నున్నాను. నేను మిమ్ముల సమస్త సంకటముల నుండియును రక్షించెదను. మీరు చింతింపకుఁడు. నా యవతారము దుష్టశిక్షణము కొఱకును శిష్టపరిపాలనము కొఱకును నేర్పడినది." అని పలికి యామె తన పైఁటను విస్తరింపఁ జేసెను. ఇతరుల గోపకులైన గోపికలు కఱ్ఱలను దీసికొని ఆమెకు సహాయము నొసఁగుచుండెను. ఈ విధముగ వారు గోవర్ధన లీలాభినయమును గావించిరి.

తదనంతరము కాళీయదమన లీల నొనరించిరి. ఒక గోపిక కాళియుఁడయ్యెను. చాలమంది గోపులై కాళియ హ్రదమున జలమును ద్రావఁబోయెదరు. విషయమిశ్రిత జలమును ద్రావి చచ్చినట్లభిన యించెదరు. ఇంకొకయామె శ్రీకృష్ణుఁడై కాళియ హ్రదమున దుమికి కాళియునిఁ గవ్వించి, గద్దించి యిట్లనును :- "ఓరీ! దుష్టా! నీవు నిలుచుండుమురా. నీవు మదోన్మత్తుఁడవై యిచ్చట చాల యుపద్రవములు కావించినావు. నేఁడు నిన్నిచ్చటి నుండి వెడల నడిపెదను." ఇట్లుపలికి కాళియుఁడైన గోపిక మీఁదను శ్రీకృష్ణాను కరణ మొనర్చు గోపిక యెక్కి, దాని ఫణముల మీఁద నృత్యమొనర్చుట నభినయమును గావించెను. అంతఁగొందఱు గోపికలు నాగపత్నులై స్తుతి జేయ నారఁ

భించిరి. అప్పుడు శ్రీకృష్ణుఁడైన గోపిక కాళియుని విడిచి పుచ్చెను.

ఇంతలోనే అందఱును గార్చిచ్చు వచ్చుచున్నట్లభిన యించుచు నటు నిటు బరువిడున ట్లభినయించిరి. అందఱు నిట్లరచిరి :- "పోండిరా, పరుగెత్తుఁడు, వనమున దావా నలము వచ్చినది. శ్రీకృష్ణా! మమ్ములను రక్షింపుము. రక్షింపుము." అప్పుడొక గోపిక కృష్ణుఁడై యిట్లనెను :- "గోపగణములారా! మీరెవ్వరును భయపడకుఁడు. సమస్త విపత్తులనుండియును రక్షించు వాఁడను నేను మీ యెదుట నున్నాను. మీరందఱును మీ మీ నేత్రములను మూసి కొనుఁడు. నేను సహజముగ నే మిమ్ములను దావానలము నుండి రక్షించెదను." ఇది విని అందఱును దమ తమ కోమల కరములతోఁ దమ విశాలములగు గాటుక కండ్లను మూసి కొనిరి. శ్రీకృష్ణుఁడైన గోపిక దావానల పానమును జేసిన ట్లభినయ మొనరించెను.

అంత నొక్క గోపిక యశోదయై దధి మథనము చేయును. ఇంకొక గోపిక శ్రీకృష్ణుఁడై ఆమెను వెన్నను యాచించును. పాలు పొంగుటనుగాంచి యశోదయైన గోపిక పాలను దించుటకుఁ బరవిడును. అప్పుడు ఇంతలోనే శ్రీకృష్ణు డైన గోపిక కుండను బగులఁగొట్టి పాఱిపోవును. యశోదయైన

గోపిక, శ్రీకృష్ణుని పోకిరితనమునకుఁ గోపగించి ఆతనిఁ బట్టు కొనుటకుఁ బరువిడెను. గోపికను గట్టును పట్టుకొని తన కంఠ మందలి పుష్పమాలతో శ్రీకృష్ణుఁడైన గోపికను బంధిం చెను. ఈ విధముగ శ్రీకృష్ణ దామోదరుని లీల ననుకరిం చిరి. శ్రీకృష్ణుఁడైన నా గోపిక భయమును స్వాభావికముగ నటించెను.

సూతుఁడిట్లనెను - "మునులారా! నే నెంతని వర్ణించె దను. శ్రీకృష్ణ ప్రేమోన్మత్తలైన నీ వ్రజాంగనలు శ్రీకృష్ణ భావభావితులై ఆతని లీలలను జిన్నవాటిని బెద్దవాటిని నిట్లనేక లీలల ననుకరించిరి. ఒక వనమునుండి యింకొక వనమునకుఁ బోవుచుందురు. ఎచ్చటికిఁ బోయినను లీలాను కరణ మొనర్చుచుండిరి. ఒక్కొక్కప్పుడు వృక్షలతాగుల్మాదు లను మరలమరల ప్రభువునుగూర్చి అడుగుచుండిరి. ఈ విధ ముగ వారధిక విహ్వలలై యుండఁగా నింతలో భూమిమీఁద వజ్రాంకుశాది చిహ్నచిహ్నితమైన సైకతమునందు బాగుగా నంకితమైన శ్యామసుందరుని చరణ చిహ్నములు కనఁ బడెను. వానినిఁ జూడఁగా వారికెట్టి విచిత్రస్థితి కలిగినదో, దానిని యత్కించిత్తుగ దిగ్దర్శనముగ నేను మీకు జెప్పె దను. మీ రందఱును సమాహిత చిత్తముతో నీ పరమ పావన పునీత ప్రసంగమును శ్రవణము సర్పుఁడు."

# సాత్త్విక ఈర్ష్య

శ్లో॥ అనయారాధితో నూనం భగవాన్హరి రీశ్వరః।
యన్నో విహాయ గోవిందః ప్రీతో యామనయద్రహః॥

శ్రీ భాగ.౧౦స్క౦. ౩౦అ. ౨౮శ్లో॥

వ॥ "నిశ్చయముగ నీ సఖియే భగవదారాధనమును గావించినది. అందుచేతనే ఈతడు ప్రసన్నుఁడై మమ్ము నందఱను వీడి, ఒంటరిగా నీమెను దీసికొనిపోయినాడు."

గుణవంతుఁడు నిర్గుణునిఁ బొంది దోషిగా నెట్లగునో అట్లే అవగుణములును ప్రేమ సంసర్గముచే గుణములగు చుండునని మాటిమాటికినిఁ జెప్పుచునే యున్నాము. చింత, ఉన్మాదము, జడత్వము మొదలగునవి లౌకిక దృష్టిచే దోష ములు, కాని ప్రేమయొక్క సాత్త్వికానుభవము కలుగుటచే నివి గుణములగును. అదేవిధముగ లోకమున నితరుల యైశ్వర్యమును గాంచి యీర్ష్యను జెందుట మిక్కిలి గొప్ప పాపము. కాని ఈ ప్రేమమార్గమున నీర్ష్యకును మహత్త్వము కలదు. ఈ యీర్ష్యయందొక విధమగు సుఖముకలదు. రాధకు ప్రతిస్పర్థి చంద్రావళిగఁ జెప్పుచుందురు. ఒకనా డామె భాద్రపద శుద్ధ చవితి దినమునఁ జంద్రునిఁ బూజించు

చుండెను. ఒకానొక గోపిక వచ్చి యిట్లడిగెను:- "సఖీ! ఏమిచేయుచున్నావు. భాద్రపద శుద్ధ చవితినాఁడు చంద్రునిఁ గాంచిన దోషము లభించును. నీవు భక్తిభావముతోఁ బూజించుచున్నావు, దీనికి గారణమేమి?"

చంద్రావళి యిట్లడిగెను:- "భాద్రపద శుద్ధ చవితి నాఁడు చంద్రునిఁగాంచిన నేమి దోషము లభించును సఖీ!"

సఖి యిట్లనెను:- "ఒక దినమునఁ జంద్రుఁ డొక గొప్ప నిందితకార్యము నొనర్చెను. కావున నెవఁడీ దినమునఁ జంద్రుని ముఖమును జూచునో వారి కపవాదములు వచ్చును."

చంద్రావళి యిట్లనెను:- "శ్రీకృష్ణ సంబంధమున నాకును గళంకము సంభవింప వలయునని నేను పూజించుచున్నాను. అందఱును నన్ను శ్రీకృష్ణ కళంకగా భావించెదరు గాక!"

సారాంశ మేమనఁగాఁ బ్రేమమార్గమం దీర్ష్యను గలిగి యుండుటయును. గొప్ప విషయముగఁ జెప్పఁబడినది. ఏ భావమైనను నది సాంసారిక సుఖమునకు సంబంధించినదైనచో నది నింద్యమైనది. అదియే భగవంతునకు సంబంధించిన దైనచో నది వంద్యమైనదగును.

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ప్రేమమార్గ మెంత విచిత్రమైనదో చెప్పలేము. ప్రేమకు సంబంధించిన దే వస్తువైనను లభించిన నుద్దీపనము కలుగును. ప్రేమ జడచేతనములందు సుందరతను అసుందరతను జూడదు. వానికిఁ గావలసినది ప్రియతముఁడు. అతనికంటె నధికమైనది ప్రియుని మధుర స్మృతి. దేనివలన ప్రియస్మృతి నిరంతర ముండునో, అదియే ప్రేమ పథికునకుఁ గావలసిన నంతిమ యేకైకేచ్ఛ, దీనికొఱకే ఆతని తను మన చేష్టలన్నియును.

వ్రజాంగనలు బృందావనమందలి తరంగాయితమగు యమునా పులినమందలి విచిత్ర సైకతములందు నందనంద నుని చరణారవింద చిహ్నములను గాంచఁగనే వారి హర్ష మునకు మేఱలేకుండెను. ఆ చరణారవిందములను గాంచి వారు పరస్పర మిట్లనుకొనిరి- "ఈ చరణారవింద చిహ్నములు తప్పక చిత్తచోరుడగు శ్యామసుందరునివే".

అంత నా చరణారవిందములకు దూరమున నుండిన నొక సఖి యిట్లనెను:- "సఖులారా! అవి శ్యామసుందరుని చరణారవింద చిహ్నములని మీ రెట్లు తెలిసికొంటిరి?"

అంత నొకర్తుక యిట్లనెను:- "ఓహో! దీనిలోను సందేహమునకు స్థానములేదు. భగవానుని చరణములు సర్వసాధారణ పురుషుల చరణములవలె నుండవు, భగ

వాని చరణములందు గల ధ్వజ, వజ్ర, కమల, అంకుశ, యవాది చిహ్నము లింకొకని చరణములందుండఁ గలవా ? ఒకటి కాదు. ఇవి క్రమముగఁ బంక్తి బద్ధముగనుండిన జాల చరణ చిహ్నములు. వీనిలో భగవతా ద్యోతకములగు లాంఛనములు స్పష్టముగఁ గనఁబడుచున్నవి.''

అంతఁ గొంత ముందునకుఁ బోయి, తా లికిపడి యిట్లనెను:- ''ఈ చిన్న చిన్న పాదము లీచరణముల నాను కొనినే స్త్రీ చరణములో అవశ్యము శ్యామసుందరుఁడు తన ప్రియూకంఠమునఁ జేతులను వేసి యిటు పోయినాఁడు. కరిణి కరితోఁ బోవునట్లును, కోడె వెంటదగులు గోవుభంగిగను, మగనెమిలి సంకేతమున నాడునెమిలి చూడునట్లును, శ్యామ సుందరుని సంకేతానుసారముగ నాతని ప్రియయును వెంట వెంటఁబోయి యుండవచ్చును. ఆహా! రాధాదేవి యెంతటి యదృష్టవంతురాలు ! తన కరమును దన ప్రియతముని భుజముమీఁద వైచుకొని, ఆతని శరీరమునఁ దన శరీరము నానించి, ఆతని నెమిలిపింఛ కిరీటమునఁ దన చంద్రిక నానించుచు, వ్రేలాడు చుండిన నాతని యలకావళులకుఁ దన కేశపాశములను జిక్కించుచుఁ, దన నీలిచీరె నాతని పీతాంబరమును గలుపుచు, నాతని చరణ చిహ్నములను దప్పించుకొనుచు నడుగులు వేయుచు నాతని వెంట నా కు

పోయి యుండవచ్చును. జీవనలాభము నామెయే పొందినది తన సేవచే శ్యామసుందరుని సర్వవిధములను సంతుష్టి నొందించినది. అయ్యో! మన మభాగినుల మైతిమి కదా! మన కల్పసుఖము నొసంగి, మన లాలసత్వమును బెంచి, అల్పమగు రతిసుఖమును జూపించి అంతర్హితుఁడై నాఁడు.

ఈ విధముగ రాధా భాగ్యమును స్తుతించుచుఁ దమ భాగ్యమును ధిక్కరించుకొనుచు వాపోవుచుండిరి. శ్రీకృష్ణ చరణధూళినిఁ గనురెప్పలతో నెత్తి శిరస్సున ధరించిరి. వక్షః స్థలమునకు రాచుకొని శరీరతాపమును బోఁగొట్టు కొనిరి. మాటి మాటికిని ఆరజమును శరీరమునకు రాచుకొనుచుండిరి. అంత నొకతె యిట్లనెను:- "సఖులారా! మీరు మిమ్ముల నింతటి హతభాగినులనుగ నేలఁ జెప్పుకొను చున్నారు. మీరు విచారింపకుఁడు. ఈ బృందావన పరమపావన రజము సాధారణ వస్తువు కాదు. ఏ రజమునందు నందనందనుఁడు తన చరణారవిందముల నుంచినాఁడో, ఆ రజముయొక్క భాగ్యము నెవరు వర్ణింపఁగలరు. ఎంతగాఁ బొగడినను నది చాల అల్పమే కాఁగలదు. విధి, శంక, లోకపాలాదులీ రజో దర్శనము కొఱకై సదా ఉవ్విళ్లూరు చుందురు. ఏ లక్ష్మీ దేవియొక్క కృపాకటాక్షము కొఱకు గొప్ప గొప్ప వారు ఉవ్విళ్లూరు చుందురో, ఆ లక్ష్మియును నీ చరణ రజమును శిరస్సున ధరించుటకు సదా వ్యగ్రులైయుందురు. ఈ రజ

కణమును బొంది, తాము కృతార్థులమైతి మనుకొను చుందురు. ఆ రజమును మీరు స్వేచ్ఛగా శరీరమునకుఁ బూసి కొనుచున్నారు. మీ యనంగ తాపమును శాంత మొనర్చు కొనుచున్నారు. మీ రు ను దీసివైచిన భాగ్యశాలినులు కారు.''

అంత నింకొకసఖి యిట్లనెను:- ''సోదరీ మణులారా! మీరు మంచి యనుకొనుఁడు, చెడ్డయనుకొనుఁడు. నా మాటలను మీలోఁ జాలామంది చెడ్డగా ననుకొందురని నాకుఁ దెలియును, కాని నోటికివచ్చిన మాటను జెప్పుటయే యుచితము. శ్యామసుందర చరణారవింద చిహ్నాతమై, ఆతని స్పర్శచేఁ బావనమైన రజముచే మన చిత్తములు ప్రసన్నములగును; కాని ఆతని చరణ చిహ్నముల సమీప ముసఁ జెడ్డ మడములుకల చరణ చిహ్నములున్న వే వానినిఁ గాంచిన మా మనస్సులకు క్షోభ జనించుచున్నది. వానినిఁ గాంచిన నీర్ష్య జనించుచున్నది.''

వారిలో నొక గోపిక యిట్లనెను:- ''ఏ మమ్మా ? ఈర్ష్య యెందులకు ? ఇవి శ్రీకృష్ణ ప్రియయగు రాధాచరణ చిహ్నములు ప్రియునకు సంబంధించిన వన్నియును ప్రియ ములే కాఁగలవు. మన ప్రియుఁడే ప్రియురాలినిఁ ప్రాణ ములకంటె నధికముగఁ ప్రేమించునో ఆమె మనకు సర్వ

స్వాము. ఆమెను ప్రియునికంటె నధికముగఁ బ్రేమింప వలయును.''

అంత నా గోపికయే యిట్లనెను :- ''నీ వామెను ప్రియునికంటె నెక్కుడుగఁ బ్రేమించినఁ బ్రేమించుము. దానికి నేను గాదనను. ఇది నా మనస్సునకు సంబంధించిన మాట, కాని తన యభిప్రాయమును నితరులమీఁదఁ ద్రోసి వేయుట ఉచితము కాదు. మన మేమను కొనుచున్నామో దానినట్లే యితరు లనుకొనవలయును, మనము దేని నెట్లు భావించుచున్నామో, ఇతరులను దానినట్లే భావింపవలయు నని యనుకొనుట ఉచితము కాదు. శ్రద్ధయనునది యిత రులు చెప్పిన వచ్చెడిది కాదు. అది అంతఃకరణ ప్రేరణచే గలుగును. నీవు ప్రియునిఁ బ్రియురాలి నాదరించుము. నే నామె స్వార్థపరగా భావించెదను. అందఱకును సంబంధించిన సంపత్తి ననుభవించుట కందఱకును నధికారము కలదు. శ్రీకృష్ణుని యధరామృత పానమును నేకాంతముగ నొంటరిగఁ జేయుట స్వార్థలక్షణము గాక అదియేమి? ఈ కారణము వలన మా కామెమీఁద నీర్ష్యకలదు.''

అంత నా గోపిక యిట్లనెను:- ''దేవీ! అందఱకును యోగ్యత ఒక్కవిధముగ నుండదు. నీ వాతనికిఁ బ్రాణ ప్రియమైన సగుదువుగాక, రాధికాదేవి నీకు సవతియను

భావమును జెందినం జెందెదవుగాక, మేముమాత్రమామె దాసీకిని దాసీలుగా నుండుటకు యోగ్యులము కాము. మా కొక్కటే అవలంబనము. అది శ్రీకృష్ణ కృపయే. ఆతఁడు మమ్ములను స్వీకరించినను, గాలదన్నినను, పట్టుకొని కౌఁగి లించుకొన్నను, అన్నిటికంటె హీనమగు కైంకర్యమును జేయించినను మే మాతనికి గింకరులకు గింకరులము. ఆతఁడు మాకు ఆశాతీత సుఖము నొసంగెను. ఇప్పుడా సుఖమును స్మరించుకొని యేడ్చు చున్నాము. అటునిటుఁ దిరుగు చున్నాము.''

సూతుఁ డిట్లనెను:- ''మునులారా! ఈ విధముగ నా వ్రజాంగనను పరస్పరము మాట్లాడుకొనుచు శ్రీకృష్ణచరణ చిహ్నములు ననుసరించుచు ముందునకుఁ బోవుచుండిరి. ముందునకుఁబోఁగా శ్రీకృష్ణచరణ చిహ్నములను మాత్రమే గాంచి వారాశ్చర్యచకితులై వివిధవిధముల నూహించు చుండిరి.''

# కాముకుల దైన్యము-స్త్రీల దురాత్మత

౨౮౦

శ్లో॥ రమే తయా చాత్మరత ఆత్మారామోఽప్య ఖండితః,
కామినా దర్శయన్ దైన్యం స్త్రీణాం చైవ
దురాత్మ నామ్॥

శ్రీభాగ. ౧౦ స్కం. ౩౦ అ. ౪౩ శ్లో॥

వ. సఖులారా! ఇచ్చట ఆత్మసంతుష్టుండై, ఆత్మయందే రమించు శ్రీకృష్ణుఁడు కాముకుల దీనతను స్త్రీలదురాత్మతను జూపుటకై గోపికలతో రమించి యుండును.''

పాపియగు నీ కాముఁడు పురుషుల నిద్దరను స్త్రీదీనుల నొనరించును. మానవుని హృదయములోఁ గాముఁడు లేకున్నచో వానికిని శ్యామునకును భేదము లేదు. ఈశ్వరునిలో నున్న విశేషమిదియే. ఆతని మనస్సులోఁ గామము లేదు. ఆతని కితరులతో రమింపవలయునను నిచ్ఛ లేదు. తనలోఁ దాను రమించుటచేతనే రాముఁడనియు, ఆప్తకాముఁడనియుఁ బిలువఁబడుచున్నాడు. జీవునకు రమింపవలయునను నిచ్ఛ కలదు. ఆతని మనస్సులోఁ గోరికలు కలవు. కామము

వలన దీనత్వము ప్రాప్తించును. దీనతయే దుఃఖమునకు జనని. మానవుని యంతఃకరణమునఁ గామము లేకున్నచో నాతఁడు సింహమువలె గర్జించును. సింహము గజముకంటెఁ బెద్దది కాదు. ఏనుఁగునకున్న దోషమేమనిన దానికి అత్యధిక మగు కామము గలదు. అందువలన నది బంధింపఁబడు చున్నది. వాహనమగుచున్నది. సింహమునకుఁ గామము చాల అల్పముగ నుండునఁట. అది సంవత్సరమునకొకసారి మాత్రమే రమించునని చెప్పుదురు. కొందఱు జీవితములో నొక్కసారియే రమించునని కొందఱు చెప్పుచుందురు. ఏమైనఁగానిండు. అదియును గామవశమైనది. అందువలన నది అప్పుడప్పుడు పట్టుబడుచుండును. బోనులో బంధింపఁ బడుచున్నది. అది అట్లుండకపోయినచో దాని నెవరును దాకఁ జాలరు. కామము స్త్రీ పురుషులిద్దరి హృదయములందును నుండును. ఎవరికెంత కామ మధికముగ నుండునో వారంతగా నధిక హీనులయ్యెదరు. కోరికనే కామమందురు. ఆ యిచ్ఛ ధన, స్త్రీ; పుత్ర, మాన, ప్రతిష్ఠలలో నేదైనఁ గావచ్చును. కామమునకు వశమైనచో దీనత్వము వచ్చి తీరును, ఎవరి కా యిచ్ఛ యెక్కుడుగ నుండునో వారధిక దీనులగుదురు. పురుషునకు గామమెక్కుడుగ నుండినచో నాతఁడు స్త్రీ చేతిక్రింద నాటబొమ్మ కాఁగలడు. స్త్రీకిఁ గామ మెక్కుడగుచో నామె పురుషునకుఁ దొత్తయి ఆతని

సంకేతమున నాడును. శ్రీకృష్ణుఁడు ఆ లీలలను జూపుటకై యిట్టి మధురమధుర లీలల నొనర్చుచుండును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఆ గోపాంగనలు ప్రియతోఁ గూడి శ్యామసుందరుని చరణ చిహ్నముల ననుసరించుచుఁ జాలదూరమువఱకు పోయిరి. కొంతదూరముపోయి చూడఁగా నచ్చట శ్యామసుందరుని చరణచిహ్నములు కలవుకాని రాధికాదేవి చరణ చిహ్నములు దృష్టిగోచరములు కాలేదు. అప్పుడు వారు తమలోఁదాము ఇట్లనుకొనిరి:- "అక్కలారా! చూడు డెంతటి యాశ్చర్యమో. ఇచ్చట శ్యామసుందరుని చరణ చిహ్నములు మాత్రమే కలవు. రాధిక యిచ్చటినుండి యెచ్చటికిఁ బోయినది?"

అంతనొక ప్రగల్భయగు గోపిక ఇట్లనెను:-చూడఁగా నిచ్చట గఱిక కొంచెము కఠినముగ నున్నట్లున్నది. అందువలన నత్యంత ప్రేమకు వశీభూతుఁడై శ్రీకృష్ణుఁ డిచ్చట రాధను దన భుజములపై నెక్కించుకొని యుండవచ్చును. అతనికామె కత్యంత సుకుమార చరణములు నొచ్చునేమో నను భయము కలదు. ఓహో! అవశ్యమిదియై యుండవలెను. మీరు చూచుటలేదా ఈ చరణము లిచ్చట దిగబడిపోయినవి. బరువువలనఁ బాదములు పూర్తిగ దిగఁబడిపోయినవి"

ఈ విధముగఁ బలుకుచుఁ బలుకుచు, నా భార్యాక్రాంత చరణచిహ్న పదావళులను గాంచుచు ముందునకుఁ బోయిరి, ఇంకఁ గొంతదూరము పోయిచూడఁగా—"జాజి, సంపెంగ, మాలతీ, అడవిమల్లె, మల్లెపూలు పుష్పించియుండెను. పెద్ద పెద్ద విస్తృత లతావితానము లేర్పడినవి. అచ్చట వారికిఁ జరణ చిహ్నములు కనఁబడలేదు.. అందువలన వారు వెదుక నారంభించిరి. వారిట్లనిరి: "ఇచ్చటఁ జాలరకములగు చరచి చిహ్నములు కలవు. కొన్ని ముందున్నవి. కొన్ని వెనుక నున్నవి. రాధవియును గలవు, కృష్ణునివియుఁ గలవు ఓహో! ఇచ్చట శ్యామసుందరునిఁ బూలుకోయమని రాధిక బలవంత మొనర్చి యుండును. ఇచ్చట శ్యామసుందరుఁడు రాధకు వశుఁడైనట్లు తోఁచుచున్నది. అందుకనియే ఆమెను భుజముపై నెక్కించుకొని ఇక్కడవఱకు దెచ్చినాఁడు. ఇచ్చటఁ జూడుడు. ఇచ్చట జూడుఁడు. ఇచ్చట నామెను భుజము మీఁదనుండి క్రిందకు దింపినాడు ఇచ్చటఁ జూడుఁడు. వృక్షమును బట్టుకొని, దాని సహాయమున దిగి రాధ ఇచ్చటఁ గూర్చుండి యుండును. ఇచ్చటఁ గేవలము వాలుకాభూమి యందు ఆమె కూర్చుండిన చిహ్నములు స్పష్టముగ గోచరించుచున్నవి. ఇచ్చటఁ గొన్ని పుష్పములును రాలినవి. రాధ కానందమును గలుగఁజేయుటకై కృష్ణుఁడిచ్చటఁ బూలను గోసినాఁడు. కృష్ణుఁడు తన చేతులతో నీ లతా

భాగములను వంచి ప్రేమపూర్వకముగ వీనిమీఁద నుండిన పూలను గోసినాఁడు, ఆ పుష్పించిన లత లెంత పుణ్యమును జేసికొనినవో! అవును, ఇవి కొంచెముగ నెత్తైన లతలు. ఇచ్చట నెగిరి మదనమోహనుఁడు సుమసములను గోసినాఁడు. ఇచ్చట మడమను పడలేదు, కొనగోళ్లమీఁదనే నిలుచుండి పూల నందుకొనినట్లు స్పష్టముఁగ గనఁబడుచున్నది."

అంత నొకతె ఉత్సాహపూర్వకముగ నిట్లనెను:- "చూడుఁడిచ్చట నిప్పుడే విడిపోయి రాలిన పూలున్నవి. మదనమోహనుఁ డిచ్చటనే ప్రియతమకు హారమును గూర్చినట్లున్నది."

ఇది విని చాలమంది గోపిక లటునిటు హారచిహ్నములను వెదుకుచుండిరి. ఒకతె పెద్దగా నిట్లనెను: "ఇచ్చటికి రండు. ఇచ్చటికి రండు. ఒక విషయము తెలిసినది. చూడుఁడిచ్చట నుంగరములు తిరిగిన సుందరములగు రెండుమూఁడు వెండ్రుకలు రాలినవి. నిశ్చయముగ నివి రాధికాదేవి తల వెండ్రుకలు. ఇచ్చటను శ్రీకృష్ణుఁడామె వెండ్రుకలను దువ్వినట్లున్నది. ఇచ్చట నామె వెండ్రుకలను దువ్వెనతో దువ్వి జడవైచినట్లున్నది. చూడుఁడిచ్చట పుష్పములు పడినవి. అచ్చటచ్చట చిన్నచిన్న ముత్యములుకూడ పడినవి.

ముత్యములతోడను, పువ్వులతోడను దన ప్రియురాలియొక్క కేశపాశముల నలంకరించినట్లున్నది. ఓహో! చూడుఁడిచ్చట నిద్దరును గూర్చుండిన స్పష్ట చిహ్నములు గోచరించుచున్నవి. వనమాలి ఇచ్చట జడవైచిన గుర్తులుండుటచే నామెకుఁ కృష్ణుఁడు జడవైచుట నిస్సందేహము.''

ఇది విని శౌనకుఁ డిట్లడిగెను: ''సూతా! జడవేయు పని సైరంధ్రిది. స్త్రీలే స్త్రీలకు జడలను వేయుచుందురు. పురుషుఁడయ్యును శ్రీకృష్ణుఁడు రాధకు జడవేసిన దెందులకు?''

ఇది విని సూతుఁడిట్లనెను: ''స్వామీ! పురుషుఁ డెప్పుడు స్త్రీకి వశుఁడగునో అతనికిఁ బురుషత్వముండదు. ఆతఁడా సమయమునఁ గొయ్యబొమ్మ యగును. ఆ సమయమున నాతనిచే జడలు వేయింపవచ్చును, తలను గొరిగింపవచ్చును, గుడ్డ లుదికించ వచ్చును, పూలు గ్రుచ్చింపవచ్చును, చివరకు పాకీపనినైనను జేయింపవచ్చును. నూనె తీయింప వచ్చును, పాదసేవనైనఁ జేయింప వచ్చును. ఆ సమయమున నిది చేయవచ్చును, ఇది చేయరాదను భేద భావముండనే యుండదు. ప్రేమ నియమమునకుఁ బరమగు వస్తువు కదా! దానిలో నేపనియును నింద్యము కాదు. మన ప్రేమ దేనిచే నానందమును జెందునో, దేనిచేఁ బ్రియుని నత్యధికముగ స్పర్శించుట జరుగునో దానియం దత్యధిక

సుఖము కలుగును. ప్రేమమార్గ మతి వికటమైనది. దాని కేమియును నియమములు లేవు. కాని అది అంతులేనిది, హద్దులేనిది, దానికి హద్దులేదు, పద్దులేదు. అంతులేదు, పొంతులేదు, నియమమును లేదు. అచ్చట దేనివలన రస వృద్ధి కలుగునో అదియే చేయవలసి యుండును."

మునులారా! గోపికలు గూఢచారులు. వారికిఁ దెలియును. కృష్ణుఁడు రాధతో నిచ్చట సమస్త సుఖక్రీడ లొనర్చెనని వారు తెలిసికొనిరి. వారిచ్చటఁ జాల సేపటి వఱకు అనేక స్థలనము లొనర్చి యుండవచ్చును.

శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! భగవానుఁడు తన ప్రతిష్ఠకు విరుద్ధముగ నిట్టిక్రీడ లేల నొనర్చినాఁడు?"

అంత సూతుఁ డిట్లనెను:- "స్వామీ! భగవానుని కారణములను జీవుఁ డెట్లు తెలిసికొనఁ గలఁడు. భగవానుఁడు త్రికాలములందును, నెన్నఁడును గామవశుఁడు కాఁడను సంగతి సూత్రము నిశ్చితము. ఈ లీల నాతఁడు కాము విజయమును బొందుటకై అనంగునిఁ గర్వించి చేసినాఁడు. తనలోఁ దానే రమించుచు నాత్మ సంతుష్టినిఁ బొందినవాఁ డితరులవద్ద దీనుఁడు కావలసిన నవసర మేమున్నది. ఇతరుల సంకేతమున నాడవలసిన పని యేమున్నది? సుఖ సామగ్రి తనయొద్దనుండ నపరకలితో బుట్టినవాఁడే యితరులను యాచించె

దరు. ఇతరుల కధీనులయ్యెదరు. నిత్యస్వరూపుడైన వాఁడు ఇతరుల వద్దనుండి వచ్చు సుఖము కొఱకేల, గనిపెట్టుకొని యుండఁగలఁడు. ఇతరులతో నేమి పనియుండును? ఆత్మ యందు రమించువాని కింకొక రమణి దాసత్వమును స్వీక రింప వలసిన నావశ్యకత యేమియున్నది? అయినను లోక లీలను జూపించు కొఱకై కాముకుల దీనతను దిగ్దర్శన మొనర్చుటకై, స్త్రీలయొక్క దురాత్మతను దర్శింపజేయు టకై దామోదరుఁ డీ లీలను బ్రదర్శించినాఁడు.''

అంత శౌనకుఁ డిట్లనెను:- ''సూతా! కామమునకు వశీభూతులై, చేయరానిపనులు చేయఁ బూనుదురను గాముకుల విషయము స్పష్టముగనే యున్నది. కాని ఇందులో స్త్రీల దురాత్మత యేమున్నది?''

సూతుఁ డిట్లనెను:- ''స్వామీ! ఇచ్చట దురాత్మత యనిన, నధీన మొనర్చుకొనుటే. పురుషుఁడు కామమునకు వశీభూతుఁడు కానంతవఱకు స్త్రీ అధీనయై యుండును. చూడుఁడు. వంశీధ్వనిని విని గోపికలు వచ్చి మొదట దీన వాక్కులతోఁ బ్రార్థించిరి కదా! కృష్ణుఁడు వారిని స్వీకరింపఁ గనే వారి కహంకారము కలిగెను. ప్రపంచమునఁ దామే శ్రేష్ఠుల మనుకొనుచుండిరి. పురుషుఁడు కామమునకు వశీ భూతుఁడగుచో వానిని స్త్రీలు కొయ్యబొమ్మ నాడించి

నట్లాడించెదరు. వానిని గట్టిగా బంధించెదరు. అదృష్టవంతు లైనచో ఆ బంధమునుండి బయటఁబడుచుందురు. కాకున్న నీ వైపునకు వచ్చినవానికి ఉద్ధారము కలుగుట అసంభవ మగును. పైఁగా వారాతని నెత్తిపై కెక్కుదురు. వానినిఁ దమ కిష్టమువచ్చి నట్లాడించెదరు.''

శౌనకు డిట్లనెను:- ''సూతా! ఏమి? పురుషుని దోష మేమియును లేదా? పురుషుఁడు దురాత్ముఁడు కాఁడా?''

సూతుఁ డిట్లనెను:- ''స్వామీ! ఇచ్చట దోషప్రశ్న లేనేలేదు. ఇచ్చటఁ గేవలము వివశతను వర్ణించుటలోనే తాత్పర్యము. దోషమును గూర్చి అడిగినచో దోషమంత యును బురుషులదే. చంద్రుఁడు తన కిరణములను బ్రసరింపఁ జేయకుండినచోఁ జంద్రకాంతమణి యెన్నడును ద్రవింపనే ద్రవింపదు. చంద్రుఁడు తన కిరణములను బ్రసరింపకుండినచో నిది యసంభవమగును. కిరణములులేక అది యుండఁజాలదు. అది దాని స్వభావము. మానవుఁడు కామచేష్టను బ్రదర్శింప కుండుట అసంభవము. అట్లుండిన నది యవశ్యము కఠినమే యగును. స్త్రీజాతి పురుష ప్రవృత్తినిఁ గాంచిన ద్రవించును. దాని మనస్సునందును నట్టి భావము వచ్చెనా, దానికిఁ గామిని యను నామము సార్థకమగును. ఆ యవస్థయందు నేమి చేయుమనిన దానినిఁ జేయును. అర్థము, అనర్థమును

జరుగును. మానవుని వశపఱచుకొని సమస్తమును జేయించును. ఏ యుపాయముచేతను బని జరుగకపోయినచో, దానిని గామినీ ద్వారమునఁ జేయించుచుందురు. స్త్రీకి అబలయను పేరేల వచ్చినది? అ యనిన ననంగుఁడు. అనఁగా ననంగునకు బలము కావున నబలయను పేరువచ్చినది. అనంగుని బలము ప్రపంచమున నందఱికంటె గొప్ప బలము. అందువలన స్త్రీ జాతి అన్నిటికంటె నాకర్షకమైనది. అందఱికంటె బలవతి యని చెప్పఁబడినది.''

శౌనకుఁ డిట్లనెను: ''సూతా! ప్రసంగమును నీరసమేలఁ గావించుచున్నావు. ఇది అత్యంత సరస ప్రసంగము. సరే, తరువాత నేమైనది? తరువాత కథను చెప్పుము.''

సూతుఁ డిట్లనెను - సరే స్వామీ! నేనిప్పుడు తరువాతకథను జెప్పెదను. రాఁగోపు కథ ఇంతకంటెను సరసమగుకథ. దానిని సావధానులరై శ్రవణ మొనర్పుఁడు.''

# రాసలీల – ధర్మ మర్యాద

[ భూమిక ]

శ్లో॥ సంస్థాపనాయ ధర్మస్య ప్రశమాయేతరస్య చ।
అవతీర్ణోహి భగవా నంశేన జగదీశ్వరః॥

స కథం ధర్మ సేతూనాం వక్తా కర్తాభిరక్షితా।
ప్రతీప మాచరద్బ్రహ్మన్ పరదారాభిమర్శనమ్॥

శ్రీ భాగ. ౧౦ స్కం, 33అ. ౨౭, ౨౮ శ్లో.

మత్తకోకిలము॥

ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియు నైన స
త్కర్ముఁ డీశుఁడు ధర్మశిక్షయు ధర్మరక్షయుఁ జేయఁగా
నర్మిలిన్ ధరమీఁదఁబుట్టి పరాంగనా జన సంగ మే
ధర్మమంచుఁ దలంచి చేసె నుదాత్త మానస చెప్పుమా!

శ్రీ మదాంధ్ర భాగవతము.

భగవానుని యొక్క రాసలీల సాధారణముగ ధర్మ మర్యాదకు విపరీతముగ గోచరించు చున్నది. గొప్పవారేమి పనినిఁ జేయుదురో, దేనినిఁ బ్రమాణముగ గ్రహించెదరో ఇతరులును దాని ననువర్తించెదరు. రాసలీలా ప్రసంగమును వినుచుండఁగాఁ బరీక్షిన్మహారాజున కిదే శంక కలిగెను. భగవానుని రాసలీలను బ్రమాణముగ గ్రహించి దాని ననుకరించినచో ధర్మ మర్యాద నిలువనే నిలువదు. సర్వత్ర కదాచారము, వ్యభిచారము వ్యాపించును. పాతివ్రత్యమును, ఏకపత్నీ వ్రతమును నశించును. అందువలన నాతఁడీక శంకను రాసారంభముననుు, దానినే ప్రకారాంతరమున రాసాంతముననుు బునరుద్ఘాటించెను.

భగవద్భక్తుఁడగు పరీక్షిన్మహారాజునకు శంక కలుగు టేమి? ఆతఁడు సాధారణ మానవులకు ప్రతినిధిత్వమును వహించి శంకను జేసెను. దానికి శుకమహర్షి యెట్టి సమాధానమును జెప్పినదియు దీనిని భాగవతకథా పాఠకులు రాఁబోవు నధ్యాయమునఁ జదువఁగలరు. దాని నీ భూమికలోఁ జెప్పుటంత ఆవశ్యకము కాదు. మన మిచ్చటఁ బరీక్షిన్మహారాజు శంకపై విచారింపవలయును. ఆతని శంక యొక్క ముఖ్యసార మిది:- భగవానుఁడు పాపపుణ్యరహితుఁ డైనఁ గుగాక! ఆయినను నాతఁడు భూమిమీఁద ధర్మ సంస్థాపనార్థ మవతరించినాఁడు. ఆతఁడు తన వాక్కులతో ధర్మమునే చప్పెను. ధర్మకార్యములనే ఆచరించును. ధర్మ మర్యాదను రక్షించును. ఇట్లయ్యును నాతఁడిట్టి యధర్మ కార్యములందును దారతమ్యముంచును. దొంగతనమును, పరస్త్రీ గమనమును మిక్కిలి గొప్ప పాపములు. భగవానుఁడు పరస్త్రీలతో నిట్టి రసయుక్తమగు క్రీడ నేల నొనర్చెను. దీని వలన నందరకును నవకాశము చిక్కెను. వారును రాస ననుకరించెదరు.

పరీక్షిత్తుని శంక నిర్మూలనము కాలేదు. దాని పరిణామమును నేఁడు ప్రత్యక్షముగఁ గాంచుచున్నాము. ధూర్తులును, మోసగాండ్రును, వ్యభిచారులును, గొంతమంది

మహిళలను మోసగించి వారి చెవులలో నిట్లు చెప్పుచుందురు. "నీవు గోపివి, నేను కృష్ణుఁడను" దీని పరిణామ మేమి కావల యునో అది కాఁగలదు. వ్యభిచారము పెరుగును. ఇంటిలోఁ గలహములు చెలరేగును. భ్రూణహత్యాది గొప్ప గొప్ప పాపములు జరుగును. తమ కార్యములకుఁ బరిణామ మేమి జరుగునో స్వార్థులగు వారీ దోషములను జూడనే చూడరు. తమయొక్క అల్పకాలపు స్వార్థ సిద్ధికొఱకు జఘన్యాతి జఘన్య పాపమును జేయుచుందురు.

ఒక యవన రాజుండెను. ఆతఁడు వందలకొలది స్త్రీలను దనయంతఃపురమున నుంచుకొనెను. తాను గృష్ణుఁ డనని చెప్పుకొని వారితో సమస్త విధములగు ఘృణిత క్రీడల నొనర్చుచుండును. ఫలాని వాని వద్దకు చాలమంది స్త్రీలు వెళ్లుచుందురు, ఆతఁడు వారిలో రాసానుకరణమును జేయు చుండునని భారతవర్షములోఁ బ్రతిప్రాంతమందును గలవని వినుచున్నాము, కొలది సంవత్సరములకుఁ బూర్వమే గుజ రాతునం దిట్టి కలియుగ కృష్ణు డుద్భవించినాఁడు. ఆతఁ డెందఱనో కన్యకలను దూషితము కావించెను. చివర కాతడు పట్టుపడెను. ఖైదునకును బోయెను. ఇంకెనో జరి గెను. నాకు దెలిసినంతవఱకు నేనొక మిథ్యాకృష్ణునిఁ జూచి తిని. కాని అతనిని మే మేమియును జేయఁజాలక పోయితిమి.

ఇట్టి ధర్మద్వేషులగు ధూర్తులను దండించుట రాజుయొక్క కార్యము. కాని మన మత విరహిత రాజ్యమునందు బలాత్కారము దోషము; కాని పరదారాభిగమనము పాపము కానే కాదు. కావున వారివలనఁ బ్రయోజనము లేదు. ఎప్పుడైనను నీ కార్యము సంఘముపై నున్నది. ఏ సంఘము నందు కఠినమైన నియమబంధన ముండునో ఆ సంఘము దురాచారమునుండి అంతగా రక్షింపఁబడును. నేఁడు మన సమాజబంధనము అత్యంత శిథిలమై పోయినది. ప్రజలు వారి యిష్టముప్రకారము నడుచుకొనుచున్నారు. సాధు వేష మెంతో పవిత్రమైనది కదా! సాధువు మీఁద సంఘమున కెంతో విశ్వాసముండెడిది. ఎప్పుడో ఉండుట కాదు, ఇప్పుడును గలదు. కాని కొందఱు స్వార్థులగు ధూర్తులు మిథ్యా వేషములను వైచుకొని యీ పవిత్ర వేషమును గలంకిత మొనర్చిరి. సమాజము నేటికిని సాధువుయొక్క సాధుత్వము మీఁద నిశ్శంకతోడనే యున్నారు. వారి పవిత్రతమీఁద విశ్వాసము కలిగియున్నారు. ఏదైన గొప్పది, కొద్దిది గాని పని జరిగియుండినచో దానిని సమాజము క్షమించెడిది. నేఁటికిని భారతవర్షమున సాధువేషమున కెంతటి ఆదరము కలదో అట్టి ఆదరమింక దేనికిని లేదు. సాధువేషమును గాంచఁగనే సాధారణముగ నందఱు మస్తకములు స్వాభావిక

ముగ వంగును. ఒక సజ్జనుఁడు నాకిట్లు చెప్పెను. ఒక రాజ మార్గముగుండా ఒక గొప్పరాజు పోవుచుండెను. అందఱును లేచి నిలుచుండి అతని కభివాదనమును గావించిరి. ఆతని వెనుకనే ఒక వృద్ధుఁడగు పండి మహాత్ముఁడు వచ్చుచుండెను. ఆతనికి విశేషముగఁ జదువను, వ్రాయును దెలియదు. అయినను అందఱును లేచి ఆతని చరణము లంటిరి. అప్పుడా శాసకుఁ డిట్లనను:- "యథార్థమగు శాసకుఁడీ సాధువే, హిందువుల హృదయములలో నాతని కాదరము కలదు. నాకు వీరు భయముచే ననిచ్ఛాపూర్వకముగ నొక చేతితోఁ బ్రణామము చేయుచున్నారు, ఈ సాధువును హృదయముతో నాదర మొనర్చు చున్నారు."

వాస్తవిక విషయమింతయే. వంశపరంపరాగతమున సాధువువలన నెన్నటికిని కల్యాణము జరుగదను విశ్వాసము కలదు. "కలుగఁ బోవదు సాధుచేఁ గార్యహాని" అందువలన సాధువు గృహస్థుల గృహములలో నిర్భయులై ప్రవేశించెదరు. వారికి పరదా లేదు, సంకోచమును లేదు. మన యింటిలోని మన తోఁబుట్టువులును, కూతుండ్రును, ఇతర స్త్రీలును వారితో సంభాషించుచుండిన మనకు మనస్సులో సందేహమగు శంకయును గలుగదు. మందు లమ్ముకొనువారు తమమందు లొక మహాత్ముని అనుగ్రహమున లభించినదని చెప్పినచో నది యెక్కువగ నమ్ముదుబోవును. దాని నెక్క-

డుగ విశ్వసించుచుందురు. ఒక ఔషధాలయమువారు వారి ఔషధమును బ్రకటించుటలో "నిది మహాత్మా ప్రవత్త శ్వేతకుష్ఠ నివారిణి" అని వ్రాయఁగా జాలమంది 'ప్రదత్త' అనుచోట ప్రభుదత్తయని అర్థము చేసికొని "స్వామీ! యీ శ్వేతకుష్ఠౌషధము మీదియేనా?" యని నన్నడిగిరి. చాల మంది ఔషధముల నమ్మకొను స్త్రీలిట్లు విజ్ఞాపన మొనర్చు చుందురు. "ఒక రోజున నే నింటిలోఁ గూర్చుండి యుంటిని చింతగా నుంటిని. అప్పుడొక మహాత్ముఁడా సమయమునకు భిక్షకు వచ్చినాఁడు. ఆతఁ డమ్మా! ఏల చింతగా నుంటివి?" అనెను. అప్పుడు నేను 'నాకు ప్రదరరోగ'మంటిని. వెంటనే ఆతఁడు నాకొక ఔషధమును జెప్పెను. నేను దానినిఁ దినఁగా మూఁడు దినములలో నా ప్రదరరోగము పోయినది. ఇంకొక యామె యిట్లనెను:- "నాకు సంతానము కలుగ లేదు. ఒక మహాత్ముఁడొక మూలిక నొసంగినాఁడు. దాని వలన నాకు ముగ్గురు సంతానము కలిగిరి. ఈ ఔషధము గిట్టిన ఖరీదునకే యీయఁబడును." ఇదే విధముగఁ బురుషు లలో నౌషధముల నమ్మువారిట్లు వ్రాయుచుందురు:- "నాకు ధాతుక్షీణరోగ ముండెడిది. ఒకానొక దినమున నొకకొండ మీఁద నాకొక మహాత్ముఁడు కనఁబడెను. ఆ మహాత్ముఁడు నాకొక మూలిక నొసంగెను. దాని వలన నాకు స్వస్థత కలిగినది. కొందఱు తమ సురమాను గుఱించి యిట్లు ప్రక

సించెను:- "ఇది ఘోర సురమా" ఇందులోఁ జాల నిజమే కావచ్చును. కొన్ని అసత్యములును గలవు. ఇంతకు నేను చెప్పున దేమనఁగా సాధువనిన నిప్పటికిని శ్రద్ధ జనములో గలదు. కాని అది క్రమ క్రమముగాఁ దగ్గిపోవుచున్నది. చాలమంది దీనినే వృత్తిగాఁ బెట్టుకొని, ధూర్తులను, స్వార్థులునై సాధువేషమును ధరించి లోకులను మోసగించు చున్నారు. ఈ పవిత్ర వేషమును గళంకిత మొనర్చుచున్నారు.

ఇదివఱలో వర్ణాశ్రమ ధర్మమున కొక నిశ్చిత మర్యాద కలదు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు వర్ణములుండెడివి. బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసము లను నాల్గు ఆశ్రమములు కలవు. బ్రాహ్మణుఁడు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థ, సన్న్యాసాశ్రమములను నాల్గు ఆశ్రమములను దీసికొనుట కధికారము కలదు. క్షత్రియునకు బ్రహ్మచర్య, గృహస్థ, వానప్రస్థాశ్రమములను బుచ్చుకొనుట కధికారము కలదు. క్షత్రియునకు సన్న్యాసాధికారము లేదు. వర్ణాశ్రమ ధర్మానుసారముగ క్షత్రియుఁడు తన ధర్మమును విధ్యుక్తముగ ననుష్ఠాన మొనర్చిన నాతఁడు మరుసటి జన్మమున బ్రాహ్మణుఁడై సన్న్యాసమును గ్రహించి చివరకు ముక్తిని బొందును. క్షత్రియు లెవ్వరును సన్న్యాసమును దీసికొనెడి వారు

కారు. వారికి వీరసన్న్యాస విధానము కలదు. అనఁగా సన్నజలములను వీడి ఉత్తరర ఖండమునకుఁ బోవుచుండ వలయును. అనఁగా పాండవులు చేసినట్లు చేయ వలెను. ఎచ్చటనైన క్షత్రియుల సన్న్యాసమును గూర్చి చెప్పియుండినచో నది ఆలింగ సన్న్యాసమని గ్రహింప వలయును. వైశ్యులకు బ్రహ్మచర్య, గృహస్థ ధర్మములు రెండాశ్రమములే కలవు. వారికి వానప్రస్థ సన్న్యాసా శ్రమ విధానము లేదు. ఆతఁడు కావలయునని కఁ గొర్పటిక వేషమును ధరింపవచ్చును. తీర్థయాత్ర నొనరించుటకై కాషాయవస్త్రమును ధరించి, భుజముమీఁదఁ గావడినిఁ బెట్టుకొని తీర్థయాత్రలు చేయవచ్చును. విధ్యుక్తముగ వానప్రస్థమునకే అధికారము లేదు. సన్న్యాసము సంగతి అట్లుంచుడు. శూద్రున కొక గృహస్థాశ్రమమునకే అధి కారము కలదు. సంస్కార మొనరించుటకును, యజ్ఞ మును జేయించుటకును, దీక్షాదు లొసంగుటకును, వర్ణా శ్రమ ధర్మమునందు కేవలము బ్రాహ్మణులకే అధి కారము కలదు. ఇతర వర్ణముల వారు సంస్కారముల నొసర్పరాదు. సంస్కార మొనర్చుటకును, దీక్షనిచ్చుటకును వీలు లేదు. నేడీ వర్ణాశ్రమ మర్యాద భిన్న భిన్నమైనది. జనులు వారికిష్టము వచ్చినట్లు వర్తించుచుండిరి. అన్నివర్ణ ముల వారును గుడ్డలను రంగులో ముంచి సాధు వేషములను

ధరించి తమ జీవితములను జరుపుకొనుచున్నారు. మంత్ర దీక్ష నొసంగు నీ పవిత్ర కార్యమును తాము జీవనాధారముగ నేర్పఱచుకొనిరి. నాతో నొక సజ్జనుఁ డీట్లు చెప్పినాఁడు:- "మా గ్రామమున నొక చర్మకారుఁ డున్నాఁడు. అతఁడు సాధువేషమును ధరించి, మధ్యప్రాంతమునకుఁ బోయి, చాల గ్రామములలోని ప్రజలకు మంత్రదీక్ష నొసంగి శిష్యులను జేసికొనుచున్నాఁడు. వారిలోఁ జాలమంది బ్రాహ్మణులును గలరు. తర్వాతఁ గొన్నిదినములకు వానియింటికి రాఁగా నాతఁడు చెప్పులను గుట్టుచుండుటను గాంచి వా రాశ్చర్య చకితులైరి. ఇట్టివి ఒకటి కాదు అనేక సంఘటనములు కలవు' కొంచెము మాటలాడుటయును, మోసము చేయుటయును శక్తియుండినచో నాతఁ డమాయకులగు జనమును ముఁనుగ మోసమొనర్చు కొనుటకై మంత్రదీక్ష నొసంగుచుందురు. ఇట్లు చేసేవారు స్వయముగ నరకమున కధికారులగుదురు. తమ శిష్యులను గూడ నరకమునకుఁ గొనిపోవు ప్రయత్న ములను గూడ చేయుచుందురు. వేదమును, వర్ణాశ్రమ ముల నంగీకరింపని శిక్కులు మొదలగు వారి విషయమున నీ ప్రశ్నయే లేదు. కాని మేము వర్ణాశ్రమ ధర్మముల నంగీకరించు చున్నామనుకొను వారును నిట్టి ధర్మవిరుద్ధ కార్యముల నొనర్చుచు లోకులను మోసగించుచుండిరి. నట్టి స్వార్థుల నెవరాప గలరు? శాస్త్రముల నంగీకరించినచో

నుపదేశ మొనర్చుటకు బ్రాహ్మణులకు తప్ప యింకెవ్వరికిని దీక్షనొసంగు నధికారము లేదు. కాని వారు స్వార్ధవశముచే నిట్టి యంధులై, ఈ విషయమున శాస్త్రముల నవహేళన మొనర్చెదరు. వర్ణాశ్రమ ధర్మమందు కేవలము బ్రాహ్మణునకే సన్న్యాసాధికారము కలదు. ఆతనికి జ్ఞానముకలుగును. జ్ఞానమువలన ముక్తి లభించును. భక్తిమార్గమున సమస్త వర్ణముల వారికిని సమస్తాశ్రమముల వారికిని నధికారము కలదు. దానిలో భగవద్భజనముచేఁ బరమగతి ప్రాప్తించును. దానిలో నెవరికిని నిషేధము లేదు. అయినను వైష్ణవ ధర్మమందు దీక్షను దీసికొనుటకును, బరమగతినిఁ బొందుటకును సందఱకును నధికారము కలదు, కాని దీక్షనొసంగు నాచార్యులు ప్రథమ వర్ణమునకే కలదు. ఇప్పుడా మర్యాదయును భంగమైనది. ఇది కాలప్రభావము. ప్రజలు స్వార్ధాంధులై గురువు లగుచున్నారు.

స్వార్థులు గురువులై ముందుగా స్త్రీలను తను, మన ధనముల నన్నిటినర్పింపఁ జేసికొందురు. తాను భగవంతుఁడ నని చెప్పి పాపకర్మ లొనర్చెదరు. దీనికి శ్రీగోపికాకృష్ణుల దృష్టాంతము నొసంగెదరు. కొంద ఱిట్లను చుందురు :- "ప్రేమలో నియమ మేమియు నుండదు" ప్రేమలో నియమము లేదన్నమాట నిజమే కాని ప్రేమయుండినఁ గదా ?

ఇది కామవాసన. కామపూర్తికై నీవు ప్రేమ శబ్దమునకు గళంక మేల నాపాదించెదను? కొందఱిట్లను చుందురు:- "వారిలో నేదో తత్త్వము లేకున్నచో నింతటి యాకర్షణ మేల ఉండగలదు? ఒకని వెనుక ఇంతమంది స్త్రీ పురుషు లేలఁ దిరుగుచుందురు."

ఆకర్షణ మనేక విధములుగ నుండును, సాత్త్వికాకర్షణ ముండవలయునను నియమము లేదు. రాజస, తామసాకర్షణ ముండును. ఎంతో సంయమియును, సదాచారియు గులీనుఁడును, కర్మిష్ఠియు నగు నజామీళుఁడే వేశ్య రూపమునకు దాసుఁడై కుల మర్యాదలను, వేద మర్యాదలను వదలి వైచినాఁడు. ఇది ధర్మవిరుద్ధ రూపమగు నాకర్షణము. ఇదే విధముగ నొక సుందర, సువేషము గల యువకునిఁ గాంచిన సతియగు స్త్రీల కాకర్షణము కలుగును. తన పాపమును గప్పిపుచ్చుటకై పైకి భక్తి కీర్తనములను గపటము నొనరించెదరు. లోలోపలఁ దన కామవాసనను వ్యక్త మొనర్చుకొందురు. స్వర్గమందలి అప్సరసలకు వారిపుణ్యము నశింపఁగానే యత్కించిత్పుణ్యాంశము మిగిలినచో వారు భూమిమీఁదకు వచ్చి అత్యంత సుందరులగు వేశ్యలగుదురు. ఆ పుణ్యప్రభావముచే వారికి సౌందర్యప్రాప్తి కలుగును. ఆ యాకర్షణ

మునఁ జాలమంది కాముకులగు యువకులు వారిచుట్టును
దిరుగుచుందురు. ఈ విధముగనే గంధర్వ, కింపురుష,
మనుష్యాదులు పుణ్య ప్రభావమున స్వర్గలోకాదులలో
సుఖము ననుభవించి, తమ తమ పుణ్య పాపకర్మ ఫలముల
ననుభవించు భూమిపైకి వచ్చుచుందురు. కొంచెము పుణ్యము
శేషించి యుండుటచే వారు సుందరులుగను, గాయకులుగను
వక్తలుగను వాక్చాతుర్యాదులచే కళలతోఁ గూడుకొని
జన్మించుచుందురు, వారి వాక్చాతుర్య కళాదులచేఁ గామి
నులును, పథభ్రష్టులగు పురుషులును వారినిఁ జుట్టుకొందురు
దాని వలన వారికి గర్వముకలుగును:- "నే నీశ్వరుఁడను,
నేను భోగిని. నేను సిద్ధుఁడను, నేను బలవంతుఁడను, నేను
సుఖిని, నేను ధనవంతుడను, శక్తివంతుఁడను, నన్నుఁబోలిన
వాఁ డింకొకఁ డెవఁడున్నాఁడు?" వారు గర్వమున మత్తెక్కి-
గొప్ప గొప్పవారి నవమానించుచుందురు. ఇంకెవరిని లక్ష్య
పెట్టరు. వారి కనుచరులును నట్టివారే లభించుచుందురు.
వారు మిథ్యాప్రశంస లొనర్చుచు వారినింకను గొప్పవారిని
జేయుదురు. దీనివలన వారు సమాజమందు కదాచారమును
బెంచుచుందురు. వారికొక పద్ధతి కలదు. దానిని నేను నా
యనుభవమునఁ జెప్పుచున్నాను. వారు తమ మూఢ అను
యాయులకు బ్రతిదినము నిట్లు బోధించుచుందురు:- "నా కుల
మహిమంబు నెఱుఁగవు వేదములును" వారు వేదశాస్త్రము

లకు దూరముగ నుందురు. తమ అనుయాయులను వానికి దూరముగ నుంపఁజూతురు. తాము పూజను జేయించు కొనుచుందురు. తమ మహిమమును వెల్లడించు కొనుచుం దురు. పాప పుణ్యములకు భేదభావమును జూపరు. తమకు తోఁచిన నాచరణమును గావించుచుందురు. వారి కేదైన నెదురు చెప్పితిమా వారిని ధూర్తులందురు. ఈర్ష్యాళు లందురు. ఇంక నేమియో అనుచుందురు. ఇట్లు శాస్త్ర విరుద్ధ కార్యము లొనర్చువారి ఆటలెన్నియో దినములు సాగవు. చివరకు వారి అనుయాయులలో నుండియే కొందఱు స్వార్థసిద్ధి కలుగక పోవుటచేత, వారి దురాచారములకు విసుగును జెందియో, లేక యేకారణము చేతనో వారికి దూరమగుచుందురు. వారికి వ్యతిరేకముగ సంఘమును స్థాపించెదరు. చివరకు దానికి బరిణామస్వరూపముగ రాజాభి యోగమును సాగును. ఆ దురాచారులగు పురుషులు చివ రకు స్త్రీలచేఁ జంపఁబడుదురు. లేదా అసాధ్యభయంకర రోగములు సంభవించినచో వానిని సర్వులును విడిచివైచె దరు. చివరకు వారత్యంత దుర్గతిచేఁ జచ్చెదరు. ఎవరైన నీ లోకమునఁ దప్పించుకొన్నను యమధర్మరాజు వారి నెన్న టికిని విడువఁడు. ఇట్టివి అనేకోదాహరణములు కలవు. కన్ను లారఁ జూచితిమి. ఇట్లయ్యును జనులీ పాపకర్మల నొనర్చుచుఁ బాషండు లగుచుందురు. ఏలననఁగా వారు వివశు లగు

చున్నారు. తమ యింద్రియ తృప్తికొఱకు వ్యామోహవెంటఁ దిరుగు వారినిఁ గూర్చి మనము చెప్పవలసిన పనియే లేదు. మనము చెప్పఁదలఁచినది సాధనాభావముచేఁ బోవు సాధకులకుఁ జెప్పుచున్నాము. వారి దురాచారములను గాంచుచును వీరు మహాపురుషులు, వీరికి విధినిషేధము లేమియునుండవని భావించుచు వారి నంటిపెట్టుకొనియుండు సాధకులకే చెప్పు చున్నాము. నేనట్టివారికి అది భ్రమయని హెచ్చరిక చేయు చున్నాను. ఎచ్చటనైనను నిట్టి దురాచారములు కనఁ బడెనా అది మోసమనియు, నాతఁడు మోసగాఁడనియు నమ్మవలయును, ఎచ్చట కృష్ణ. గోపికా క్రీడను అడ్డముగ గైకొని నడచెదరో అది కామవాసనయని తెలిసి కొన వలయును.

ఇది చేయఁదగినది, ఇది చేయఁదగనిది యనుటకును, ఇది కార్యము, ఇది అకార్యమనుటకును శాస్త్రమే ప్రమాణము. కావున శాస్త్రీయ విధానమును దెలిసికొని సాధన యందు బ్రవృత్తినిఁ జెందవలయును. స్థూలమగు గుర్తు ఒకటి కలదు. ఎచ్చట సదాచారముండునో అచ్చట సాత్త్విక సాధన యుండఁగలదు. ఎచ్చట దురాచారముండునో అచ్చటఁ గామవాసన యుండును, శివునికంటె సిద్ధుఁ డెవఁ డుండఁగలఁడు? సతీదేవి కొన్నిక్షణముల కాలము మాయ

సీతారూపమును ధరించెను. కేవల మీ కారణము చేతనే ఆతఁడు మరల సతీదేవిని పత్నీభావమున నింక స్పృశింపలేదు. ఆమె యా శరీరమును వదలి మరలఁ బార్వతీ శరీరమును ధరించిన తరువాత నామెను స్వీకరించెను. శివునకు విధి నిషేధ బంధన మేమున్నది? కాని యాతఁడు ధర్మమర్యాదను పాలించెను. లోకమర్యాదను గూడ దృష్టిలో నుంచుకొనవలయును. శ్రీరామచంద్రభగవానుఁడు కేవలము లోకమర్యాదను పాటించుటకొఱకే నిష్కళంకయును, నిష్పాపయునగు సీతాదేవినిఁ బరిత్యజించినాఁడు. శాస్త్రీయ మర్యాదను విడిచి యెవఁడు తన కిష్టము వచ్చినట్లు నడుచుకొనునో ఆతనికి సిద్ధి కలుగదు. ఆతనికి లోకమున సుఖముండదు. పరలోకమున సుగతియుండదు. కావున శక్తికొలఁది ధర్మమర్యాదను పాటింపవలయును.

కొందఱు చెప్పుదురు:- "కలియుగమున ధర్మమర్యాద పాలనము జరుగదు. కలియుగములో ధర్మముండదనియు, మర్యాద యుండదనియు, వర్ణాశ్రమ ధర్మము లుండవనియు శాస్త్రీ సదాచారము లుండవనియు శాస్త్రములలో వ్రాయఁబడినది. పిల్లలు గురువులై, ఉచ్చాసనముపైఁ గూర్చుండి ఉపదేశము లొసంగెదరు. బ్రాహ్మణులచే సేవను జేయించుకొందురు. ఇవన్నియు సత్యములైనను వర్ణాశ్రమ ధర్మ

ముల వెంటఁబడు టెందులకు? ధర్మమర్యాద, ధర్మమర్యాద యని కేకలు వేయుచు నసఫల ప్రయాసను జెందు టేల?'' కలియుగమున వర్ణాశ్రమ ధర్మమర్యాద యుండదనుట తథ్యము. కలియుగమందలి స్త్రీపురుషులు వారి కిష్టము వచ్చినట్లు చేయుచుందురనుటయును సత్యము. వారు ధర్మ మర్యాద నంగీకరింపరు. అయినను మనము చేతనైనంత వఱకు ధర్మ మర్యాదను బాలించుటకుఁ బ్రయత్నింపవలయును. వృద్ధుడైన మన తండ్రి యే నాఁడో మరణించు నని మనకుఁ దెలియును. ఆతఁడు శాశ్వతముగ జీవింపఁడు. అయినను జ్వర పీడితుఁడై, రోగగ్రస్తుఁడైనపుడు యథాశక్తిగ నౌషధసేవ చేయవలయును. చేతనైనంత వఱకు ఉపేక్షింపఁ గూడదు. భగవంతుని విధానము ననుసరించి జరుగున దేమియో జరుగ గలదు.

కొందఱిట్లనుచుందురు:- "ఏమైనఁ గానిండు. శ్రీకృష్ణుఁడు ప్రేమపరవశుఁడై గోపికలతో రాస నొనర్చినాఁడు. మేమును నెవరిమీఁదఁ బ్రేమకలదో వారితో రాసక్రీడ నొనర్చిన దీనిలో హాని యేమి కలదు?''

ఇప్పు డట్లు చేయువారి నెవరును నడ్డగించు వారు లేరు. ఏమియును జేయఁగలవారును లేరు. కాని వారు మతము పేరిటను శ్రీకృష్ణుని పేరిటను జేయవలయునని యే మా

ప్రార్థనము. అధర్మము, కామము వీనిపేరునఁ జేయుఁడు. శ్రీకృష్ణుని రాస ననుకరింపఁ దలంచినచో ముందుగా నీ విషయములను మనస్సున నుంచుకొన వలయును.

1) శ్రీకృష్ణుఁడు రాసచేసినప్పు డాతని వయస్సు తొమ్మిది పది సంవత్సరముల కంటె నెక్కువ వయస్సు లేదు,

2) భగవానుఁడు రాసను అవరుద్ధసౌరతము అనఁగా నస్ఖలిత వీర్యుఁడై చేసినాఁడు.

3) భగవానుఁ డెందఱు గోపికలుండిన నన్నిరూపము లను ధరించెను.

4) భగవానుఁడు గోపికల దివ్యదేహములతో రాసను రచించెను. వారి స్థూలదేహము లింటిలో వారి పతులవద్ద పడియుండెను. అందువలనే గోపికలు తమవద్దనే ఉండు టను గాంచిరి.

5) భగవానుఁడా గోపికలతో రాస నొకటి మర్యాదతోఁ జేసెననఁగా అది ఆ గోపికలకును, బరమ భక్తులు నగు వారికి తప్ప ఇంకెవ్వరికినిఁ దెలియదు. శిశుపాలుఁడు భగవాను నన్నియో తిట్లు తిట్టినాఁడు; కాని రాసనుల్లేఖించి అతఁడు తిట్టలేదు.

వీటన్నిటిని జేయుటకు నీకు సామర్థ్యమున్నచో నీవు రాస నొనర్చుటకు సిద్ధపడుము. అట్లు కాకుండిన నీ కామ వాసనా పరిపూర్తికొఱకు 'రాస' శబ్దమును గళంకితమొనర్పకుము. భాగవత కథా పాఠకులయెడ నా కాత్మీయత కలదు. ఇట్టి శాస్త్రవిరుద్ధాచరణము నెచ్చటఁ జూచినను, ఆతఁ డెంతటి ప్రభావశాలియగు వ్యక్తియైనను నాతనికి సాధ్యమగు నంత వఱకు దూరముగ నుండుటకుఁ బ్రయత్నింపవలయునని నేను నా సలహా నొసంగుచున్నాను. అట్టివారితో స్వార్థమును సాధించుకొనఁ దలచినవారు నా మాటలనేల లక్ష్యపెట్టెదరు? వారికొఱకుగా దీ సలహా. ఎవరైనను భ్రమవశమునఁ బొరపాటున నిట్టి ధర్మవిరుద్ధ కార్యమునఁ బ్రవేశించు వారికే నా అభిప్రాయము దెలుపుచున్నాను.

# రాధయొక్క మానము

౯౮౧

శ్లో॥ సా చ మేనే తదాత్మానం వరిష్ఠం సర్వ యోషితామ్।
హిత్వా గోపీః కామయానా మామసౌ భజతే ప్రియః॥
(శ్రీ భాగ. ౧౦ స్క. 30 అ, 3౬ ॥శ్లో

సీ॥ "పతుల దైన్యంబును భామల క్రౌర్యంబుఁ
జూపుచు విభుఁడొక్క సుదతిఁ గూడ
విహరింప నది యెల్ల వెలఁదుల వర్జించి
నాయొద్దనున్నాఁడు నాథుఁడనుచు
గర్వించి రాఁజాలఁ గమలాక్ష మూఁపున
నిడుకొనుమనుడు న య్యీశ్వరుండు"
—శ్రీ మహాంధ్ర భాగవతము

మానము వియోగముయొక్క పూర్వ రూపము. దేనిని గాంచిన మనస్సునకు మానము, అహంకారము కలుగునో, అది మనకు దూరమగుచున్నదని తెలిసికొనవలయును. ధన మానము, రూపమానము, ఐశ్వర్య మానము, సుందరతా మానము, గుణ మానము మొదలగునవి యీ గుణముల న్యూనతను ప్రకాశింపఁ జేయుటకొఱకే వచ్చుచుండును. కాని ప్రేమమార్గమందా విషయము లేదు. ప్రేమ మానముచే వృద్ధియగును. ప్రేమ మానముచే నింకను రాటు తేలును, ఇచ్చటను మానము తరువాత విరహము కలుగును. విరహజన్య దుఃఖము ననుభవింపవలసి యుండును; కాని ఆ విరహ దుఃఖము కోటి సుఖములకంటెను నధిక సుఖకర మైనది. ఆ విరహమందు నిరంతరము ప్రియుని స్మృతి యుండును. ప్రేమ మార్గమందు శరీరములు కలియుటాత

గొప్పగాఁ జెప్పఁబడలేదు. శరీరము కలియుట తుచ్ఛ మైనది. యథార్థమగు కలయిక మనస్సుదే. మనస్సుతో నెవరిని సదా కలిసికొందుమో, ఎవని స్మృతి నిరంతర ముండునో, నిద్రించుచున్నను, మేల్కొనుచున్నను, లేచుచున్నను, కూర్చుండినను, నెవని మధురమూర్తి కన్నుల యెదుట నాట్యమొనర్చునో అదియే నిత్య సంయోగము. విరహమందు హృదయము ద్రవీభూతమగును. హృదయమునకు దీనత్వము కలుగును. ప్రియునియొక్క ఒక్కొక్క మాట యేకాంతమున జ్ఞాపకమునకు వచ్చుచుండును. ఆ సమయమున నాతఁడిట్లనెను. ఆతఁడిట్లేలఁ జేసినాడు? ఏలనఁగా నాతఁడు నన్నెక్కువగఁ బ్రేమించినాఁడు కావుననే. అయ్యో! నేను అభిమానమునకు వశీభూతనై ఆతని సన్మానింపలేదు. రాఁగానే అభ్యుత్థాన మొనర్పలేదు. ఈ విధముగ నాతని అతీత స్మృతులు చలనచిత్రములవలె హృదయ పటలమునకు వచ్చును. విలీనములగును. మఱల నూతనత్వము వచ్చును. మఱల స్మృతి నూతన వేషమును ధరించి వచ్చును. ఈ విధముగ నీ క్రమము నిరంతరము నడుచుచునే యుండును. అందువలనఁ బ్రేమ మార్గమందు పూర్వరాగము కలయక, కలయిక తరువాత మానమునకు స్థానము కలదు. మానము కలిగిన తరువాతనే మహనమోహనుఁ డంతర్ధానమగును.

అప్పుడే విరహజ్వాల లుత్పన్నములై సమస్తాశుభములను భస్మమొనరించి, అంతఃకరణమును విశుద్ధము కావించును.

సూతుఁ డిట్లనెను:- ''మునులారా! మన్మథుని మనస్సును గూడ మథనమొనర్చు మదనమోహనుఁడు తనకు బరమ ప్రేయసియగు రాధికను దీసికొని సఖులందఱిలోనుండి అంతర్ధానమయ్యెను. సఖులాతని నన్వేషించుటలో నున్మత్తలై అటునిటుఁ దిరుగుచుండిరి. రాధికాదేవి ఏకాంతమున నాతనితో సుఖక్రీడలొనర్చుచుండెను, ఎవరెంతటి గొప్పవారుగ నుండెదరో, వారి యావేగమును నంత గొప్పగనుండును. కొలఁదుల భావనయును కొలఁదిగానే యుండును. గొప్పవారు ముఖ్యముగా నెవరివైపును నాకర్షింపఁబడెదరు. కదాచిత్తుగ నట్లు కలిగినా, వారి యా యాకర్షణము సహజముగఁ దొలఁగిపోవును. గొప్పవారి విషయములన్నియును గొప్పగనే యుండును. గొప్పవారు కానిండు, కొలఁదులు కానిండు, ఎవరే మార్గమున నడుగిడెదరో, వారు దానికి సంబంధించిన సుఖదుఃఖముల ననుభవింపవలసి యుండును. ఉడుతయొక్క దుఃఖము ఒక ప్రత్తికాయవలననే నిండిపోఁగలదు. ఏనుఁగు ముఖమొక్క మోపు చెఱకుగడల చేతనైనను నిండదు. పాత్ర యెంత పెద్దగా నుండునో, దానిలోనికి రసమును నంత యధికముగ వచ్చును.

మిగిలిన గోపికలు ప్రేమపూర్ణమునఁ గ్రిందిమెట్లలోనే యున్నారు. అందువలన వారికల్ప సౌభాగ్యమునకే మానము కలిగెను. వారైశ్వర్య మదముచే మదమత్తలైరి. అందువలన శ్యామసుందరుఁడందఱకును సంతృప్తిఁజేసెడు విరహానుభవమును గలిగించెను. కాని రాధికాదేవికీ సార్వజనిక సమ్మిళిత సుఖమేమంత విశేష మహత్వముగల వస్తువు కాదు. అందువలన శ్యామసుందరుఁడు అందఱను బరిత్యజించి, ఒంటరిగ నామెను ఐకాంతిక రతిసుఖమును గలిగించుటకై నికుంజములలోనికి దూరముగఁ దీసికొనిపోయెను. అచ్చట నామెతో నాతఁడెట్టి సుఖద, ఎంత మనోజ్ఞ, ఎంతటి యలౌకిక లీలల నొనర్చెనో అవి అనిర్వచనీయములు. వానినిఁ జెప్పుట అసంభవము, అనుభవ పూర్వకముగఁ దెలిసికొనుటయును మానవబుద్ధికి అతీతమైనది. [illegible]నుభవమును భక్తిభావనుఁడగు భగవానుఁడు కృపఁజూపి స్వయముగ దానినిఁ గలుగఁజేసినపుడే భాగ్యశీలురగు భక్తులు చేసికొనఁగలరు. కావున దాని విషయము నిచ్చట నేమియును జెప్పఁబడుట లేదు.

ప్రేమ మహాసాగరమున నొకటి తరువాత నింకొకటి, దాని తర్వాత నింకొకటిగ నిరంతరము తరంగములు వెల్లువుచుండును. అవి రాకుండ నుండఁజాలవు. నిరంతరము నిరంతరము వచ్చుచుండుటయే వాని స్వభావము. లీల ఒక్క విధమున నుండదు. అది నిత్యనూతనముగ నుండును. నూత

స్యామునకే లీల యొసఁగును. సమాగమ సుఖాగారమున మాన తరంగములుబుకును. ఈ విషయమునుగూర్చి మేము మాటిమాటికిని జ్ఞాపకము చేయుచున్నాము. దీనిని మీరు పునరుక్తి దోషముగ భావింపరాదు. ఏలననఁగా నీ మానము ప్రాకృతమగు నికృష్టమాన మెన్నటికిని గాదు. ఇది ప్రేమ వృద్ధిప్రకారము.

శ్యామసుందరుఁడు తన సంకేతమున నాడునదియును, తన పాదములకుఁ గష్టము కలుగఁ గలుగకుండుటకై తన్ను భుజముమీఁద నెత్తుకొని మోయుచుండుటయును, తానేది యడిగిన దానిని వెంటనే తెచ్చియిచ్చుటయును, ఆతని పీతాంబరమునఁ దన చెమటను తుడుచుటయును, తన చేతితో నోట నేమైనఁ బెట్టి తినిపించుటయును, స్వయముగఁ దన జడ నల్లుటయును, మాటిమాటికిని నా మొగము దర్పణమును జూపించుటయును, ఆమె వస్త్రాభూషణములను సవరించుటయును, తన్నుఁ దన తొడమీఁదఁ గూర్చుండఁబెట్టుకొని దీనతాభావమునఁ దన ముఖమును జూచుటయును, తన ముఖాకృతిని వర్ణించుటయును, ఎల్లప్పుడును శంకితుఁడైయుండుటయు, తనకేది ఆనందముగ నుండిన దానిని హఠపూర్వకముగఁ జేయుటయును, సారాంశముగ నాతఁడు తన కృపకు నిరీక్షించుటయును గాంచి రాధిక యిట్లనుకొనెను:–"ఆహా! నేనెంతటి

భాగ్యవంతురాలను. ఎవని కృపకొఱకు బ్రహ్మాది దేవతలును నువ్విళ్లూరుచుందురో, తహతహలాడుచుందురో, గొప్పగొప్ప వారెంత స్తుతించినను వారివైపునకుఁ గన్నెత్తియైనను నెవఁడు చూడఁడో అట్టివాఁడు నేఁడత్యల్పమును, నీచము నగు సేవ నొనర్చుచున్నాఁడు. ఎంతమందియో స్త్రీలాతని దృష్టిపాతము కొఱకు తహతహలాడుచుందురు. ఆతఁడు వారి నందఱను దుచ్ఛముగ భావించి నన్నే సర్వశ్రేష్ఠయగు సుందరిగ భావించి, యిచ్చటకే కాంతమునకుఁ దీసికొని వచ్చినాఁడు, ఆజ్ఞాపాలన మొనర్చు ననుచరునివలె నాకు బ్రేమపూర్వకముగఁ బరిచర్య నొనర్చుచున్నాఁడు. ఏ కామినుల నీతఁ డేడ్చుచుండ విడిచివచ్చినాఁడో వారందఱును నీతని మీఁద ననురక్తినిఁ జెందినవారే. ఈతని భక్తులు. అయినను నా మూలమున వారినందఱ నుపేక్షించినాఁడు. నన్నాతఁడు వారందఱికంటె సమ్మానించినాఁడు," ఈ విధముగ నామె కాలోచనము రాఁగానే ఆమె మనస్సులోఁ బ్రేమగర్వ ముత్పన్నమయ్యెను. ప్రేమగర్వితయగు వనితకు నాయకుని నాట్యమాడించుటలో నొకవిధమగు నద్భుతానందానుభూతి కలుగును. అధికాధికముగ నాతనిఁ దన వశమొనర్చుకొనుటకు యోచించుచుండును. అందువలనఁ బ్రియుని అధిక సంస్పర్శ సుఖానుభూతిలోభమున రాధికాదేవి ఆతనితో

నిట్లనెను:- "ప్రియుడా! నీవు నన్నీ నిబిడ వనమునఁ ద్రిప్పు చున్నావేమి ?"

అత్యంతానురాగముతో శ్యామసుందరుఁ డిట్లనెను:- "ప్రియా! నేను నిన్ను సంతోష పెట్టుటకై, నీ కృపను బొందుటకై యీ కార్యముల నన్నిటినిఁ జేయుచున్నాను. ఇచ్చటి కతి సమీపముననే ఒక నిబిడ వనము కలదు. అచ్చటికి నిన్నుఁ దీసికొనిపోయి సుందరములగు దృశ్యములను జూపించెదను. నీ కొఱకై సుందరములగు సుమనములను గోసి తెచ్చి నీ శరీరమంతయును స్వయముగ నాభూషణములుగ నొనర్చి అలంకరించెదను. పుష్పశృంగార మొనర్చి నిన్నలంకరించెదను. నీ కొఱకై అతి కోమలమగు బుష్పశయ్య నొనర్చెదను"

చిరుప్రేమ కోపస్వరమున రాధ యిట్లనెను:- "నీవు చెప్పు నిబిడవన మెంతటి దూరమున నున్నదో! నేను రాఁజాలను."

మమతాభరిత వాక్యములతో మదనమోహనుఁ డిట్లనెను:- "అలసితివా? ఇప్పటికి దగ్గరకే వచ్చితిమి. చూడు మెంత కమ్మని వాసనలు వెదజిమ్ముచున్నవో. అదిగో! ఆ కనఁబడుచున్న సఘనలతా వితానము పొంతకుఁ బోవలయును. చాల దగ్గఱగనే యున్నది. పోవుదము పద."

రాధ గద్దించి యిట్లనెను :- "రమ్మనిన నెట్లు రాఁగలను. నేనిప్పుడొక్క అడుగైనను బెట్టఁ జాలను, ఎట్టి యెగుడు దిగుడు చోటునకుఁ దీసికొని వచ్చితివి. నడిచి కాళ్లు లాగుకొని పోవుచున్నవి. శరీర మంతయును శిథిలమై పోయినది."

అనురాగ భరితస్వరమున శ్యామసుందరుఁ డిట్లనెను:- "ఇటు తెమ్ము. చరణసేవ నొనర్చెదను."

అదరిపడి రాధ యిట్లనెను. అఁ, వలదు. నీ చరణ సేవ నాకు వలదు."

ఆధీనుఁడై శ్రీకృష్ణుఁ డిట్లనెను :- "కోపము వచ్చినదా యేమి ? నా వలన నేదైన నపరాధము జరిగినదా ? నా యపరాధమును క్షమింపుము. ఇచ్చట భూమి సమముగ లేదు. ఇంక ముందు మంచి సుఖద స్థలము కలదు. నా భుజమును బట్టకొనిరమ్ము."

అంత రాధ యిట్లనెను :- "నీవు నాతో అతిగా వాదవివాదము నొనర్చుట మంచిది కాదు. నేనొక్క అడుగునైనను బెట్టజాలను. ఆ ఘన నికుంజములకే పోఁదలఁచినచో నన్ను నీ భుజముమీఁద నెక్కించుకొని నీ యిష్టము వచ్చిన చోటునకుఁ దీసికొనిపొమ్ము, నేను కాళ్లతో నడువఁ జాలను."

శ్యామసుందరుఁ డానందమును బ్రకటించుచు నిట్లనెను :- 'ఆహా! నా అదృష్టము. నా శరీరము నాయీ ప్రియురాలి సుఖద కైంకర్యమునకుఁ బనికి వచ్చినది. నీకు ఎగిరి కూర్చుండుట కష్టమగుచో నిచ్చట నొక దిబ్బ కలదు. దాని మీఁదకు నిన్నెక్కించెదను. నేను దానిక్రింద నిలుచుండెదను. దీనినుండి నీవు సహజముగనే నా భుజము మీఁద కెక్కఁ గలవు.''

రాధ యిది విని గర్వముతో నిట్లనను :- ''సరే, అయితే నీవు నన్ను దిబ్బమీఁదకు ముందుగా నెక్కింపుము.',

శ్యామసుందరుఁడు రాధ నెత్తుకొని దిబ్బమీఁద కెక్కించెను. అతఁడు కొంచెముగ వంగి, ఆమె పాదముల దగ్గఱగ భుజమును దీసికొనిపోయి వినమ్రతతో వంగి నిలుచుండెను. రాధికా గర్వము పరాకాష్ఠ నందుకొనెను. మెట్టెలు, కాలి వెండి గొలుసులు, చుట్లు, కడియములు, గొలుసులు, అందెలు, పట్టాలతోఁ గూడిన యామె యడమ కాలిని శ్రీకృష్ణుని భుజముమీఁద నెక్కుటకుఁ బెట్టఁబోవు నంతలో శ్రీకృష్ణుఁడు వెంటనే అక్కడక్కడనే అంతర్ధానమయ్యెను.

సూతుఁడిట్లనెను :- ''మునులారా! రాధ గల గల శబ్దమొనర్చు చుండిః తన పాదమును శ్రీ కృష్ణుని భుజ

మునఁ బెట్టఁబోవు నంతలో నాతఁ డంతర్థానము కాఁగా నామె అత్యంతాశ్చర్యమును జెందెను. ఆమె తన పాద మును కృష్ణుని భుజముమీఁదఁ బెట్టఁబోఁగా నాతఁ డంత ర్థానము కాఁగా క్రిందఁ జూడఁగా నాతఁడు లేఁడు. ఆమె అటునిటు నిచ్చటఁ జూచినను శ్యామసుందరుఁ డెచ్చటను గనఁబడలేదు. అప్పుడామెకు తానే అందఱికంటె సౌందర్య వతిననుగర్వమును, స్త్రీలందఱిలోఁ దానే శ్రేష్ఠురాలనను మదమును నణఁగిపోయెను. ఆమె శరీరము తెలియక, ఏమి యును దోచక, మోసపడి తానసహాయురాల నైతినను నను భవమును జెందసాగెను ఆమె కన్నుల వెంట నశ్రువు లను గార్చుచు వెక్కి వెక్కి యేడ్వ నారంభించెను. ఇంత వఱ కెవఁడున్నాఁడను నభిమానమా మెకుఁ గలదో, ఇప్పు డాతఁ డంతర్హితుఁడైనప్పు డింక నాకు కేమి అభిమాన ముండగలదు. వేళ్లు లేక వృక్షమెట్లు నిలువఁ గలదు? అభి మానము పాఱిపోఁగా నా స్థానమును దీనఁత ఆక్రమించెను. ఆమె అత్యంత దీనయై రోదనము చేయ నారంభించెను.''

# విరహ విహ్వాల కృష్ణప్రియ

గాథ

శ్లో॥ హా నాథ రమణ ప్రేష్ఠ క్వాసి క్వాసి మహాభుజ!
దాస్యాస్తే కృపణాయా మే సఖే దర్శయ సన్నిధిమ్॥
శ్రీ భాగ. ౧౦ స్కం. 30 అ, 30 శ్లో॥

సీ॥ మొఱఁగి పోయినఁ దాపమునఁబొంది యో కృష్ణ
ఎక్కడఁజనితి ప్రాణేశ రమణ
తే॥ నీకు వరవుడ నయ్యెద నిలువుమనుచు
వగవ.... ........

—శ్రీ మదాంధ్ర భాగవతము

ఆహా! ఈ విరహిణుల సాహసమును ధన్యమైనదే. భగవంతుఁడెవరి కెంతటి దుఃఖమునొసంగునో, వానికంతటి దుఃఖమును సహించు శక్తియు నొసంగును. అట్లు కాకున్న మీరూహింపుఁడు. ఎవని దర్శనము కొఱకు కన్నులు సదా తృషితములైనవో, వారి చిత్తములేతని రూపమాధురిని తదేక దృష్టితోఁ గానము చేయఁదలఁచి, కనుపాపలలోనే నిలుపుకొనును. ఎవని వియోగమొక్క క్షణ మొక్క కల్ప

ముగఁ దోచుచుండును. ఇట్టి ప్రియకముఁడు లేక యింతటి దీర్ఘ రాత్రులు నిద్రింపక, పొరలుచు వియోగ దుఃఖముతోఁ గడుపుచుండిరి. నిజముగ విరహిణుల హృదయమును భగవానుఁడశ్మ సారముగ నొనర్చినాఁడు. అందువలన నది బ్రద్దలగుట లేదు, విచ్చిపోవుట లేదు. ప్రపంచమున నన్నిటి కంటె గొప్ప సుఖమేది? ప్రియదర్శనము! ఏ సమయమునఁ బ్రియుని సాక్షాత్కారమగునో. స్వర్గాపవర్గములును వైకుంఠ మును లభించినట్లుండును, ప్రపంచమున దుఃఖమేది? ప్రియ వియోగము ప్రియుఁడు లేక గడిపిన క్షణములు క్షణములు కావు, శ్వాసలను బూర్తి చేసికొనుటయే. ప్రారబ్ధమును భోగించుటయే.

వియోగమున ననేక భేదములు కలవు. కాని ముఖ్యముగ రెండు భేదములున్నవి. ఒకటి సంభావిత వియోగము, రెండవది అసంభావిత వియోగమును. సంభావిత వియోగము చక్రవాకముల జంటకు గలుగు వియోగము వంటిది. పగలు కలిసియుండును. కాని రాత్రియందు కలిసి యుండవు. సాయంకాలము కాఁగానే కమలములను సంకుచిత మొనర్చి అరవిందైక బంధువగు భువనభాస్కరుఁడస్తాచలము నకుఁ బ్రస్థానమొనర్పఁగనే చక్రవాకములలోఁ బెంటి యొక ప్రక్కకును, బోతు ఇంకొక ప్రక్కకును బోవును. 'ఇట్లు

కాకుండఁ జేసికొనుట కెవరికిని శక్తి లేదు. అట్లు జరిగినచో తీరవలయును. రెండవది అసంభావిత విరహము. సారసపారసి పక్షులెన్నఁడును విడిచియుండవు. కలిసియుండును. అవి ఒక్క క్షణమైనను విడిచియుండవు. ఇంతలోనే ఒక లుబ్ధకుఁడువచ్చి, మొదలక సారసమునొక విషాక్త బాణముచేఁ గొట్టును. ఇప్పుడు సారసి తన ప్రియతముఁడు లేక ఒంటరిగా గొట్టుకొనును. అది ఎప్పటికైనను దన ప్రియునిఁ గలిసికొందునను నాశ దానికి లేదు. కాని అట్లు జరుగకున్నను దైవము దానికిఁ బ్రతికూలుఁడైనాఁడు. ఆ ప్రారబ్ధము దాని పతిని దాని దృష్టికిఁ గనఁబడకుండఁ జేసినది. సంభావిత విరహముకంటె అసంభావిత విరహము మిక్కిలి దుఃఖదాయినిగ నుండును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! రాధికా దేవికి తానే అందఱికంటె నధిక సుందరిననియు, అందులకే శ్యామసుందరుఁ డందఱను వీడి తన నొక్కతెను నేకాంతమునకుఁ దెచ్చి, తనకే సమస్త సుఖప్రదానమొనర్చుచున్నాఁడను గర్వము కలిగెను. ఆమె కాతఁడధీనుఁడైనాఁడనుకొనును. ఆమె కతిస్వల్పమగు సేవలను మిక్కిలి యుల్లాసముతోడను నుత్సాహముతోడను జేయుచుండుటచేఁ దనకంటె సౌభాగ్యశాలినులగు గామినులు ప్రపంచములో నెవరుందురు. ఇప్పుడు నేను శ్రీకృష్ణుని ప్రేమ రసజ్జువులచే గట్టిగా బంధించితిని.

ఆతఁడు తన్ను వదలి యుండఁజాలఁడు. ఇప్పుడిఁక నెప్పుడును నిట్లే కలిసియుండెదమను గర్వముండెను. ఈ యాలోచనలలో నామె విరహజన్య వ్యథను మఱచెను. సంయోగము వియోగముకొఱకేనను సంగతి ఆమెకుఁ దెలియదు. అంకురముత్పన్నమైనచో దానికి యెఱువు, నీరు, అనుకూల పరిస్థితి ప్రాప్తించినచో నది అవశ్యము పుష్పించి, ఫలించును.వియోగము లేకున్న సంయోగ మాధుర్యము వృద్ధికాదు. దానికి నూతనత సంభవింపదు. ప్రేమ స్వరూపము నిత్య నూతనత కలుగుటయే. వియోగమువలన సంయోగతృష్ణ పెరుగును. పిపాసరోగమునందు ఆగిఆగి యెంతగా నీరు త్రాగినా నంతగా జలతృష్ణ కలుగును. కావున నాలోచించినచో వియోగము చెడ్డదికాదు. ఎవరికెవరి కెవరితో నెంతటి అధికస్నేహముండునో వానికంతటి అత్యధిక వియోగజన్య దుఃఖముండును. రాధికాదేవికి సంభావిత విరహము ప్రాప్తించెను. రాధికాదేవి యెగిరి శ్రీకృష్ణుని భుజముపై కెక్కఁబోవఁగా నచ్చట శ్రీకృష్ణుఁడు లేడు, ఆ వియోగ తృష్ణను శాంతింపఁజేసికొనుటకు క్షీరసాగరమునకుఁ బోఁగా నది యెండిపోయెను. సుమేరు శిఖరముమీఁద నెక్కఁబోఁగా నది రసాతలమున కణఁగిపోయెను. దైవవిడంబన మెంతటిదో! ఆమె 'నిత్య సంయోగస్వప్నమును జూచుచుండఁగా నింతలోనే వియోగ

జన్య దుఃఖగర్తమునఁ బడుచున్నది. శ్యామునితో నామెకు వియోగము కలిగెను. ఇంతవఱకును నయోగజన్య ఉత్కంఠత యుండెడిది. ఇప్పుడు వియోగజన్య వేదన కలిగినది.

శౌనకుఁడిట్లడిగెను:- "సూతా! అయోగ వియోగములకు భేదమేమి?"

సూతుఁడిట్లనెను:- "స్వామీ! ఒకానొకని రూపగుణములను వినియుఁ, జదివియును, ఇంకేవిధముగనైన నెఱిఁగినచోఁ బ్రేమ కలుగును; కాని ఆతని దర్శనము కాకున్నను, ఆతనితో నెన్నడును సంయోగము కలుగకున్నను, దానిఁ గూర్చి కొట్టుకొనుటకు అయోగమని పేరు. దీనిలో మిక్కిలి వ్యాకులత యుండును. మొట్టమొదట వ్యావహారిక లీలయందు శ్రీ రాధికాదేవి లలితాది సఖులతోఁగూడి పుష్పములను గోయుటకై బృందావనమున రాసస్థలి నికటమునకుఁ బోయిరి. అచ్చట నామె లలిత నిట్లడిగెను:- "సఖీ! ఈ స్థలమేమి? మిక్కిలి సరసముగనున్నది. మిక్కిలి సుఖదముగనున్నది. ఎంతో మనోజ్ఞముగనున్నది. తరంగాయితమైన యమునాతీర సైకతముచే నావృతమై, వివిధ విధములగు పుష్పభారముచే నమితమైన నికుంజ బాహుళ్యముగు నీ భూమినిఁ గాంచిన స్వతః నా చిత్తమాకర్షింపఁబడుచున్నది. ఈ స్థలమునకొక్క పేరేదో?"

లలిత యిట్లనెను - "దీనిపేరు రాసస్థలము."

"రాసస్థలమనఁగా నేమి? రాసస్థలమని దేనినందురు? ఇచ్చట నేమి జరుగును?" అమాయకముగ వృషభాను కుమారి అడిగెను.

లలిత యిట్లనెను:- ఇచ్చట శ్రీకృష్ణుఁడు రాసను రచించును."

"శ్రీకృష్ణుఁడా? శ్రీకృష్ణుఁడా? శ్రీకృష్ణుఁడెవరో?" ఆదుర్దాతో రాధిక అడిగెను.

"శ్రీకృష్ణుఁడు నందనందనుఁడు. యశోదా సుతుఁడు. వ్రజవల్లభుఁడు. రాసేశ్వరుఁడు శ్రీకృష్ణుఁడు."

ఇంకేమున్నది? శ్రీకృష్ణ నామము చెవినిఁబడగానే రాధిక మూర్ఛితయయ్యెను. లోలోన మనస్సులో శ్రీకృష్ణ నామమును మంత్రమువలె జపించుచుండెను. ఆతని నామము లోనే యిట్టి ఆకర్షణముండినచో నాతని మోహనమూర్తి యెట్లుండునో. శ్రీకృష్ణ దర్శనమెట్లు కాఁగలదు? నా యీ నేత్రములెట్లు సార్థకములు కాఁగలవు? అయ్యో! శ్రీకృష్ణ దర్శనము నాకెప్పుడు కలుగునో కదా! శ్రీకృష్ణుఁడెప్పుడు కృపఁజూపునో? ఎప్పడు నాఁ యీ కన్నులు సఫలములు కాఁ గలవు?" ఈ విధముగ నిరంతరము దర్శనము కొఱకు

ఉత్కంఠితులగుటయే అయోగము. ఇందులో నెల్లప్పుడును నుత్సాహముండును. నేఁడే దర్శనమగునని యుండును, దిన మంతయును బ్రతీక్షించుచుండినను దర్శనము కాకున్నచోఁ దన్నుదాను ధిక్కరించుకొనును. 'అయ్యో! నేఁడు వ్యర్థముగ గడిచినది కదా! ప్రియుని దర్శనము కాలేదు.' చిత్తమునకు మిక్కిలి దీనత వచ్చును. ఎవరైనను బ్రియుని గూర్చి చర్చించినచో నేత్రములు విప్పారును, నెమ్మొగిల్లి ఆనంద బాష్పములు రాలును, మనస్సులో గొప్ప ఆత్మగ్లాని కలుగును. నిరంతరమును నిర్వేదానుభూతి కలుగును. దర్శనము కొఱకు చిత్తమందు చింతకలుగును, దర్శనము కొఱకు చపలత్వము వృద్ధిపొందును. ప్రియుని విషయమును గూర్చి ఆలోచించుచుండ నాలోచించుచుండఁగా శరీరమునకు జడత్వము ప్రాప్తించును. దర్శనము కాకపోవుటచే నున్మాద మోహాదులును గలుగుచుండును. దీనినే అయోగమందురు. దర్శనమునకుఁ బూర్వము కలుగు విరహానుభూతికే అయోగ మందురు.

వియోగము సంయోగానంతరము కలుగును. ప్రియుని గలియుట జరిగినది. అతనితోఁ గమనీయ క్రీడలును జేసినది. సంయోగ సుఖ నుభవమును గలిగినది. తదనంతరము వెంటనే అతఁడు మనకు దూరమైనాఁడు. దీనినే వియోగ

మందురు. వియోగానంతరమునఁ గలుగు సహయోగమున నింకెక్కువ మాధుర్యముండును. సంయోగానంతరమున నే వియోగముండునో దానిలో గొప్ప మర్మాంతక పీడ యుం డును. నిరంతరమును సంయోగ సుఖస్మృతి యుండును. సమ్ముఖమున స్మరణము లేకుండిన లేకుండవచ్చును. కాని పరోక్షమున నన్నివిషయములును జ్ఞాపకమునకు వచ్చును. ఆ విషయములను జ్ఞాపకమును జేసికొని మనస్సులో గొప్ప సంతాపము జెందును. శరీరము కృశించును, నిద్ర తగ్గి పోవును. నిద్ర రానేరాదు. ఒక్క కూర్కువచ్చినా మరల నాతని విషయములే జ్ఞాపకమునకు వచ్చును. ఆలంబశూన్య తానుభవము కలుగును. అయ్యో! ఆతఁడు లేక మేమెట్లు జీవింపఁ గలము? ఆతని దర్శనము లేక యీ ప్రపంచమున నెవని యాశ్రయమును జీవితమును గడుపఁగలను ? ఎవని ముఖమునుగాంచి ధైర్యధారణ మొనర్తును? ధైర్యము సడలి పోవును, శరీరమునకు జడత్వము ప్రాప్తించును, ఏ పనిచేయు టకును మనస్సుపోదు. శరీరమునకు రోగగ్రస్తమై నట్లుం డును. ఇంటిలోని వారు వైద్యులను బిలిపించుచుందురు. వైద్యులు వాతపిత్త శ్లేష్మములలో నేదో నిర్ణయించెదరు. కాని యీ వ్యాధి త్రిదోష జన్యమైనది కాదు. విరహవ్యాధి చికిత్సను దన ప్రియుఁడు తన చేతితోఁ దాఁకి నివారణము

చేయఁగలఁడు. విరహమునం దున్మాదము, మూర్ఛ, ఇంతెం దాలకు మృతావస్థవలె నగును. నిరంతర మాతనినే ధ్యానించు చుండును. జిహ్వా అతని నామమునే నిరంతర ముచ్చరించు చుండును నేత్రము లాతని కొఱకు అశ్రువులను గార్చు చుండును. శ్రీకృష్ణ విరహమున రాధిక కిట్టి దశలన్నియును గలిగినవి.

శ్రీకృష్ణుఁ డంతర్హితుఁడు కాఁగానే ఆమె సంయోగ సుఖమును స్మరించుచుఁ దన గర్వమునకు మాటిమాటికిఁ బశ్చాత్తాపమును జెందుచు రోదన మొనర్చ నారంభించెను. ఆమె వనములందు రాత్రులలోఁ దిరుగుచు నేడ్చుచుండెను. హాఁ నాథా! ప్రాణాధికా! అబలనగు నన్ను నిబిడవనమున నొంటరిగా వదలి యెచ్చటికిఁ బోయితివి? ప్రియుఁడా! రమ్ము! రమ్ము? దర్శన మొసంగుము. ఒక్కసారి కౌగిలించుకొనుము. బాధ పెట్టకుము, రసమును వర్షింపఁ జేయుము. అమృతము నొసంగుము. ప్రియుఁడా! నీకుఁ గోపము వచ్చినదా? నీదాసను నన్నెన్నడైన స్మరించెదవా? నే నపరాధ మొనర్చితిని. అవశ్య మపరాధ మొనర్చితిని. కాని, యికఁ నిట్లు జరుగదు. ఇప్పుడు నేను చేసిన దానికి ఫలము ననుభవించితిని. నీ మధుర స్వరూ పము నా కన్నుల యెదుట నాట్యమాడుచున్నది; కాని నీవు నన్నుఁ గౌగిలించుకొనక దూరదూరముగఁ బోవుచున్నావు. ఓట్లు చేయుచున్న వయ్య నా జీవన సర్వస్వమా! రమ్ము! రమ్ము!

నీ బాహువులెంత పెద్దవి! ఆ బాహువులమధ్య నన్ను బిగిం పుము. నీతో నెన్నటికిని విడిపోకుండునట్లుగ బిగింపుము. శ్యామ సుందరా! రమ్ము? రమ్ము! నన్నపుడు గన్నుల నీరు తేరంత వఱకు ఆనందముగ నుండును. 'అతిసర్వత్ర వర్జయేత్' నీవతి యొనర్చుచున్నావు. నాకు గావలసినదానికంటె నధిక క్లేశ మును గలిగించుచున్నావు. ఇచ్చటికిఁ దెచ్చి నన్నీ నిబిడారణ్య మునఁ ద్రోచివైచితివి. నీ సాన్నిధ్యమున నిబిడారణ్యమును నందనోద్యానమగును; కాని నీవు లేకున్న వైకుంఠగోలోక ములును శూన్యమై కోటికోటి నరకములకంటెను క్లేశ దాయకముగ నుండును. నందనందనా! ఇంక నాలశ్యము చేసిన లాభము లేదు. ఈ ప్రాణములు పోయినతరువాత నీవు వచ్చినను బ్రయోజన మేమికలదు? పొలములోని పైరెండిన తరువాత నింద్రుఁ డమృతవర్షమును గురిపించినను నేమి ప్రయోజనముకలదు. వ్యర్థమే కాఁగలదు.

సూతుఁ డిట్లనెను:- "మునులారా! ఈ విధముగ సుకుమారియగు గిరికుమారి యేడ్చుచు నేడ్చుచు వ్యాకుల యయ్యెను. ఏడ్చియేడ్చి ఆమె గొంతు బొంగురుపడెను. ఆమెకు శరీరస్పృహ లేదు. ఆమె మూర్ఛితయై తటుక్కున నేలమీఁదఁబడెను. ఆమెకు శరీర స్పృహలేక శ్రీకృష్ణ విరహమునఁ బదవస్థితి కలిగెను. ఆమె మృతతుల్యయై దీర్ఘ నిశ్వాసములను విడువనారంభించెను. ఆమెకింక జీవితాశ లేకుండెను.

# కృష్ణ విరహమున వ్రజాంగనల తన్మయత

గు 3

శ్లో॥ తన్మనస్కా స్తదాలాపా స్తద్విచేష్టా స్తదాత్మికాః।
తద్గుణానేవ గాయన్త్యో నాత్మాగారాణి సస్మరుః॥

శ్రీ భాగ. ౧౦ స్కం. ౩౦ అ. ౪౩ శ్లో॥

మ॥ అని యిబ్భంగి లతాంగు లందఱును
బృందారణ్య మందీశ్వరున్
వనజాక్షుం బరికించి కానక విభున్
వర్ణించుచున్ బాడుచున్
మనముల్ మాటలుఁ జేష్టలుం గ్రియలు
సమ్యాఙ్నాథుపై జేర్చి వే
చని రయ్యామున సైకతాగ్రమునకున్
సంత్యక్త గేహేచ్ఛలై ॥

శ్రీ మదాంధ్ర భాగవతము.

ఒకసారి యీ జీవుఁడెన్నఁడో సుఖమూపుఁడగు సర్వే శ్వరుని సంగసుఖము ననుభవించినాఁడు. ఆ సుఖమునే యీతఁడు రాత్రింబవళ్లు వెదుకుచుండును. మంచి మెత్తని శయ్యను గాంచి, భ్రమవశమున దానిలో సుఖమున్నదని

భావించును; కాని దానిలో సుఖమెక్కడిది? ఎప్పుడో ఆత నికి నాఱీ యధరామృతాభాస సుఖము కనఁబడును. కాని దానితో నీతని దప్పిక తీరదు. అది జలమైన దప్పిక తీరును. అవి ఎండమావులుగదా! మృగమరీచికలచే నింతవఱకెవ్వడును దప్పికను దీర్చుకొనలేదు. ముత్యపు చిప్పయందు మెఱుఁగును గాంచి వెండియనుకొని పరువిడును. దీనిలో సుఖమున్నదా? మిథ్యయును, నశాశ్వతమునగు దానియందు శాశ్వత శాంతి యెట్లు లభింపఁగలదు. లభింపదు. జీవుఁడు దశ దిశలందును దిరుగుచుండును. సమ్ముఖమున నేదైన వృక్ష, పశు, పక్ష్యాదులు కనఁబడెనా, వానిని సుఖస్వరూపుని జాడ నడుగుచుండును. కాని అవియును నీతని నన్వేషణములో నున్నవి. తానే అంధుఁడైనచో నితరులకుఁ ద్రోవయేమి చూపఁగలడు. జీవుఁడిదే విధముగఁ దిరుగుచుండును. తిరుగఁగాఁ దిరుగఁగా శ్యామసుందరుఁడు తన యభిమాన కారణమున సంతర్హితుడైనాఁడని తెలిసికొనును. ఇంటిలోఁ బోయిన సూదినిఁ బొలమున వెదుకుట మూర్ఖత కాదా? ఆతఁడు లోపలనుండిన మనము బయట వెదుకుచున్నాము. ఇంటిలో నున్నవానినిఁ బొలములోఁ బిలుచుచున్నాము. ఇప్పుడెచ్చటను వెదుకవలసిన పనిలేదు. యాత్రలక్కఱలేదు. ఎచ్చటనుండి వెదుకుచు వచ్చుచుంటివో అచ్చటికే పొమ్ము. చంచలత్వమును వదలి

స్థిరుఁడవుకమ్ము. మఱలఁ బులినమునకు రమ్ము. బాహ్య దృష్టిని బంధింపుము. లోలోన నాతని ననుభవింపుము. ఆతఁడెచ్చటికినిఁ బోలేదు. మానమునకు భయపడి యెచ్చటనో దాగినాఁడు. నీవభిమానమును దొలఁగించుకొనుము. అచ్చటనే ప్రత్యక్షము కాఁగలడు. ఆతఁడు దూరమునుండి రానక్కఱలేదు. మణిమీఁద నావరణమును పడినది. ప్రకాశించుట లేదు. ఆవరణమును దొలిగించిన స్వయముగఁ బ్రకాశించును. భవనమందలి సమస్త వస్తువులను బ్రకాశింపఁ జేయును. బాహ్యాన్వేషణమును విరమింపుము. లోపల వెదుకుము. నీకు సుఖస్వరూపుఁడగు శ్యామసుందరుఁడు దొఱకును. అవశ్యము దొఱకును. మఱల సంయోగ సుఖము నొసంగును. మఱల నాతని హృదయమునకు హత్తుకొనును. శరీర తాపము నణఁచును. ఒక్కసారి ప్రియుని ఆలింగన సౌఖ్యమును బొందిన మఱల దానిని మఱచునా? ఒక్కసారి సుఖమునొసంగి శ్యాముడు తృష్ణను బెంచును. యోగిధ్యానమునఁ దనలోనే చూచుకొనును. బ్రహ్మ సంస్పర్శసుఖమును బొందును. తన్మనస్కుఁడై తదాలాపమందే కాలమును గడుపుము. గృహదారా పుత్రాదులను స్వతః మఱచిపోయెదవు. మణిమాణిక్యములు ప్రాప్తించునప్పుడు గవ్వల నెవఁడేరుకొనును!

సూతుఁ డిట్లనెను:- "మునులారా! శ్రీ రాధాకృష్ణ విహారలీలారసము ప్రాకృత పదార్థము కాదు. దీనినిఁ బాన మొనర్చు నధికారులు విరళముగ నుందురు. అట్లయిన దీని నందఱముందు బెట్టుటెందులకు? ప్రకటించుటవలన నెవఁడైన నధికారి యుండినచో నొక్కఁడు గ్రహించినను జాలునని యే అనధికారియగు వాఁడిదివ్యర్థమని మానుకొనును. రాధికా సమ్ముఖమునుండి అంతర్హితుఁడగుట ఆతని క్రీడా మాత్రమే రసాభివృద్ధి కది అభినయమే, రాధిక మదనమోహనుని మాధురికి మధుపాత్రయే. చిత్తచోర చంద్రునకు మదచకిత చకోరం అట్టి బృందావన విహారిణితో విరహ మెక్కడిది? ఆమె ఆతని హృదయేశ్వరి. ప్రాణప్రియ. కాని నిత్య నవ నవ లీలాభినయముచే రసవృద్ధియగును. ప్రేమరూపమగు ననంతసాగరమున నుత్తాల తరంగములు వచ్చుచుండును. దానివలన నది శబ్దించుచుఁ బొంగుచున్నట్లుండును. దానిలో నవ చేతనతాస్ఫూర్తి కనఁబడును. అందులకే లీలా లీలా విలాసము.

మునులారా! రాధికా 'హా నాథా! రమణ! ప్రేష్ఠ! ఎచ్చటికిఁ బోయితివి? ఎచ్చటికిఁ బోయితివి?" అని పలుకుచు గేకలు వేయుచు, మూర్ఛితయై క్రిందఁబడిపోయెను. అచేతన యయ్యెను. ఇంతలోనే శ్రీకృష్ణాన్వేషణ మొనర్చుచుఁ

దిరుగుచుండిన శ్రీకృష్ణ విరహమున వ్యథనుజెంది వ్యాకుల లైన వ్రజాంగనలును నచ్చటకుఁ జేరుకొనిరి. రాధికయొక్క యీ దశను గాంచి వారు దుఃఖించిరి. కొందఱకు లోలోన నానందము కలిగెను.''

''శౌనకుఁ డిట్లడిగెను:- ''సూతా! ఇతరుల దుఃఖమును గాంచి సుఖానుభవమును జెందుట ఖలుల లక్షణము. శ్రీకృష్ణప్రేమ కలవారును, ఉచ్చకోటిలోఁ జేరిన భావము గల్గినా గోపికలు మూర్ఛను జెందిన రాధికాదేవినిఁ గాంచి ఆంతరిక సుఖమును జెందుటకుఁ గారణ మేమి?''

నవ్వి సూతుఁ డిట్లనెను:- ''స్వామీ! ఈ ప్రేమ మార్గమే ఇట్టి వక్రమైనది. ఇంతవఱకును రాధికా సౌభాగ్యమును గాంచి యీర్ష్యను జెందువారు, ఆమెయును దమ వలెనే కొట్టుకొనుటను గాంచిన నాత్మతోషమును జెందుట స్వాభావికమే. మన మైశ్వర్య మదమత్తులను గాంచు చున్నాము. వారు మనతోఁ బలుకనైనఁ బలుకరు. కాలాంతరమున వారును మనవలె భిక్షమెత్తుకొనుటను గాంచినచో నొకవిధమగు ఆత్మతుష్టి కలుగును. అప్పుడాతని యెడల సహానుభూతినిఁ బ్రకటించెదము. అంత నాతనితో నాంతరిక స్నేహము కలుగును. ఏలననఁగా స్నేహము సమాన గుణ శీలములు కలవారికే కలుగును. ఎచ్చట, గొప్ప. కొద్ది, ఉచ్చ

నీచ, ధనికుడు, పేదవాఁడు, పండితుడు మూర్ఖుఁడను భావ ముండునో అచ్చట ప్రేమ యుండదు. శిష్టాచారముండిన నుండవచ్చును. ఇద్దరు నొకే మార్గమువారై యుండవల యును. ఇద్దరును నొకే యుద్దేశ్యము కలవారై యుండవలెను. ఒకేస్థితిలో నుండవలయును. అప్పుడే స్నేహము కుదురును; పెరుగుచుండును. అప్పుడు కలిసి ఉద్దేశ్యప్రాప్తికొఱకు సమ్మి ళిత సాధన చేయవచ్చును. అప్పుడు శ్యామసుందరుఁడు వివ శుఁడై వచ్చితీరవలయును. అందువలననే గోపికల కీర్ష్య కలిగి నదో లేక ఆత్మసంతోషము కలిగినదో, అది శ్రీకృష్ణ ప్రాప్తికొఱకే జరిగినది. ఎట్లనఁగా నింతటి భాగ్యశాలిని తోడు దొఱకినచో శ్యామసుందరుని వెదకి కనుగొన వచ్చును. అందువలన వారందఱును వచ్చి రాధికాదేవి యెడల సహానుభూతినిఁ బ్రదర్శించుచుండిరి. కొందఱామెపైని దుమ్మును దులుపుచుండిరి. కొందఱామెను లేవఁదీసి తన కోమల సుకుమారములగు తొడలపైఁ బరుండబెట్టుకొనెను. ఇంకొక యామె సుకుమార చరణములను దన వడిలోఁ బెట్టుకొనెను. తరువాత మెత్తని చేతులతో వత్తనారంభిం చెను. ఇంకొకతె పరువిడి పుష్కరిణీ కమల పత్రములను గోసికొని తెచ్చి ఆమెకు గాలిని వీచుచుండెను. సుందర సుగంధిత శీతలజలమును ఆమె శరీరముపైఁ జిలుకుచుండెను.

ఒకవనిత కమలనాళ సదృశములగు తన చేతివ్రేళ్లతో నామె తలనెత్తి, ఆమె చెవిలో శ్రీకృష్ణ శ్రీకృష్ణయను మహా మంత్రమును ధ్వనింపఁ జేయుచుండెను.

కర్ణకుహరములలో శ్రీకృష్ణ మంత్రమును జెప్పఁగనే రాధకు తన తన చెవులలో నెవరో అమృతమును గ్రుమ్మరించు చున్నట్లుండెను. ఏదియో గొణుఁగుచుఁ దన నేత్రములను దెఱచి వెంటనే యిట్లనెను:- "ప్రియుఁడా! ఎచ్చట నున్నావు? ప్రియుఁడా! ఎచ్చట నున్నావు? ప్రియుడా! నీ వెచ్చటికిఁ బోయితివి?"

రాధనోట యీ శబ్దమును వినఁగానే అందఱకును సంతోషము కలిగెను. రాధికకు ప్రాణము శరీరము కలదని అందఱకును ధైర్యము కలిగెను. ఆమె స్థితి మృతకశరీరమువలె నుండెను, నాతోత్తుగ మృతకదశ ఆమెకు ప్రాప్తింపలేదు. అందువలన నామెకుఁ దెలివి తెప్పించుటకై వారిట్లనిరి:- "ప్రియా! లెమ్ము; లెమ్ము. మాకు శ్రీకృష్ణుని జాడను జెప్పుము. కృష్ణుఁడు మమ్మువదలి నిన్నొక్కదానినిఁ దీసికొని యిచ్చటినుండి పోయినాఁడు. అతఁ డెచ్చటికిఁ బోయినాఁడు."

వెంటనే రాధ నోటినుండి యిట్లు వెలువడెను "అతఁడు నన్నునిడిచిపోయినాఁడు."

"నిన్నాతఁ డెన్నఁడును వదలఁజాలఁడు. నీ వాతని ప్రాణప్రియవు. నీ ముఖమును జూచుచుండుటయే ఆతనికి జీవనము. ఆతనికి చిత్తము నిన్నుఁ జింతించుటకే. ఆతఁడు గోచారణాది కార్యము లొనర్చుచున్నను బాహ్యముగ నొనర్చుచుండినను, నిరంతరము నీ సుందర ముఖమును జింతించుచుండును, ఆతఁడు నిన్నెట్లు వదలఁగలఁడు? అసంభవము, సర్వథా అసంభవము. మేము త్రికాలములందును నీ విషయమును విశ్వసింపఁజాలము."

"అవునా? శ్యామసుందరుఁడు నన్నింతగాఁ బ్రేమించుచున్నాఁడా? నేను నమ్మను. ఒకవేళఁ బ్రేమించుచున్నాఁడేమో! శ్రీకృష్ణ ప్రేమ జ్ఞాపకమునకు రాఁగానే ఆమెకు సమాధిభంగమయ్యెను. ఆమె లేచికూర్చుండెను. ఆమె యిట్లడిగెను:- "అక్కలారా! మీరిచ్చటికెచ్చటినుండి వచ్చితిరి. ప్రియుఁడెచ్చటికిఁ బోయినాడు?"

రాధకు తెలివి వచ్చుటచే నందఱకును నానందము కలిగెను. ఆమెను వడిలోఁ బరుండఁబెట్టుకొనిన గోపిక మందహాస మొనర్చుచు రాధిక హృదయము పదపడ కొట్టుకొను చోటఁ దన కోమలకరమును బెట్టుచు నిట్లనెను - "మాకు గనఁబడకుండునట్లు ప్రియుని నీవిచ్చట దాచుకొనినావు."

రాధిక యిదివిని లజ్జితయయ్యెను. విశాలముగఁ గమలముల వలె నుండిన నామె కనుకొలకులనుండి ముత్యముల

వలె స్వచ్ఛములగు నశ్రుబిందువులు వెలువడి గుండ్రని బుగ్గల మీఁదుగా జారవిడుచు హృదయేశునకు అర్ఘ్యమిచ్చుచున్న దాయనునట్లుగ హృదయముమీఁదకు జారెను. ఆమె సఖులం దఱిమీఁద దృష్టిని సారించుచు నిట్లనెను:- "సఖులారా! నేను గర్వించితిని. నా సౌభాగ్య సుఖమును జూచుకొని గర్వించితిని. నేను ప్రేమగర్వితయగు వనితనైతిని. నేను సౌభాగ్య మదమున మదనమోహను నవమానించుటచే నాతఁడు కోపమును జెందినాఁడు. అభాగినినగు నన్ను వీడిపోయినాఁడు" ఇట్లు పలుకుచు రాధిక మరల విహ్వాలయయ్యెను. మరల తన సఖి వడిలోఁ బడిపోయెను. సఖులందఱును వెక్కి వెక్కి యేడ్వనారంభించిరి. "శ్యామసుందరా! రమ్ము, రమ్ము! అధికముగ బాధింపకుము."

శ్యామసుందరుని నామమును వినఁగానే రాధయొక్క మూర్ఛ మరల భంగమయ్యెను. ఆమె యిట్లనెను:- "సఖీ! శ్యామసుందరుఁడు వచ్చినాఁడా యేమి?"

చతురయగు నొక సఖి యిట్లనెను:- "మొదట వేణు నాదమొసఁగిన చోటుననే శ్యామసుందరుఁడున్నాఁడు."

"రాసస్థలిలోనా?" అని వెంటనే యీ శబ్దములు రాధికా ముఖమునుండి వెలువడెను,

సఖి యిట్లనెను:- అవును. రాసస్థలమున రాసేశ్వరుఁ డవశ్యముండఁగలఁడు. అచ్చటఁ గూర్చుండి మనలను బ్రతీక్షించుచుండును."

"అయితే, మన మీ సమయమున నెచ్చట నున్నాము? మనమిప్పుడు రాసస్థలిలో లేమా? రాసస్థల మెంతదూరమున నున్నది సఖి!" రాధికాదేవి నోటినుండి యీ మాటలు వెలువడినవి.

సఖి యిట్లనెను:- "మనము గహ్వారవన నికటమున నున్నాము. రాసస్థల మిచ్చటి కల్పదూరమున నున్నది. దూరమునుగాదు దగ్గఱనే యున్నది."

"అయితే అచ్చటికే పోవుదము. కాని మార్గమున నుండిన వనములను వెదుకుకొనుచుఁ బోవుదము. ఇచ్చ టెచ్చటనైన దాగియుండవచ్చును. ఆతఁడు మోసగాడు. దగ్గఱగానున్నను దూరమునఁ గనఁబడును. ఒక్కొక్కప్పుడు దూరముననున్నను దగ్గఱగఁ దోచును. ఇప్పుడు వెలుఁగు వచ్చినది. నల్లగానున్న నాతఁడు కనఁబడును. అంధకారమున నాతఁడా రూపములోఁ గలిసిపోవును. అప్పుడాతని వెదుకట మిక్కిలి కష్టమగును. ప్రకాశము సహాయమున నాతని జాడను దెలిసికొందుము. వెన్నెలలో మనమాతని వెదుకుదము." ఇదివిని వారందఱొక్కసారిగా బయలుదేరిరి.

ప్రకాశ సహాయమున నన్వేషింపసాగిరి. కాని కృష్ణుఁ డే సహాయమునను దొఱకఁడు. ఆతఁడు దొఱకవలయునను కొనినఁ దనకుదానే ప్రకటమగును. ఆ వ్రజాంగన లా రాత్రి వెన్నె లలో నాతని నొక వనమునుండి యింకొక వనమునకుఁ బోవుచు వెదకుచుండిరి. శ్యామసుందరుఁడు దొఱకనేలేదు.

చంద్రికా ప్రకాశము మందమయ్యెను. వనమందు తస్కరుఁడగు కృష్ణుని సామ్రాజ్యము వ్యాపించెను. నీల మేఘము కప్పుటచేఁ జంద్రుని ముఖము మ్లానమయ్యెను. గోపిక లలసిరి. వారి ఐశ్వర్యమదము మొదటనే అణఁగినది. ఇప్పుడు వెదుకవలయునను ప్రయత్నమును జారిపోసాగెను. శ్రీకృష్ణుఁడు మన ప్రయత్నముచే లభింపఁడు. ఆతఁడు తనం తట దానుగా వచ్చి, మనలను లేవఁదీసి కౌఁగిలించుకొన్న నే ఆతని ప్రాప్తి సంభవము. తానుగా వచ్చి చేతులను జాచి మన నోటినిఁ దెఱచి అమృతమును గ్రుమ్మరించిననే అమర త్వము సంభవమగును. స్వయముగ మన ప్రయత్నమున నాతనిఁ బొందఁజాలము, చంద్రకాంతిమీఁద విశ్వాసముం చఁగా నదియును మందగించినది. వనమునఁ దమస్సుయొక్క సామ్రాజ్యము వ్యాపించెను. ఇప్పుడు రాసస్థలమునకుఁబోయి కూర్చుండి ఆతని కృపకై ప్రతీక్షింపవలయును. ఆతని నామ గుణములతోడనే కాలక్షేపమొనర్చెదము. ఎప్పటికైనను నాతఁడు కృపఁజూపఁగలఁడు.” అని యాలోచించుకొని

వారెచ్చటినుండి బయలుదేరిరో అచ్చటికే చేరిరి. ధైర్యముగ సాధనరతి ననుకరించుచుండిరి.

అంత శౌనకుఁ డిట్లడిగెను:- "సూతా! సాధనరతి యన నేమి?''

సూతుఁ డిట్లనెను:- ''స్వామీ! రస శాస్త్రమునందు రతికి అనంత భేదములు చెప్పఁబడినవి; కాని సామాన్యముగ రతి రెండు విధములు. ఒకటి సిద్ధరతి, రెండవది సాధనరతి. సిద్ధరతిలో సాధన యేమాత్రము నుండఁజాలదు. మూర్ఛ, లేక మృతకావస్థయందుండి నిరంతరమును ప్రియ భావనా భావితులై యుందురు. నామ, రూప, లీలా ధామముల స్మృతి యేమియు నుండదు. రాధికాదేవి మొదట బడియుండఁగా సఖులు చూచినారే అదియే సిద్ధరతి. సాధనరతియందు ఆతని ప్రతీక్షించుచుఁ గాలము గడుచుటకై కొన్ని సామాన్య సాధనలుండును. తమ సాధనలచే శ్యామసుందరుఁడు వివశుఁడై పరుగెత్తుకొని రాఁగలఁడను భావనమిందుండఁబోవదు. ఇట్టి భావనా గంధమైన నుండదు. వచ్చినచోఁ దనకుఁదానే రాఁగలడు. కాని కాలమెట్లు గడుచుననియును, అపరాధ మొనర్చుటయును వారెఱుఁగరు. తమ యపరాధముల వలన నాతఁడు దాగినాఁడనునది యుండదు. తన అపరాధములచే సాధకునకు క్షోభము కలుగును. కాని వానిని మఱపించును.

అయినదేమో అయినది. పాపము వచ్చినదేమో వచ్చినది. ఇప్పుడట్లు చేయక ఆతని నామగుణములను గానమొనర్చుచుఁ గాలమును వెడలఁబుచ్చుకొనవలెనను భావన సాధన రతిలో మొదటగా నుండును.

మనకు మిగిలిన సమయము వ్యర్థము కాఁగూడదను భావ మింకొకటి యుండును. ప్రియతముని౯ జింతింపక ఒక్క-క్షణమైనను వ్యర్థము కారాదు. దీనికొఱకై సాధకుఁడు నిరంతరము జిహ్వాతో నాతని నామోచ్చారణమును గావించు చుండును. మనస్సుతో నాతని రూపమును జంతించు చుండును. భగవంతునకును భక్తులకును మాటి మాటికి సాష్టాంగ ప్రణామ మొనరింపవలయును. ఆతని స్మృతి యందు నిరంతరము నేత్రములనుండి అశ్రువులను రాల్చు చుండును. ఇట్లు జరుగుచున్నను దన కాలము వ్యర్థముగ గడచుచున్నదను భావము వచ్చుచుండును. అయ్యో! నిరంతరము భగవత్ స్మృతి కలుగుట లేదే యనుకొనును.

ఈ సమయమున స్త్రీ, పుత్ర, ధన, పరివారములందును, సమస్త ప్రపంచమందును విరక్తికలుగును. ఇదివఱలో నే ధనము కొఱకు ప్రాణములనైన నొసంగెడు వాఁడో హృదయమందు రతి కలుగఁగానే యివియన్నియును దుచ్ఛముగఁ గోచును. ప్రియునికై సమస్తమును దృణమువలెఁ

ద్యాగ మొనర్చును. ఆతనికిఁ దన సర్వస్వమును సమ ర్పించును.

ఈ స్థితిలో మానము బొత్తుగా నశించును, రూప, కుల, ధన, యౌవనాద్యహంకారములన్నియును నభావములై పోవును. అందఱితోఁగూడి సమానభావముతోఁ గూర్చుండి, తన సాధ్య ప్రాప్తికొఱకు నిరభిమానుఁడై కలిసి తిరుగును. ఎవరినిఁ గాంచినను నమస్కరించును.

ఎప్పుడో ఒకప్పుడు ప్రియుని గృపకలుగును. ఎప్పుడో ఒకప్పుడు స్వీకరింపఁగలఁడు. ఈ యాశతోడనే వారు కాల యాపన మొనర్చెదరు.

సాధనరతిలో సముత్కంఠత సదా ఉండును. ప్రియుని రూపమును స్మరించి, ఆతని గుణములను జింతించి, ఆతని సమాగమము కొఱకు పడు తహతహకు సముత్కంఠత యని పేరు. ఈ ఉత్కంఠత ప్రతిక్షణమును నుండును. ప్రియుఁ డిదిగో వచ్చుచున్నాఁడు. అదిగో వచ్చుచున్నాఁడు, ఆతని దర్శనము గాఁగలదు. నేఁడు నా నేత్రములు సఫలము లగును,

ఉత్కంఠతకు తోడుగాఁ బ్రియుని సుమధుర నామ గానమునం దత్యధికముగ నభిరుచి ఉత్పన్నమగును. హే నాథ! హే రమణ! హే మహాభుజ! ఓ ప్రియా! ఓ నా కను

పాపా! ఎప్పుడు వచ్చెదవు? నా శరీరతాపము నెప్పు డుపశమింపఁ జేసెదవు?" అని యీ విధముగ నిరంతరము జిహ్వతోఁ బ్రియుని నామమును బలుకుటలో నొక విధమగు ఆంతరిక సుఖానుభూతి కలుగును.

ఏ స్థలములందు కృష్ణుఁడు కమనీయ క్రీడలొనర్చెనో ఆ స్థలములందు స్వాభావిక ప్రీతికలుగును. ఆ స్థలములను గాంచి వానిని స్మరించుటచే నుద్దీపనము కలుగును. ఇచ్చటఁ బ్రియుఁ డీ లీలల నొనర్చినాఁడు. ఆ స్థలమున నీ సంఘటనము జరిగినది. ప్రియుని ఆ స్మృతి స్థానములకుఁ బోవుటయును, ఆతని మనోవాక్కాయములతోఁ గరములఁ బూజించుటయు, నా స్థలములందాదరముంచుటయు, నిదియును రతికి సర్వ శ్రేష్ఠమగు సంగము.

అన్నిటికంటె నధిక రతివృద్ధికి గారణము తద్గుణాఖ్యాసక్తి. ప్రియుని సౌందర్య మాధుర్యములను, ఆతని లీలాగాన మొనర్చుటయును, వాని ననుకరించుటయును, వానిని శ్రవణ మొనర్చుటయును నీ సమస్త కారణములచే సాధన రతి వృద్ధియగును.

సూతుఁడిట్లనెను:- "మునులారా! ఆ గోపికలు తిరిగి శ్యామసుందరుఁడు మొట్టమొదటి వేణుగానమును గావించిన స్థలమునకు వచ్చిరి. అచ్చట వారు తమ పొరబాటునకుఁ

బశ్చాత్తాపము పడుచు, మానశూన్యులై ఉత్కంఠాపూర్వకముగ శ్రీకృష్ణదర్శనాశచే నా స్థలముల యెడల నాదరమును బ్రదర్శించుచుండెను. భగవన్నామములను నుచ్చస్వరమున గానమొనర్చుచు, నాతని గుణములను గానమొనర్చుచు నిల్లువాకిలిని, గృహ పరివారమును మఱచి శ్రీకృష్ణ స్మృతియందే తమ కాలమును సదుపయోగమొనర్చుచుండిరి. అందఱును బరస్పరమును గలిసి శ్రీకృష్ణ గుణ గాన సంబంధమునఁ బాడిన పాటకు గోపికా గీతలందురు. ఆ గీతలను గూర్చి దిగ్దర్శముగ ముందు వర్ణించెదను. మీ రందఱును మధురాతి మధురములగు నా గీతను బ్రేమపూర్వకముగ శ్రవణ మొనర్పుఁడు.”

